

మౌలానా అబుల్ కలామ్ ఆజాద్

జననము : 1888 : : మరణము : 1958

# మౌలానా
# అబుల్ కలామ్ ఆజాద్

ఆంగ్ల రచన:

మహదేవ్ దేశాయి

ఆంధ్రీకరణము:

కాటూరి వేంకటేశ్వరరావు

సంస్కృతి ప్రచురణ

(69)

వెల రెండు రూపాయలు

# విషయసూచిక

# మా మాట

మౌలానా అబుల్ కలాం ఆజాద్‌గారు కాంగ్రెస్ అధ్యక్షులైన కొత్తలో, 1940వ సం॥లో, కీర్తిశేషులు మహాదేవ్ దేశాయిగారు ఆంగ్లంలో ఆజాద్‌గారి జీవిత చరిత్రను రచించారు. ఆ ఆంగ్ల మాతృకకు ఇది తెనుగుసేత. అందుచేతనే యీ రచనలో ఆజాద్‌గారు బ్రతికివున్నట్లే విషయాలు వివరింపబడియున్నవి.

1959లో ఆజాద్‌గారి సంభాషణలనుంచి శ్రీ హుమాయూన్ కబీరుగారు 'ఇండియా స్వాతంత్ర్యం సంపాదించింది' అని 'ఆజాద్‌గారి ఆత్మకథ'లో మొదటి భాగాన్ని ఆంగ్లంలో ప్రచురించారు.

1940 నాటి రచన అయినా కీ॥ శే॥ మహాదేవ్ దేశాయిగారి రచన గనుకనూ, ఆజాద్‌గారి జీవితాన్ని విపులంగా వివరించియున్నందుననూ దీనిని అనువదింపించి ప్రచురించుచున్నాము.

అడుగగనే తెనుగు అనువాద-ప్రచురణలకు అనుమతి నిచ్చిన లండన్‌లోని జార్జి అలెన్ అండ్ అన్‌విన్ కంపెనీ వారి కెంతయు కృతజ్ఞులము.

ఆంధ్ర పాఠక మహాశయులు యీ ఉద్గ్రంథాన్ని ఆదరించగలరని ఆశిస్తున్నాము.

మద్రాసు–2
1–12–59

విధేయులు,
ప్రకాశకులు

# తొలి పలుకు

1920 నాఁటి నుండి మన ప్రజోద్యమములో మౌలానా అబుల్ కలామ్ ఆజాదుతోఁ గలిసి పని చేయు భాగ్యము నాకుఁ గలిగినది. ఇస్లాము ధర్మవేత్తలలో ఆయనను మించినవారు లేరు. ఆయన అరబ్బీ భాషా పాండిత్య మగాధమైనది. ఇస్లాము ధర్మముపట్ల విశ్వాసము, ప్రజలయం దభిమానము– ఈ రెండును రెండు కన్ను లాయనకు. నేఁడు మన కాంగ్రెసుకు ఆయన మహాధినేత యగుటలోని పరమార్థమును భారతీయ రాజనీతి వేత్తలు గమనించి తీరవలెను.

సేవాగ్రాం, వర్ధా
18–5–1940

యం. కె. గాంధి

## ACKNOWLEDGEMENT

*We are thankful to* GORGE ALLEN AND UNWIN LIMITED, *40, Museum Street, London for granting us the Telugu translation and publication rights of their English publication* MULANA ABUL KALAM AZAD *by late Mahadev Desai. This is our Telugu version.*

Madras-2
20-12-1959

THE PUBLISHRS

# అవతారిక

నేఁడు ఇంగ్లండులో నందఱు చదువవలసిన గ్రంథ మిది. లోకరంగమున ఇండియాది ముఖ్య పాత్రమైనను దానిని గూర్చి మనకు అంతగా వినుపించువారు లేరు. ఇండియా వ్యవహారముల ప్రస్తావన వచ్చినపుడెల్ల అచటఁ దొమ్మిది కోట్ల ముస్లిములు ఇరువది కోట్ల హిందువుల కెదురొడ్డి మోహరించియున్నట్లు చిత్రించుచుందురు. ఆ చిత్రణము అయథార్థమని ఈ గ్రంథము చదివినచోఁ దెలిసి వచ్చును. శ్రీ దేశాయి ఈ గ్రంథములో హిందూ ముస్లిము విభేదములను తగ్గించి చెప్పినది లేదు. కాని, ఇస్లాము ధర్మముపట్ల అమిత శ్రద్ధాభక్తులుగల ఇప్పటి కాంగ్రెసు అధ్యక్షుఁడు మౌలానా అబుల్ కలాం ఆజాదు, ఆయన సహచరులగు అనేకులు హిందువులు ముస్లిములు ఆ విభేదములను మాన్పుటకై చిరకాలముగా నెట్లు పాటుపడుచున్నదియు ఈ గ్రంథమున విశదము గావించెను. అధిక సంఖ్యాకులగు ప్రజలమాటయే అంతటఁ జెల్లుబడి కావలెనని కాంగ్రెసు మహాసభ పట్టుపట్టుచున్నదని ఇచటఁ జాలమంది నమ్ముచుందురు. నిజమునకు, స్వతంత్ర ప్రజారాజ్యమున అల్పసంఖ్యాకులగు వివిధ మతస్థులకు రక్షణ కల్పించుటకే కాంగ్రెసు నిరంతరముగాఁ బాటుపడుచున్నదని ఈ గ్రంథమున దేశాయి స్పష్టపఱచెను. కాంగ్రెసు సభోద్దేశములను ఇచటి బ్రిటిషు ప్రముఖులు అదేపనిగా ఇట్లు అపవదించుచుండఁగా, బ్రిటిషు రాజనీతి తమ పట్ల ఎఱిఁగియో, ఎఱుఁగకయో భేదోపాయమును ప్రయోగించుచున్నదని భారతీయులు నమ్మకుండఁజాలరను విషయముగూడ ఈ గ్రంథమువలనఁ దెలిసివచ్చును.

నే నీ యవతారిక వ్రాయుచున్న తరుణముననే మన ప్రభుత్వము భారత ప్రజోద్యమముతో మరల సిగపట్లకు దిగుటయు, భారతీయులలో రత్నములవంటి స్త్రీలు, పురుషులు నెందఱో కారాగృహముల పాలగుటయు శోచనీయము. త్వరలోనే సమాధాన మార్గమేదియో దొరకకపోదు. అచటి అల్పసంఖ్యాకులను మనము జోక్యము చేసికొని రక్షింపఁజాలము. గాంధి, నెహ్రూ, ఆజాదులవంటి పెద్దల మాట మనము నమ్ముట మేలు. బలువు సులువు లెఱుఁగని ఉగ్రస్వభావులు కొందఱున్నను ఈ పెద్దలు తమ మాట దక్కించుకోఁ గలరని బ్రిటిషు ప్రభుత్వము గ్రహించుటయే సమాధానమునకు మొదటి మెట్టు.

ఈ గ్రంథమును శ్రద్ధగాఁ జదివినచో ఆంగ్లేయుల అపోహలు తొలఁగి పోఁగలవు. ఇండియాపట్ల మనము న్యాయముగా వర్తించితిమేని యూరపు ఖండమునను, యావల్లోక మందును ధర్మము వర్ధిల్లుటకు ఆనుకూల్యము లభింపఁగలదు.

ఈ గ్రంథకర్త గాంధిమహాత్మునకు సన్నిధానవర్తియైన కార్యదర్శియు, హరిజన పత్రికా సంపాదకుఁడును.

డిసెంబరు, 1940 హొరేస్ జి. అలెగ్జాండర్

# 1. ఉపోద్ఘాతము

1940–వ సం॥ మార్చి నెలలో రామఘుర్ కాంగ్రెసు మహాసభ మౌలానా అబుల్ కలాం ఆజాదును అధ్యక్షునిగా వరించెను. ఇది యిట్లు జరుగునని ముందే గ్రహించిన భారత వార్తా పత్రికల కిందు వింత యేమియుఁ గన్పింపలేదు. కావున నవి ఊహాపోహలకుఁ దొడంగలేదు. బ్రిటిషు పత్రికలు మాత్రము పలుపోకల నూహింపసాగెను. కాంగ్రెసు ముస్లిములకు, ముస్లిములు కాంగ్రెసుకు నభిమానస్థానములని చూపించుట కిదియొక యెత్తనియు, ముస్లిము పక్షపాతుల కన్నీళ్లు దుడుచుట కిది యొక యుపాయమనియు, దీనిచే ముస్లిముల యభిమానము చూఱగొన నెంచి రనియు నా పత్రిక లూహ యొనర్చినవి. అట్టి యూహాల కించుకయు నాస్కారము లేదు. హిందూ ముస్లిముల మధ్య విభేదములు తొల్లిటికంటె నిపుడు బిరుసు వాఱిన వనుటయే కాని ఈ యధ్యక్షవరణమున కవి కారణము కానేకావు. 1938నాఁటికే ఆయన పేరు ప్రతినోట వినఁబడసాగినది. 1939 లోఁ త్రిపురి కాంగ్రెసు సభాధ్యక్ష పదమును తుదిగడియలలో ఆయన వదలి కొనకున్నచో నూటికి నూరు పాళ్లో, తొంబదిపాళ్లో వోట్లు ఆయనకే దక్కెడివి.

ఇంతకును ముస్లిములు కాంగ్రెసు కధ్యక్షులగుట క్రొత్త వింత కాదు. గాంధి శకమునకుఁ బూర్వమే ముస్లిములు, క్రైస్తవులు, పారసీకులు గూడ నధ్యక్షపీఠ మలంకరించిరి. కడచిన యిరువదేండ్ల గాంధి శకములో నలుగురు ముస్లిముల కాపీఠము దక్కెను. ఆ నలుగురిలో నొకఁడైన యీ మౌలానాకు ముప్పదియైదేండ్ల లేఁబ్రాయమందే, 1923లో కాంగ్రెసు

సభాధ్యక్షత లభించెను. కాఁగాఁ గాంగ్రెసు మహాసభకు మతాభిమానమన్నచో నెప్పుడు నేవమే; ఇపుడు మఱియును. ప్రజారంజన దీక్షితులం దగ్రగణ్యుఁడగు నాతఁ డెవ్వఁడైనను సరియే, ఆతని హస్తములందు ప్రజల మేలు, కీళ్లను కాంగ్రెసు నిశ్చింతగా నర్పించును. ఇదియే యీ యధ్యక్షవరణమందలి పరమార్థము.

మౌలానాను పాశ్చాత్యు లెఱుఁగ రేమోకాని ఇండియా కాతఁడు క్రొత్తవాఁడు కాఁడు. 1923 లోనే ఇండియా ఆయనను ప్రజారంజ కాగ్రణిగా నెంచి గౌరవించెను. గాంధిజీ కంటె ముందే ఆయన తిరుగుబాటు దారని వన్నెకెక్కెను. 1916 లో ప్రపంచయుద్ధ కాలమందు గాంధిజీ బ్రిటిషు రాజభక్తుఁడనని చెప్పికొని సహాయము నెఱపఁగా మౌలానా అప్పటికే తిరుగుబాటు ప్రకటించి, ప్రభుత్వముచే బంధితుఁ డయ్యెను. బ్రిటను తన సామ్రాజ్యలోభమును వదలికొని, ఇండియాకు స్వాతంత్ర్య మిచ్చుట కంగీకరింపనిచో నేఁటి యుద్ధ సంకటమునఁ గాంగ్రెసు సహాయ మొనర్పనని నిరాకరించెను. కావున వెనుకటి యుద్ధ కాలమందే బ్రిటను కెదురు తిరిగిన మౌలానాయే నేఁటి యీ కాంగ్రెసు గద్దె నెక్కుట యెంతేని అర్థవంతముగా నున్నది. ఆల్ హిలాల్ అను ఉరుదూ పత్రికను మౌలానా ప్రారంభించిన రెండు మూఁడేండ్లలోనే బ్రిటిషు ప్రభుత్వము దాని నిర్భయ విమర్శ లకుఁ గంటగించుకొని, ధరావతుపై ధరావతుకోరి, దాని కంఠము నులిమెను. ఆ పిమ్మట మౌలానాను నిర్బంధావాసమం దుంచెను.

ఆ నిర్బంధావాసమున మౌలానా మనసు మాఱలేదు

సరికదా బ్రిటను పట్ల విరక్తి మఱియు నధిక మాయెను. 1920 లో ఆయన చెఱవీడి వచ్చుసరికి సోదర ముస్లిములలోఁ జాలమంది తమ కన్నుల నిన్నాళ్లుఁ గప్పిన పొరలు వీడిపోఁగా బ్రిటిషు రాజభక్తికి నీళ్లు వదలిరి. ఆయన చిరవాంఛితము ఫలించుట కానుకూల్య మేర్పడెను. అప్పటికిఁ బది యేండ్లక్రితమే ఆయన "హిందువులకు, మనకుఁగూడ నీ దేశమే కన్నతల్లి. మునిఁగినను తేలినను ఉభయమతములు కలిసి యుండకతీరదు" అని యెంతగా మొత్తుకొన్నను అది యరణ్యారోదనమైపోయెను. చెఱ వీడి వచ్చుసరి కది యంతయుఁ దాఱుమాఱై ఉభయమతస్థులును మేలు కీళ్ల నొండొరులు పంచికుడుచుట కాయత్తులైరి. మౌలానా కీ మార్పు సంతోషాశ్చర్యములు సమకూర్చెను. అది మొదలు మౌలానా హిందూ క్రైస్తవ పారసీకులతోపాటు చేతులు గలిపి, కష్టసుఖముల కొడిగట్టెను. ఆ పిమ్మట ఎన్ని ఘోర విపర్యయము లెదురైనను ఆయన యణుమాత్రము చలింపక నిలిచెను. రామఘురు కాంగ్రెసు గద్దెనెక్కి ఆయన పల్కిన యుదారభాషలు మఱపునకు రావు. "సోదర ముస్లిములకు 1912 లోఁ జెప్పిన మాటలే మరలఁ జెప్పుచున్నాను. ఈ మధ్యకాలములో ననేక సంఘటనలు జరిగినవి. వాని నన్నిటిని నేను గమనించుచు, వానిని గూర్చి పర్యాలోచన చేయుచునే యుంటిని. నేను తటస్థుఁడను గాని, ఆ ప్రతిఘటనలతోఁ గొట్టుమిట్టాడుచుఁ బ్రత్యంశముఁ బరిశీలించుచుంటిని. కావున నేను కనులారఁ గాంచిన దానిని కాదనలేను. నా ఆత్మ నిశ్చయమున కెదురొడ్డి, అంతరాత్మ నతిక్రమింపఁజాలను. నాఁటికి నేఁటికి నాలో మార్పు లేదు. ఇన్నాళ్లు చెప్పినదే నేఁడును చెప్పుచున్నాను.

ఈ దేశమందలి తొమ్మిది కోట్ల ముస్లిములకు 1912 లో నేను చూపిన దానికంటె నితరమార్గము లేదు.” 1912 నుండి ఎన్నో దుర్ఘటనలు జరిగినవి. ఉభయమతస్థులకు దుస్సహ కలహములు ప్రవర్తిల్లెను. ప్రాంతస్నేహితులు, సహచరులు దూరమై పరపక్షము నాశ్రయించిరి. ఆ యేటి కాయేడు ఉభయమతముల మధ్య విరోధము విస్తరిల్లెను. కాని, మౌలానా మాత్ర మించుకయుఁ జలింపక పర్వతమువలె స్థిరుఁడై నిలిచెను. ముస్లిము లోకమెల్ల తన్ను విడనాడి, చెడ నాడినను ఆయన ఏకాకియై నిలిచెను. హిందూ ముస్లిములు సమసుఖదుఃఖభాగులై, కలిసిమెలసి మనక తీరదను విశ్వాస మాయనయందు నేఁడు మఱియు దీప్తమై వెలుఁగుచున్నది. కావుననే భారతీయుల కాతఁడు ప్రీతిపాత్రుఁడై, వారి విశ్వాసము నింతగాఁ జూఱగొని యీ విషమఘట్టమునఁ గాంగ్రెసు గద్దె నెక్కెను. ఆ యుత్తమ శ్లోకుని జీవితమును, చర్యలను ఈ గ్రంథమున నించుకించుక ప్రస్తావింతును.

పాశ్చాత్యుల విజ్ఞానకాంతులను భారతీయ ముస్లిములకుఁ దొలుతఁ బ్రసాదించినవాఁడు సర్ సయ్యదు అహమ్మద్ ఖాను. పొంగులు వాఱెడి ఆ మహనీయుని ఉత్సాహ శక్తియుఁ, బ్రబలమైన ఆయన అనుభావమును భారతీయ ముస్లిముల హృదయములఁ జెఱఁగని ముద్రలు వైచినవి. కావునఁ బాశ్చాత్య విద్వాంసు లాయన జీవితవిశేషములను లెస్సగా గ్రహించి, పాశ్చాత్యలోకమున వానిని బ్రచారము గావించిరి. ఆ ప్రచారమునకు మఱియొక ప్రబలకారణము కూడఁ గద్దు. ముస్లిములలో భావ విప్లవము సాధించిన సర్ సయ్యదు ఇండియాలో బ్రిటిషు సార్వభౌమత్వమునకుఁ బట్టు

గొమ్మయని వారికిఁ దోఁచెను. కావున నాయన జీవితవిశేష ములకు బహుళ ప్రచారము గల్గించినచో భారతముస్లిముల ఋణము తీర్చుకొన్నట్లగునని పాశ్చాత్య విద్వాంసులు తలపోసిరి. వారు, పాపము, మౌలానాసాహెబు చరిత్రము నెఱుఁగరు. బ్రిటిషు ప్రభుత్వముపట్ల విరక్తుఁడై, తిరుగుబాటు చేసిన ఈ మౌలానాసాహెబు అహింసామార్గానుయాయి యని వారు గ్రహింపవలసియున్నది. బ్రిటిషు సామ్రాజ్య మును నిర్భీకులై, మాఱొడ్డి నిలిచిన గాంధి నెహ్రూ మౌలానాల వంటి వారే, తమ ప్రతిఘటనచే, ఆసామ్రాజ్య మున కపారమగు మేలు చేకూర్చిరని బ్రిటిషు పౌరులకుఁ దెలిసివచ్చెడి కాలము రాకపోదు.

హిందూ ముస్లిముల యైకమత్యమును మనసారఁగోరెడి భారతీయు లందుల కే మాత్రము దోహదము చేకూరినను దానిని పెక్కు మడుంగులుగా నెంచి సంతసింతురు. సభావేదిక లెక్కి, యుపన్యాసములుచేసి, కార్యనిశ్చయములు చేసెడి కాలము గతించినది. దేశభక్తియనఁగా నిట్టిదని ప్రతివాఁడును తన వర్తనముచే రూపింపవలెను. మనోవాక్కాయములచే మత సామరస్యమును, శాంతిని మన మాచరింపనిచో నిజమైన యైకమత్యము లభింపదు. ఐకమత్యములేనిచో స్వాతంత్ర్యము లభింపదు. ఒకవేళ లభించినను అట్టిది యెందులకును గొఱగాదు. మౌలానా జీవితము ముఖ్యముగా దీనినే యుపదేశించెను. కావున నాయన జీవితపు విలువను లెస్సగా గ్రహించితిమేని మనయభీష్టసిద్ధి కదియునొకపత్రమో, పుష్పమో కాఁగలదు.

---

# 2. సత్కులీనత

షేకు జమాలుద్దీను డెహ్లావి యను సాధుపుంగవుఁడు అక్బరుపాదుషా కాలమున వన్నెకెక్కెను. ముస్లిముచరిత్ర లాయనను రహింతుల్లా ఆలి (అనఁగా, ఈశ్వరాను గ్రహపాత్రుఁడు) అని పేర్కొన్నవి. కేవ లాముష్మిక దృష్టితో సాధుజీవనము నడపుటయే కాక, ఆయన పెక్కు ధర్మ గ్రంథములు రచించెను. అవి నేఁటికిని సమ్మాన్యములుగా నున్నవి. ముస్లిముధర్మాచార్యులకుఁ బ్రమాణ గ్రంథమగు హాదిస్ సంప్రదాయమున కాయన చక్కని వ్యాఖ్యరచించెను. అక్బరు పాదుషా సోదరుఁడగు ఖానే అజాము మున్నగువా రాయనకు శిష్యులు. పాదుషా ఆయనను ఆస్తిక ధర్మకళాశాలలోఁ బ్రధానాచార్యు నొనర్పనెంచెను; మఱియుఁ బెక్కువిధముల సమ్మానింప నెంచెను. ఆ సాధు వా గౌరవముల నెల్ల నిరాకరించెను. అట్టి మహనీయుని వంశమున మౌలానా అబుల్ కలాం ఆజాదు జన్మించెను. సాధుపుంగవుఁడగు ఆ జమాలుద్దీను గూడ ఒకానొకతఱి పాదుషాయాజ్ఞను ధిక్కరింపవలసివచ్చెను.

ఆ కథ అక్బరు నాఁటి విశేషములను దెలుపునది కావున దాని నిట నుదాహరింతును. అక్బరు సర్వమతములను సమదృష్టితో నాదరించెనని చరిత్ర తెలుపుచున్నది. ఆ సమదృష్టికిఁ గారణమైన వాఁడు ముల్లా ముబారక్. ఆనాఁటి ధర్మాచార్యులు ఈ సమదృష్టి నుపదేశించిన ముల్లాకు ఆంక్షలు కూడ విధించిరి. అబుల్ ఫజలు ఆ ముబారకు పుత్రుఁడు. అబుల్ ఫజలే అక్బరునకు సర్వధర్మములను నిష్పాక్షికముగా విచారించి, యాదరించుట నేర్పెను. తత్ఫలితముగా నక్బరు

ఇబాదత్ ఖానా (ప్రార్థనా మందిరము) నెలకొల్పెను. ఆ మంది రమున సకల ధర్మములవారు స్వేచ్ఛగా ధర్మసంవాదములు సల్పెడివారు. ఒక నాఁటి సభలో అబుల్ ఫజల్ ఏమిచేసె ననఁగా – అక్బరుపాదుషాను ఐహిక ధర్మమునకేకాదు, పార మార్థికమునకుఁ గూడఁ బ్రమాణపురుషుఁడుగా నెంచవలె నను విషయమును విచారింపుఁడని పండితులను గోరెను. మొదట నీ ప్రస్తావ మెందులకు రావలసివచ్చినదో, మొగల్ చరిత్ర మును తరిచి చూచిన మౌలానా ఆజాదే నాతో నిట్లు చెప్పెను: "మధురానగరమున హిందువులకు ముస్లిములకుఁ గలహాము రాఁగా, హిందువు లొకమసీదును నేలమట్టము గావించిరి. అక్బ రా హిందువులను గాపాడనెంచి, వారిని క్షమింపవలసి నదిగా ముస్లిములకుఁ జెప్పెను. ముస్లిము ఆచార్యు లందులకు ససేమిరా యని హిందువులపైఁ గత్తిగట్టిరి. ఈ ముస్లిము ఆచార్యుల పలుకుబడిని దగ్గింపనెంచిన ముల్లా ముబారక్ అక్బరు మాటయే ప్రమాణమని ఆయాచార్యుల చేతనే ఒప్పించుట కీ యుపాయము చేసెను." నిజమే. పాదుషా ప్రామాణికత్వమును ఆ యాచార్యులు కాదనలేరుకదా! ఆ మీఁదట నేమి జరిగి నదో ఒక చరిత్రకారుఁడే యిట్లు చెప్పెను: "ఆచార్యులకెటు చెప్పుటకును పాలుపోయినదికాదు. 'పాదుషా ధర్మప్రభువు గావున ఇస్లాము ధర్మవిషయములందుఁ గూడ వారిని ముజ్ తాహిద్ (ప్రమాణ పురుషుఁడు)గా నెంచవచ్చును,' అని వ్రాసి యిచ్చిరి." అబుల్ ఫజల్ జనకుఁడైన ముల్లా ముబారక్ అంతట నా పత్రముపై సంతకముచేసి, యితర ముల్లాలను గూడ సంతకము చేయుఁడని కోరెను. ఆగ్రా, జాన్ పూర్ మున్నగు ప్రదేశములందున్న యాచార్యులును, ఢిల్లీలోని వారు

కొందఱును సమ్మతులు తెలిపిరి. మన కథానాయకుని పూర్వ పురుషుఁడగు షేకు జమాలుద్దీను తన సమ్మతి నొసఁగఁ డయ్యెను. మఱి కొంద ఱాయన ననుసరించిరి. ఆకారణమునఁ బాదుషా యాగ్రహమునకు గుఱియయ్యెనేమో తెలియదు కాని జమాలుద్దీను ఇండియా దేశమును వీడి, మక్కా చేరఁ బోయెను.''

నే నంతట మౌలానాతో ''ఈ సత్యాగ్రహము మీకు వంశాగత మన్నమాట!'' అంటిని.

మౌలానా చిఱునవ్వు నవ్వి ''సందేహమేమి? అదియును సత్యాగ్రహమే. ప్రసంగము వచ్చెను గావున మా పూర్వు లలో మఱి యొకరి వృత్తాంతముఁ గూడ వినిపింతును.''

నేను ''అంతకంటెఁ గావలసినదేమి? చెప్పుఁ''డంటిని.

మౌలానా యంతటఁ దన వంశీయులగాథ సంగ్రహ ముగా నిట్లు వచించెను: ''షేకు జమాలుద్దీనుకు నేను తొమ్మి దవ వాఁడనో, పదవవాఁడనో యగుదును. ఇపుడు మావంశ వృక్షమంతయు నేకరువు పెట్టుట యెందులకుఁగాని, ఏ వంశ మునందును విద్యాసంపదలు మూఁడు తరములకు మించినిలువ వనెడి పెద్దలమాట మావంశముపట్ల నన్వయించదు. అది మా యదృష్ట మేమో! మా వంశమున నపండితులు, భక్తి రహితులు లేరు. జహంగీరుకాలమున మా పూర్వికుఁడు షేక్ మహమ్మదు ఉండువాఁడు. పాదుషాకు కూర్నిషు సలాములు చేయు నాచారము నెవరో ప్రారంభించిరి. ధర్మాచార్యులు గూడ నా యాచారము ననుసరింపవలసివచ్చెను. ఢిల్లీ యందలి యాచార్యులు చాలమంది యందులకుఁ దలయొగ్గిరికాని షేక్ మహమ్మదుమాత్ర మంగీకరింపక 'ఈశ్వరునకుఁ దక్క ఇహ

లోక ప్రభువులకు నేను తలవంప' ననెను. షేకు జమాలుద్దీనుకుఁ దప్పనేకాని షేక్ మహమ్మదుకు దుష్ఫలితము తప్ప లేదు. చక్రవర్తికి మోకరించని నేరమునకు గ్వాలియరుకోటలో నాతఁడు నాలుగేండ్లు నిర్బంధము ననుభవించెను."

మౌలానా యింకను ఇట్లు చెప్పెను: "రాజోద్యోగమును, అధికారమును నొల్లకుండుట మాకుఁ బారంపర్యముగా వచ్చుచున్న వంశాచారము. మా ముత్తాత షేక్ సరాజుద్దీను ఆ యాచారమును భంగించి, ప్రధాన ధర్మాధికృతి యయ్యెను. అది మొదలు మా పెద్దలు రాజనియోగము నంగీకరించిరి. మొగలుపాదుషాల చెంత రుక్ నిల్ ముదరాసిన్ (వెలుఁగు కంబము) అను పదవి నధిష్ఠించిన వారిలో మా తాతయే తుది వాఁడు."

కాఁగా, మౌలానాకు అభిజనాభిమానము, పాండిత్య ప్రాభవము వంశానుగతముగా సంక్రమించినవి. అంతియే కాదు. ఒక విషయమునఁ దాత తండ్రులకంటె మౌలానా మఱి యొక యాకు నెక్కువ చదివెను. ధీ బలమునను, పాండిత్య ప్రకర్షయందును మౌలానాకు సాటివా రుందురేమో కాని యంతకంటె నధికులు మాత్రము లేరు. అట్లయ్యుఁ, దన తాత తండ్రులవలె నాయన శిష్యవర్గమును సమకూర్చుకొనలేదు. ఎప్పుడు నేకాంతముగాఁ దన గ్రంథములలో మునిఁగి యుండు మౌలానాకు మౌలానాయే శిష్యుఁడు. గ్రంథములే లోకముగా, నొంటరియైయుండు నా మితభాషి నెఱుఁగనివారు గర్వి యనుకొందురు.

---

# 3. తలిదండ్రులు, బాల్యము

మౌలానా తండ్రి మహమ్మదు ఖైరుద్దీను తమ పూర్వుఁడగు షేకు జమాలుద్దీను నాఁటి వంశమర్యాద లన్నియు నిలవఁబెట్టెను. జమాలుద్దీను వలెనే ఆయనయుఁ బండితుఁడు, నాచార్యుఁడు, నీశ్వరభక్తుఁడు నై, యరబికు పారసీక భాషలలోఁ బెక్కు గ్రంథములు రచించెను. స్వభావముచే విరక్తుఁడై, యాతఁ డెప్పుడును భక్తిచరితామృతమును గ్రోలుచుండెడి వాఁడు. ఢిల్లీలోనే కాక, పడమట బొంబాయి గుజరాతు కథియవాడులందును, దూర్పునఁ గలకత్తాయందు నాయనకు వేలకొలఁదిగా శిష్యులుండెడి వారు.

తాత తండ్రులవలె నాయనయు ఢిల్లీలో ధర్మనిష్ఠతో, విద్యావ్యాసంగముతో నుదారజీవనము గడపెడివాఁడే కాని యాకాలమున ధర్మపరులకుఁ గూడ నిడుమలు తప్పినవి కావు. 1857 లో ఢిల్లీ నగరము శత్రువశమయ్యెను. ఆ పిమ్మట నడచిన కథ బ్రిటిషు సైన్యచరిత్రమునకు మాయని మచ్చఁ గల్పించెను. తిరుగుబాటుదారులు హింసాకాండకుఁ బాల్పడిన మాట నిజమే కాని, వారిని జయించిన వారు సల్పిన ఘోర కృత్యములు మున్ను విన్నవి, కన్నవి కావు. మాంట్‌గోమరీ మార్టిన్ చెప్పినట్లు "మన సేనలు ప్రవేశించు సరికి నగరమం దున్నవా రందఱు నెక్కడివా రక్కడనే మన సన్నీపోటుల కెరలైరి. ఒక్కొక్క యింటిలో నలుబది యేఁబదిమంది చొప్పున హతులైరన్నచో, నట్టి వారి సంఖ్య విస్తారమని వేఱ చెప్పఁబనిలేదు. వీరందఱు విప్లవకు లనుకొందు రేమో, కారు. మెత్తనిదని ప్రసిద్ధమైన మన దొరతనము తమ్ము క్షమించు నని నమ్మి నిలిచినవారు. వారి నమ్మిక వమ్మయి పోవుట మేలే

మైనది.'' ''మమ్ము రక్షింపుఁడని చేతులు జోడించిన నిరపరాధులెల్లఁ దుపాకుల వాతఁబడిరి. భయకంపితులగు వృద్ధులు కత్తుల కెరమైరి. విప్లావకులు చేసిన పాపములకు ఢిల్లీ పౌరులు శతగుణముగాఁ బ్రాయశ్చిత్త మనుభవించిరి. ఏ పాపము నెఱుఁగని బాలురు, స్త్రీలు, పురుషులు గతిమాలి, దేశము పాలై పోయిరి. వారు దిగవిడిచిపోయినది యేదియు మరల వారికి దక్కలేదు. సైనికులు వాడవాడకు, నింటింటికిఁ దిరిగి, విలువగల వస్తువులెల్ల గాలించి, కొల్లగొట్టిరి. వెంటఁగొనిపోవుట కలవిగాని వానిని విఱుగఁగొట్టి ముక్కలు గావించిరి.''*

శ్రీ సి. యఫ్. ఆండ్రూసు జకుల్లాచరిత్ర రచించుచు ఆ ధర్మాత్ముని కుటుంబము నిష్కారణముగా బాధలకు లోనాయెనని వ్రాసిరి. ఆ దినములలో బ్రిటిషువారి నందఱికంటె నధికముగా నాదుకొన్న సర్ సయ్యదు అహమద్ ఖాను ఢిల్లీ చేరికొనుసరికి ఆయన మేనమామ హతుఁడై పోయెను. ఆయన తల్లి ఒక సేవకుని యింటఁ దలదాఁచుకొని యుండెను. మన మౌలానా జనకుఁడు గూడ వేలకొలఁది ప్రజలతో పాటు నగరమును విడిచి పాఱిపోయి ప్రాణములు దక్కించుకొని యింతటి సంక్షోభముపాలైన యీ దేశమును విడిచి మక్కాకేగుట మేలనుకొనెను. నగరము శత్రువశము కాఁగానే రాంపూరు చేరెను. బ్రిటిషు ప్రభువుల కనురక్తుఁడగు రాంపూరు నవాబు ఆయనకు శిష్యుఁ డగుటచే మౌలానా తండ్రిని బొంబాయికిఁ జేర్చి, యటనుండి మక్కా కంపెను.

అపుడు టర్కీ దేశము నేలుచున్న అబుల్ మజీదు సుల్తాను మౌలానా మహమ్మదు ఖైరుద్దీను పాండితినిగూర్చి

---

*హోమ్స్

విని, ఆయనను కాన్‌స్టాంటునోపిలు కాహ్వానించెను. సుల్తాన్ ఆదరణచే నాయన గ్రంథము లెన్నియో కైరోనగరమునఁ బ్రచురితము లయ్యెను. అటనుండి తిరిగి వచ్చిన పిమ్మట మహమ్మదు ఖైరుద్దీను ఇండియా మున్నగు దేశములందున్న తన శిష్యుల చెంత, స్నేహితుల చెంత పదునొకండు లక్షల సొమ్ము సమకూర్చి, మక్కాలోఁ బ్రసిద్ధమగు అయింజుబేదా అను కాలువ నిర్మాణము కొఱకంపెను. మక్కాయందలి ధర్మాచార్యులలో మహా విద్వాంసుఁడగు షేకుమహమ్మద్ జహీర్ వేత్రి కూఁతును ఖైరుద్దీను పెండ్లియాడెను. ఆ యిల్లాలికి 1888 లో మన కథానాయకుఁడు జన్మించెను. ఇట్లు మౌలానాకుఁ దల్లి వంకను, దండ్రి వంకనుగూడ గొప్ప విద్వత్త సంక్రమించెను. ఈ యుభయకులములును నభిమానధనమగు షేకు వంశములోనివే.

మౌలానా ఖైరుద్దీను మక్కాలో నుండఁగా, నాయన శిష్యులగు కథియవాడు ముస్లిములు కొందఱటకుఁ దైర్ధికులైరి. శిష్యసంగ్రహార్థము తిరిగి స్వదేశమునకు రావలసినదని వారు బలవంతపెట్టిన మీఁదట మౌలానా వారి కోరికఁ ద్రోసి పుచ్చఁజాలక, 1880 లో మరల బొంబాయి చేరెను. 1880–1892 సంవత్సరముల నడుమ నాయన పలుమార్లు మక్కాను దర్శించి యుండును.

ఈ రీతిగా మౌలానా ఆజాదు బాల్యము రేబియాలోనే కడచెను. తుదకు 1898లో హాజీ అబ్దుల్ వహీదు అను శిష్యుని ప్రేరణమున ఖైరుద్దీను కలకత్తాలో నివాస మేర్పఱిచికొనెను. ఆజాదుతల్లి అరబీభాషకంటె నితరభాష లెఱుఁగదు కావున నరబీ భాషయే ఆనయకు మాతృభాషయయ్యెను. తండ్రివలన

నాయన కురుదుభాషయు నలవడెను. తండ్రితోఁ గలకత్తా చేరు నాఁటి కాయన కీ యుభయభాషలందును జక్కని ప్రవేశము లభించెను. పిమ్మట నాతఁడు బడి చదువు లెఱుఁగక, తండ్రి చెంతను, అరబీకు పండితుల చెంతను విద్యనభ్యసించెను. చూపినంతనే యందుకొనిపోవెడి యద్భుతబుద్ధిశాలి యగుటచే నితరులకుఁ బది పదునాలుగేండ్లు పట్టెడి 'దరిసినిజామీ'ని మన మౌలానా నాలుగేండ్లకే పూర్తిచేసెను. దరిసినిజామీ యనఁగా, అరబీకు పారసీకసాహిత్యములటుండ, తర్కము వేదాంతము, గణితము, ఖగోళము, ఇతిహాసము మున్నగు శాస్త్రములందుఁ బాండితి కుదురవలెను. మౌలానాకుఁ జిన్ననాఁటనే అరబీకు భాషాప్రవేశము లభించెఁ గావున, ఆయన యంతశీఘ్రముగ దరిసినిజామీయందు గడిదేఱుటయే కాక, యితరులకును దానిని బోధింపఁజొచ్చెను. అధ్యాపనముగూడ నధ్యయనము తోడిదే కావున నా కాలమునఁ దాము నేర్చిన విద్య నొరులకు నేర్పఁగలవారికే 'ఆలిం' పట్టము లభించెడిది. అబుల్ కలాము పదునాలుగేండ్ల ప్రాయమందే ఇట్లు శిష్యత్వముతోపాటు గురుత్వము నెఱపఁగల్గెను. ఆనాఁటి కథ యొకటి ఆయనయే యిట్లు చెప్పెను: "నా శిష్యులలో నొక పఠానుకు పొడవుపాటి గడ్డముండెడిది. ఆతని మందబుద్ధి నాకు విసుగు పుట్టించెడిది. అప్పటికి నే నెంతే నోపికతో నాతనికిఁ దర్కశాస్త్రమున సామాన్యమునుండి విశేషమును, విశేషము నుండి సామాన్యమును సాధించుటలోఁగల భేదమును దెలియఁ జెప్పెడి వాఁడను. మొదటిది క్రిందనుండి పైకెక్కుట యనియు, రెండవది పైనుండి క్రిందికి దిగుట యనియు సులభతరముగా బోధించితిని. అట్లు చెప్పి, యిఁక దానిని మఱచిపోఁ డను

కొంటిని. తీర, మఱునాఁ డడిగితినికదా, అంతయుఁ దాఱు మాఱుగా నాతఁడు చెప్పెను. నా కంతట నోడలుమండి, పుస్తకము నాతని మొగమునఁ గొట్టి 'నీకు చదువురాదు; ఇంటికేగి గడ్డితిను' మంటిని. పాప, మా పఠాను మాఱు పలుకక యానాఁడు భోజనము మానుకొనెను. నా జనకున కీ విషయము తెలిసినంతట, నాయన మండిపడి, నన్నుఁ జేరఁ బిలచి 'ఆతఁడు నీతండ్రి యీడువాఁడుకదా, ఇట్లుచేయుటకు నీకు బిడియమేలలేదు? పోయి క్షమార్పణము వేఁడి, భోజన మునకు లెమ్మని బ్రతిమాలుకొనుము' అని శాసించిరి. నే నా పఠాను చెంతకేగినంతట నాతఁడు 'మీరు నాకు గురువులు; నన్ను దండించితిరి. ఇందులకు క్షమార్పణ మెందులకు?'' అని తెల్లబోయెను. ఆమాటలచే నాబిడియ మినుమిక్కిలి కాఁగా, నాతనిచే భుజింపఁజేయు వఱకు నటనుండి కదలలేకపోతిని.''

మౌలానా ఆజాదు లేఁత వయసునఁ దండ్రిచెంతనే పెరుగుటచే నాయన గుణములు, నలవాట్లే యీయనకుఁ బట్టు వడెను. మౌలానా ఆజాదు ఇట్లు చెప్పుచుండెడివాఁడు: ''మా తండ్రిగారు ఏకాంతశీలి. వారికి వేలకొలఁదిగా శిష్యులున్నను వారు మా యింటికి వచ్చుటయేకాని వీరు శిష్యుల యిండ్ల కేగి యెఱుఁగరు. ప్రవక్త జన్మదినమునను, ఈద్ పండుగ నాఁడును మాత్రము ఎవరో యొక శిష్యునింటి కేగెడివారు. మాయింటిలో నేఁటికాలపు వస్తు సంచయ ముండెడిదికాదు. ఎంతో నిరాడంబరముగా నుండెడిది. టిప్పు సుల్తాను కుమారుఁడు, నితర నవాబులు నింటికి వచ్చి పోవుచున్నను, పిన్నలకుఁ, బెద్దలకు అందఱకుఁ గూరుచుండుటకై చాఁపలే కాని కురిచీలు, సోఫాలులేవు. ఆయన జీవితమువలెనే వేషము

కూడ విరాగ సూచకముగా, నిరాడంబరముగా నుండెడిది. బొత్తాములున్న కోటు నాయన ధరింపఁగా నే నెన్నఁడుఁ జూడలేదు. నేఁటి నాగరికతా వాసనయే ఆయనకు గిట్టక పోవుటచే బిడ్డలమగు మాకు బ్రిటిషు పద్ధతులు మప్పవలెనను నాలోచనయే పుట్టలేదు. సర్ సయ్యదు అహమద్‌ఖాను పూర్వాచారపరాయణతపై దండెత్తి ముస్లిములకు నవీన విజ్ఞానమును, ఆంగ్లభాషను అలవఱుపఁ జూచెను. మా తండ్రి ఆ యుద్యమమును హర్షింపక మాకుఁ బూర్వపు విద్యలే నేర్పించెను. కావున ఇంగ్లీషు బడికి నేను వెళ్లెడి ప్రసక్తియే లేకపోయెను. కాని, నన్ను పండిత ప్రకాండునిఁజేయ సంకల్పించి మాతండ్రి 1905 లో సొంతసొమ్ము వెచ్చించి కైరో నగరమందలి అల్ అఝార్ విశ్వవిద్యాలయమున కంపెను.* అచట రెండేండ్లధ్యయన మొనర్చి 1907 లో ఇండియాకు వచ్చితిని. 1909 లో మా జనకుఁడు గతించిన పిమ్మట నొక మిత్రుని ప్రేరణముచే నేను ఆంగ్ల వ్యాకరణమును, నిఘంటువును సంపాదించి, వాని సాయముననాంగ్లము నభ్యసించితిని.”

ఇట్లు చెప్పి మౌలానా తుదకు “మాతండ్రి నన్నాంగ్ల పాఠశాలకుఁ బంపలేదను విచారము నాకులేదు. ఆ మాత్రాన వచ్చిననష్ట మేమియులేకపోఁగా, నాకుఁ గావలసినంతవట్టు ఆంగ్లమును సొంతముగా నేర్చుకొనుటచే బోలెఁడు కాలము, శక్తియుఁ గూడివచ్చినవి” అనెను.

---

*మహాదేవ్ దేశాయిగారు యీ విషయమున పొరబడినట్లును, తానెన్నడు అఝార్ విశ్వవిద్యాలయమున చదువలేదనియు 1959లో ప్రచురింపబడిన తన ఆత్మకథ ‘ఇండియా స్వాతంత్ర్యము సంపాదించెను’లో మౌలానా ఆజాదే చెప్పుకొనెను (పుట 6).

మౌలానా తండ్రి కెందఱో శిష్యులుండిరని మున్నే చెప్పితిని. వారిలోఁ గొందఱు హిందువులునుండిరి. వా రాయన నెన్నియో ప్రశ్నము లడిగెడివారు. ఆప్రశ్నలన్నిటికి నాయన ముస్లిము శిష్యులకుఁ జెప్పినట్లే ప్రీతితో, నాదరముతో సమాధానములు చెప్పెడివారు. అట్టి తండ్రికిఁ గొడుకైన మన మౌలానా హిందూ ముస్లిముల యైక్యమునకుఁ గ్రమముగా దీక్షవహించుటలో వింతయేమున్నది?

— — —

# 4. అద్భుత మేధావి

ఏకాంతముగా నుండు స్వభావము తండ్రివలన అబుల్ కలాం ఆజాదునకుఁ బట్టుబడినప్పటికి సకల విషయముల నాకళించుకోవలెననెడి తృష్ణకూడ మాలానా కేర్పడినది. అందువలన నాయన కేవల ధర్మాచార్యుఁడుగా గూర్చుండలేక పత్రికలవలన, గ్రంథములవలన లోకవ్యవహారము నాకళించుకొనుచు, వాదప్రతివాదములందుఁ జొరఁబడ సాగెను. నూనూగు మీసాలనాఁడే పత్రికా ప్రచురణ మారంభించుటఁ జూడ మాలానా పుట్టుకచేత గ్రంథకర్తయుఁ, బత్రికా సంపాదకుఁడు నాయె ననిపించును. పదునాలుగేండ్లు నిండకమునుపే లిసానస్ సిదిక్ (సత్యవాణి) అను పత్రిక నాయన యారంభించెను. ఆయన యవగాహింపని విషయ మనుచు లేదు. ఏ విషయమునను ఉన్నమాట చెప్పుట కాయన వెనుకాడినదియు లేదు. సకల ప్రస్తావములను నిర్భయముగా విమర్శించుచుఁ, బెద్దపెద్దలు వ్రాసిన గ్రంథములను గూడఁ బరామర్శ చేయఁ దొడఁగెను. క్వాజా అల్తాఫ్ హసనాలీ అను ఉర్దూ పండితకవి సర్ సయ్యద్ అహమద్‌ఖాను చరిత్ర రచింపఁగా, మాలానా దానిని సవిమర్శముగాఁ దన పత్రికలోఁ బర్యాలోకన చేయుట దటస్థించెను. ఈ విమర్శ పదిమంది కనులఁ బడెను. కాని, వర్ధమానుఁడగు ఈ గ్రంథకర్తయుఁ, బత్రికా సంపాదకుఁడు నింకను బెద్దల కంటఁబడలేదు.

ఆరోజులలోనే లాహోరు సభలో నుపన్యసింపవలసినదిగా మాలానాకుఁ బిలుపు వచ్చెను. అంతకుమున్ను చిన్న చిన్న సాహిత్య సభలలోఁ బ్రసంగించుట యున్నను ఈసభ యట్టిదికాదు. నగరవాసులగు శిష్యులయెదుటఁ బ్రసంగ మిది.

లాహోరులో 'అంజుమాని హిమాయత్ ఇస్లాము' అను సంఘమున్నది. 1904 లో నా సంఘము సాంవత్సరికోత్సవము జరపికొనుచు 'లిసానస్ సిదిక్' పత్రికా సంపాదకుఁడగు మౌలానాను బిలిచెను. ఆపత్రికలోఁ గణగణ మెఱసెడి వ్రాఁతలను జూచి, దాని సంపాదకు నాహ్వానించుటయే కాని యాతఁడు ఫలానాయని యెఱిఁగి పిలువలే దా సంఘీయులు. ఇంతకు మున్ను పేర్కొన్న గ్రంథకర్త హాలీకవియు, నజీ రహమ్మదనెడి గద్య గ్రంథకర్తయు, షేక్ మహమ్మద్ ఇక్బల్ కవిచంద్రుఁడు మున్నగు పండితు లానాఁటి సభలో నాసీనులై యుండిరి. పదునాలేండ్లు నిండని యీ పడుచువాఁ డాసభలో 'ధర్మమీమాంస' యను విషయమును గూర్చి యుపన్యసింపవలెను. పెద్దలకుఁగూడఁ గొఱుకువడని ధర్మమీమాంస చేయుట కచట నిలిచిన యీ బాలుని కెన్ని గుండె లుండవలెనో కదా! మౌలానా అబుల్ కలాం ఆజాదు నేఁ డుపన్యసించునని సభారంభమున వక్త నెవరో ఫరిచయ మొనర్చిరి. హాలీకవి యామాటలువిని, తన గ్రంథమును నిశితవిమర్శ యొనర్చిన మౌలానా కీతఁడు కొడుకు కాఁబోలు ననుకొనెను. తుదకు 'లిసానస్ సిదిక'పత్రికా సంపాదకుఁడగు మౌలానా ఈ బాలుఁడేయని తెలిసివచ్చినపు డాయనయాశ్చర్యము పాలయ్యెను. ఇఁక నానాఁడు మౌలానా చేసిన ప్రసంగమును విన్న సభ్యులెల్ల రాయన ధీమత్తకబ్బురపడి, భారత ముస్లిములలో నీతఁడు మేటి కాఁగలఁడని యెంచుకొనిరి. హాలీకవి మౌలానాను "వయస్సున లేఁతయయ్యుఁ బరిణత బుద్ధి"యని ప్రశంసించెను.

అంతకుమున్నే అబుల్ కలాం ఆజాదు పదునాలుగేండ్ల యీడునఁ గావ్యరచనమునఁ గృతహస్తుఁ డనిపించుకొనెను.

యువకులగు ఉర్దూకవుల రచనలు ప్రకటించుటకై 'నరాంగ్ ఆలం' అను పత్రికనుగూడఁ గొన్నాళ్లు సాగించెను. ఆ పత్రికలోఁ దన కావ్యములు ప్రకటించుచుఁ గవి సమ్మేళనము లందుఁ బాల్గొనుచుండెడివాఁడు. గార్డెరీచ్ అను ప్రదేశమున యువకవులు, ప్రౌఢకవులు సమావిష్టులై, అహమహమికతో సమస్యలు పూరించెడివారు. పాదాంతములఁ బొదుగుటకై కొన్ని మాటలు ముందుగా నొసఁగి, వానితోఁ బద్యములు పూరించుటయే ఆ సమస్యాపూర్తి. అట్టి పరీక్షలలో మన బాలకవి యగ్రేసరుఁ డనిపించుకొనెను. ఘాలిబ్ మహాకవి శిష్యుఁడగు నదీరుఖానను వృద్ధకవి యీ బాలుని ప్రజ్ఞ నవలోకించి, "ఈ పద్యము లీతనివి కావు. ఇందు గ్రంథ చౌర్యమేకలదో, లేక ఎవరైనఁ జాటుననుండి యీ బాలునిఁ బైకిఁ దెచ్చుటకిట్లు పద్యములల్లి యిచ్చుచున్నారో" యని సంశయించెను. ఒకనాఁడు మన బాలకవి గ్రంథ విక్రయ శాల చెంత నేదోపుస్తకములు చూచుచుండఁగా, నదీరుఖాను చూచి, "ఏమయ్యా! కవి సమ్మేళనములలో నీవు ద్విపదలపై ద్విపదలు కురిపించుచుంటివి కాని, ఆ రచనలన్నియు నీ సొంతమో, ఇతరులవో యని మాకు సంశయముగానున్నది. ఇదిగో, 'యాద్ నహో, షాద్ నహో, అబద్ నహో' అను మాట లిచ్చుచున్నాను. వీనితో ద్విపదలు కూర్పుము. నీ నేర్పు తెలిసివచ్చు" ననెను. మన మౌలానా యీ మాటలచే మొదటఁ గొంత వెలవెలఁబోయెను గాని, కోపము నడంచుకొని, తన ప్రజ్ఞను బ్రత్యక్షముచేయు నుబలాటము నాఁపలేక, ఆ మాటల నంత్యప్రాసలుగాఁ బొదిగి ద్విపదల వర్షము నాశువుగాఁ గురిపించెను. నదీరుఖాన్ ఆనంద

పరవశుఁడై, నడువీధిలో నలుగురు చూచుచుండి రనియైన నెంచక, "సుభానల్లా, సుభానల్లా"యని యఱచుచు గంతులు వేసెను. "నీ ప్రజ్ఞను శంకించితినిగాని నేఁటి కవులలో నీవు మేటి" వనుచు నా వృద్ధకవి ఆజాదును మనసారఁ బ్రశం సించెను. ఇచటనే యొక మాట: ఆజాదు అనునది మన అబుల్ కలాం కవి పెట్టుకొన్న మాఱుపేరు. ఆ నాఁటి కావ్యవ్యసన ముడిగినను, అపుడు పెట్టుకొన్న పేరు మాత్ర మట్లే నిలిచిపోయినది.

మన అబుల్ కలాం ఈ స్వల్ప యశస్సుతోఁ దృప్తి చెందెడి మానిసి కాఁడు. సాహిత్య పత్రికలు, విమర్శలుఁ గూడఁ గాలయాపన మాత్రము లేకాని యాయన ప్రజ్ఞ నంతటిని ధారపోయఁదగినవి కావు. అంతరంగమునఁ దల యెత్తిన జిజ్ఞాస యూరకుండనీయదు. ఎన్నియో సంశయ ములు పొడసూపి 'నే నెచటికిఁ గొట్టుకొనిపోవుచుంటి' నను నాలోచన రేకెత్తఁదొడఁగెను. 1905-7 సంవత్సరములలో నీజిప్టు సిరియా ఇరాకు దేశములందు సల్పిన సంచార మీ యాలోచనము నింకను బ్రబలమొనర్చెను. స్వదేశమునకుఁ దిరిగి వచ్చినంతట వంగరాష్ట్ర మసంతుష్టిచే నల్లాడిపోవుచుఁ బ్రభు తిరస్కార మంత్రములు జపించుచుండెను. వంగరాష్ట్ర విభజనముచేఁ బొంగి పొరలుచున్న యా మహోద్యమ ప్రవాహమున నుఱుకకున్నచో మనశ్శాంతి కుదురదని యాయన పడుచుఁబెడఁద తహతహ చెందెను. ఆనాఁటి యరాజకవాదులను, ఉత్పాతకారులను గలసికొని మాటాడి నంతట ఆజాదు మనస్సు వారి దెసకే మ్రొల్లుచూపెను. వారితో నాజా దెంతవఱకుఁ జేతులు గలిపెనో నే నాయన

నడుగలేదు కాని గూఢచారులాయన ననుమానించి, యొక్క న్నాయనపై వేసియుంచ నారంభించిరి.

అప్పటి కాజాదుమనస్సులో ఇస్లాము ధర్మమును, ముస్లిముల బాగోగులను గూర్చిన యాలోచనలే మెదలు చుండెను. సర్ సయ్యదహమ్మదు రచనలు చదివిన తొలి నాళ్లలో ఆజాదుకు తన మతస్థుల కుపకరింపవలెననియు, విశాలదృష్టి నలవఱచికొనవలెననియు, నవీన భావస్రవంతి నవగాహించి ముఖ్యవిషయ పరిష్కారమునకుఁ బూనవలె ననియు—నిట్టి ప్రేరణలు మనసున నుదయించెను. తనకుఁ బైతృకమై సంక్రమించిన పాండిత్యము, ధర్మచింతన యను సంపద కద్దు. వీనిచే సంతుష్టి గల్గునా? పూర్వాచార పరాయణుల బుద్ధులు సంకుచితములై పోయినవి. ఆస్తిక్యము, తొల్లిటి సిద్ధాంతములుఁ బ్రబలాఘాతముల పాల్పడినవి. తా నేమి చదివినను, పెద్దలచెంత నెంతగా విన్నను సంశయములు ప్రబలి, విశ్వాసము సడలిపోవుచున్నది. తన్ను నిలిపి యుంచిన లంగరు త్రాళ్లు తునిఁగిపోవుచున్నట్లున్నవి. అంతట నాయన కురాను గ్రంథమును మరలఁ బఠించి, యందలి యుపదేశములను నిదానముగా, నిష్పాక్షికముగాఁ దరిచి చూడఁగాఁ దొల్లిటి భక్తి నిలఁద్రొక్కికొనెను. ఆత్మహత్యయే మేలని పొడమిన తలఁపులు పీడకలవలె విరిసిపోయెను. క్రొత్త సేవాపథము తిన్ననై గోచరించి, జీవన పరమార్థము కనుల ముందు నిలిచెను. ఆత్మను బీడించిన సంశయములతోఁ దల పట్లు పట్టి, గెలిచి, యీవలఁబడినంతనే పరంపరాగతమగు నాచారము మఱుఁగైపోయి, నూత్న విశ్వాసాంకురములు చివురెత్తెను. సమూలధర్మసంస్కారమునకుఁ, దిరుగుబాటు

నకుఁ గూడ బుద్ధి పొడమెను. తనకు విద్యాబుద్ధులు గఱపి, విదేశయాత్రల కంపి, పరిణతిగూర్చిన పితృపాదులు గతించిరి. వారు తనకై యిట్లు నిర్మించి యిచ్చిన ప్రాఁతపునాదులపై నూత్న సౌధమును గట్టుట కా బాలునకు స్వేచ్ఛలభించెను. తన కుమారుఁడు త్రొక్కుచున్న యీ క్రొత్త దారి యా తండ్రి యామోదమును బడయునో, పడయుదో చెప్పనులేము. అట్టి విచారణ ఫలకారియుఁ గాఁజాలదు. ఆజాదు ఉరుదుభాష కనువదించిన కొరాను గ్రంథమునకుఁ బ్రవేశికయొండు రచించెను. అందలి తుది వాక్యము లిట నుదాహరింతును. వీనిచే నాయన భావసరణియు, నిట్టి దట్టి దనరాని యాయన శైలీ మనోజ్ఞతయుఁ గొంత విదితమగును.

"నేఁటి పండితులకు, విమర్శకులకుఁ బురాతనమును నవీనమునుండి వేఱుచేసిచూపుట యాచారమైపోయినది. నే నట్టి విభేదమును గణింపను. పురాతన మనునది నా తాత తండ్రుల నుండి నాకు సంక్రమించినది. నా యంత నే నిర్మించుకొన్న మార్గమే నవీన మనునది. పురాణముల మాఱుమూల లన్నియుఁ ద్రొక్కిచూచినట్లే నేఁటి భావసరణి వెంట ఘంటాపథముగఁ జరింతును.

అగుదు నాచార హీనుఁడ, నట్లె శ్రోత్రి
యుఁడ నగుదు; నాకు నీ రెండు నొక్కతీరె.*

"పెద్దలవలనఁ, జదువువలనఁ బరిసరములవలన నాకు సంక్రమించినది చాలదని తొలుతనే యెంచుకొంటిని. పూర్వాచారమునకు నేను కట్టువడను. లోకప్రవృత్తి నంతటి నాక ళించుకొను తృష్ణ నా కెన్నఁడును జల్లాఱలేదు.

---

* మౌలానా ఉదాహరించిన పద్యమునకుఁ దెలుఁగుసేఁత.

"జ్ఞానదీప మొందుండిన నే నచటికిఁ బయనింతును
గాదెనిండ ధాన్య మున్నఁ బోము గింజ లేఱికొనఁగ.*

"నా నిశ్చయజ్ఞాన మంతయు సంశయాగ్నిలోఁ గాఁకలు దీఱినదే. నా భక్తియు నట్లే యవిశ్వాసప్రభంజనము పాలై, నిలిచినది. నేను ద్రాగని విసమనుచు లేదు. ఆ విసములకు శాస్త్రములు సెప్పిన విఱుగు ళ్లన్నిటి నట్లే సేవించితిని. నా తృష్ణ యితరులతృష్ణవంటిది కాదు. పిమ్మట నాకు లభించిన శాంతియు నూరబావిలో దొరకెడి శాంతి కాదు.

"జీవనంపుటూటఁ జేరఁగా ఖజరు దూ
రాధ్వమును గమించి యలసిపోయె;
నేను దానిచెంత కేగ కింకొకయూట
దరిసి, దప్పిదీఱఁ ద్రావికొంటి."*

---

* ఖాలానా ఉదాహరించిన పద్యమునకుఁ దెలుఁగుసేఁత.

# 5. 'అల్ హిలాల్' పుట్టుక

మౌలానా అబుల్ కలాం రాజకీయరంగమున నడుగు పెట్టునరికి, బ్రిటిషు రాజనీతి వశమున హిందూ ముస్లిముల సంబంధము లేరీతిగాఁ బరిణమించినవో సంగ్రహముగా వివరింతును. 1857 నాఁటి భారతీయ విప్లవ ముత్తర హిందూస్థానమునఁ గొన్ని ప్రదేశములందు మాత్రమే ప్రవర్తిల్లినను, దానిచే బ్రిటిషు వారికిఁ గనువిప్పుగలిగినది. తమ ప్రభుత్వమును సుస్థిర మొనర్చుకొనెడి దారి వారికి దొరకెను. హిందువులకు, ముస్లిములకు నంతకుమున్ను యుద్ధములు ప్రవర్తిల్లినను 1857 నాఁటి విప్లవవేళ నా యుభయులను, అస్పష్టమగు ప్రయోజనమేదియో యేక మొనర్చినది. సర్ బార్ట్లిల్ ఫ్రెరీ మున్నగు బ్రిటిషుపాలకుల మాటలనుబట్టి వారిభేదోపాయారంభమును మనము పసికట్టవచ్చును. కాని, భారతజాతీయత తలయెత్తు పర్యంతము నా భేదోపాయము బైటఁబడినది కాదు. జాతీయోద్యమముతో బ్రిటిషర్లకు భయ మావేశించెను. అంతట డఫ్రినుప్రభువు రెండునాలుకలనాటక మారంభించెను. ఆతఁ డొకవంక జాతీయతావాదుల చెవులలోఁ దేనె లొల్కుచు, రెండవవంక ముస్లిముల చెవులలో "జాగ్రత్త" యని విసము నొలుకఁ జొచ్చెను. కాంగ్రెసును రాజకీయ సంస్థగా నిర్మించుటకై, కాంగ్రెసుపితయగు ఏ. ఓ. హ్యూమునాహ్వానించి, కాంగ్రెసు ప్రతినిధుల కొకవంక విందులు సేయుచునే యా ప్రభువు తన మనసులో "పాశ్చాత్య ప్రజాతంత్ర నిర్వహణమునకై ఇండియాలో నాందోళన మొనర్చుట హానికర" మని నిశ్చయించుకొనెను. పరిపాలన సంస్కరణమును గూర్చి పంపిన నివేదనమందు డఫ్రినుప్రభు వేమనెనో

చూడుఁడు: "భారతీయులలోఁ బాశ్చాత్యవిద్యకు, సంస్కృతికి నలవడినవా రల్పసంఖ్యాకులయ్యు, హోదాచేఁ, బరిపాలన దక్షతచే నధికులై రి. వారును, ద త్పక్షీయులును గాంగ్రెసు సభాద్వారమునను, బత్రికల మూలమునను సలుపు నాందోళనమును గాంచి, వారి పలుకుబడి యధికమని మనము భ్రమపడి, యపారమగు భారతప్రజను బరిపాలించెడి బాధ్యత నించు కేనియు వదలుకొనుటకంటెఁ బ్రమాదము మఱియొకటి యుండదు." భారత ప్రజ నెన్నఁటికిఁ బొత్తుకుదురని రెండు తెగలుగాఁ జీలఁదీయుట కంకురారోపణము చేసినదియు నీతఁడే. అందులకు సాక్ష్య మీ మాటలే: "భారత ప్రజలలోఁ బ్రబలములగు రెండు తెగలు కన్నులకుఁ గట్టినట్లు కన్పించును. ఈ రెంటికి మతధర్మములు, పూర్వచరిత్రలు, సంఘనిర్మాణములు, స్వభావములు వేర్వేఱుగా, ఏటి కొకటి, కోటికొకటియై కానవచ్చును. బహుదేవతారాధనముతో, దేవాలయములందలి విగ్రహములతో, గోపూజతో, తీర్చిదిద్దిన వర్ణభేదములతో 19 కోట్ల హిందువు లొకవంక, రెండవవంక ఏకదేవతారాధకులు, విగ్రహభంజకులు, గోహింసకులు, ఏకసంఘీయులునగు నై దుకోట్ల ముస్లిములు! ఎప్పటి కప్పుడు శత్రువులకుఁ దలయొగ్గు స్వభావము హిందువులది. ఢిల్లీసింహాసన మధిష్ఠించి, ఆసేతు శీతాచలమగు భారతభూమిని దాము పాలించిన కాలమును స్మరించుకొను స్వభావము ముస్లిములది." ఈ పది పంక్తులలో నింతటి తంపులమారితనము, నిన్ని అర్ధసత్యములు గుప్పించుట డఫ్రినుప్రభువుకే చెల్లును. "దేశమున వివిధ ప్రాంతములం దున్న ముస్లిమువిద్యావంతులతోఁ బరిచయ మొనర్చుకొనుటచే," నీతఁ డారంభించిన ప్రచార మెట్టిదో

యీ మాటలే పట్టి యిచ్చుచున్నవి: "ముస్లిములకుఁ దొల్లిటి కంటె రాజభక్తిపరాయణత యలవడిన" దఁట! ఓహో ! ఈ మాటలో నెంతటి సంతుష్టి వెల్లివిరియు చున్నది! ఇట్టి చాతుర్య కాపట్యములే కాంగ్రెసుపట్ల ముస్లిములందు ద్వేషబీజములు నాటినవి. వాయవ్య రాష్ట్రపాలకుఁడగు సర్ ఆక్లండు కాల్విన్ శ్రీ ఏ. ఓ. హ్యూమ్తో నేమని వాదించెనో వింటిరా ? "కాంగ్రెసే ముస్లిములందుఁ బ్రతికూలాందోళనమును రేకెత్తించుచున్న"దఁట! పాప, మాయన కోరిక యట్టిది. కావుననే యట్టి యాలోచన తట్టినది.

ఇంతకు, ముస్లిములలోఁ బ్రతికూలాందోళనము సాగిన మాట నిజము. దానికిఁ గర్త యెవ్వరో కాదు; సర్ సయ్యదు అహమ్మదు ఖానే. రజఃప్రధానుఁడగు నాయన దృఢనిశ్చయ మును, గార్యశూరతయు సాటిలేనివి. పాశ్చాత్త్యుల విద్యా సంస్కారములను, భౌతిక దర్శనములను దన మతస్థుల కల వఱుచుటకై దీక్షవహించి, పూర్వాచారపరాయణుల ప్రబల ప్రాతికూల్యమును లక్ష్యింపక, ఫలసిద్ధి నందిన యమోఘ సంకల్పుఁడా మహానుభావుఁడు. కార్యసాధన తత్పరత్వముచే నాయన యొక్కొకపుడు విపరీత ప్రసంగము లొనర్చుట కద్దు. 15-10-1869 న లండనునుండి వ్రాసిన జాబులో నేమను చున్నాఁడో చూడుఁడు: "ఆంగ్లేయులను శ్లాఘించుటకుఁ గాదు కాని, నిజము చెప్పుచున్నాను. భారతప్రజలలోఁ బండి తులను బామరులను, మేటివర్తకులను జిల్లర దుకాణదారు లను, ధనికులను బేదలను ఆంగ్లేయులతోఁ బోల్చి చూచి నపుడు, విద్యలో, సదాచారములో, నీతి సంపదలో వారికి, మనకు హస్తిమశకాంతరము గన్పించును. సుందరదృఢగాత్రు

లకు, మఱికి గొడ్లకుఁ బోలిక యెక్కడిది ? మనలను దుర్బల పశుప్రాయులుగా నాంగ్లేయులు పరిగణింతు రన్నచో దోష మేమి?'' పాశ్చాత్యుల జీవన సౌకర్యములను, స్వాతంత్ర్య మును, అచటి యంగనల విద్యావత్తను గాంచినంతట నాయన కనులు మిఱుమిట్లు గొననోపు. ''భారతీయుల యూహాల కందని విశేషముల నిట ననుదినముఁ దిలకించుచున్నాను. మన ముస్లిములు ప్రాఁతకథలు త్రవ్వికొనుచు, మాపాటివారు లేరని మురిసి ముప్పందు మగుచు, గ్రుడ్డివారై, కుములు చుందురు. ఈజిప్టులో, టర్కీలోఁ దమసాటి ముస్లిములు దిన దినము నాగరికులగుచుండుట వీరెఱుఁగరు. ఈ దేశమునందు వలె మన ప్రజాసామాన్యమునందు విద్యాప్రచారము జరుగ నంతకాలము మనకు నాగరికతయు, మన్ననయు లభించుట కల్ల. ఇచటి కళలను, భౌతిక దర్శనములను మన భాషల లోని కనువదించుకొనకున్నచో మనము బాగుపడఁజాలమని భారతవృద్ధి కాములు గ్రహింపవలెను.'' ఇదియే యాయన ధోరణి. ఈకార్యమును సాధించుటకై యాయన యుత్తర హిందూస్థానమంతట సంచరించి, పాశ్చాత్యవిద్య పాశ్చాత్య విద్యయని జపించుచుఁ, దుదకు ఆలిఘురునందు 1880 లో యం. ఏ. ఓ. కళాశాలను నెలకొల్పి, కృతకృత్యుఁ డయ్యెను. ఆ కళాశాలయే పిమ్మటి కాలమున విశ్వవిద్యాలయముగా రూపందెను. ఇంగ్లండునుండి యధ్యాపకులను రావించి ఆలిఘురుకళాశాలా విద్యార్థులకుఁ బాశ్చాత్యాభిరుచిని మప్పు వఱకు నాయన నిదురపోలేదు.

క్షేమకరమైన యీ భావవిప్లవమును ముస్లిములందు సాధించుటతోఁబాటు ఆయన శ్రద్ధమై వారికి రాజభక్తి

ప్రవణతను గూడ నలవఱిచెను. సర్ వాలెంటైను షిరోలు చెప్పినట్లు "స్వయముగాఁ దా నాచరించి, విద్యార్థులందుఁ బ్రచార మొనర్చిన ఆయన మహదాశయములకు బ్రిటిషు రాజ భక్తి పర్యాయపదము వంటిది. ఆయన ప్రచారప్రభావము భారత ముస్లిముల హృదయములందు సుస్థిరమై నాటు కొన్నది. కావుననే భారతజాతీయ కాంగ్రెసు ద్రొక్కుచున్న వినాశకరమార్గమునకుఁ బ్రతిస్పర్ధిగా వారు 1905 లో భారత ముస్లిము లీగును నెలకొల్పుకొనిరి. 1888 డిసెంబరులో మేజరు జనరల్ గ్రాహాముపేర నాయన వ్రాసినజాబులో "జాతీయ కాంగ్రెసుకు (బ్రతిస్పర్ధిగా 'భారతీయ రాజభక్తిసమాజము'ను నేను గల్పించి నెలకొల్పితిని. తక్కిన పనులన్నియు నొకయెత్తు, నిది యొక యెత్తు" అని చెప్పికొనెను. రాజులు, మహారాజులు, జమీందారులు నీ సమాజమునఁ జేరి, కాంగ్రెసు రాజనీతికిఁ దాము వ్యతిరేకులమని ప్రభుత్వమునకు నివేదించిరి. కాంగ్రెసు మహాసభ కలకత్తాలో జరగుచుండఁగా ముస్లిములను దాని నుండి మరల్చుటకై యాయన వేఱొక ప్రదేశమున ముస్లిము విద్యాప్రచారసభను సమకూర్చెను. ఈ రీతిగా ఆలిఘురులోఁ దలయెత్తిన నవీనబుద్ధులకుఁ గాంగ్రెసును వ్యతిరేకించుటయు, బ్రిటిషు ప్రభుత కండగా నుండుటయు, ఇదియే ధర్మ మాయెను. బ్రిటిషుభేదనీతికి ఆలిఘురు విద్యావంతు లీరీతిగాఁ జక్కని యుపకరణముగా నమరినంతట మింటో ప్రభువు ముస్లి ముల రాయబారమును దనచెంతకు రప్పించుకొనెను. దానికి శ్రీ శ్రీ ఆగాఖానులవారు నేతృత్వము వహించి, ముస్లిములకుఁ బ్రత్యేక ప్రాతినిధ్యము నర్థించిరి. మౌలానా మహమ్మదాలీ చెప్పిన ట్లీతంతు సర్వము మింటో ప్రభువుచేసిన సింగారమే.

ఇఁక నీరాయబారమును సర్ వాలెంటైను షిరోలు మెచ్చుకొని, మేఁకతోలు గప్పిన విధము నాలకింపుఁడు: "శ్రీ శ్రీ ఆగాఖానులవారి వెంట నేతెంచిన యీపెద్దలు మింటో ప్రభువును దర్శించి, చెడుదారిఁ బడిన కాంగ్రెసును నిరసించి, వంగదేశవిభజనవలన నేర్పడిన స్థితి గతులనుగూర్చి ముస్లిముల యభిప్రాయములను విన్నవించిరి. 'తొందరపడి, హిందువుల మాటలు మన్నించి, వారికి సదుపాయములు ఘటించినచో నధికసంఖ్యాకులగు హిందువులు చెట్టెక్కి కూరు చుందురు. అది బ్రిటిషు ప్రభుత్వమునకే కాదు. ముస్లిములకుఁ గూడఁ జేటుగూర్చును. ముస్లిముల యచంచల రాజభక్తి మీ రెఱుఁగనిది కాదు.' ఇట్లు తెలియఁజెప్పి, ఆతరుణమున మింటో ప్రభువిచ్చిన మాట వెంబడినే, 1909 నాఁటి భారత ప్రాతినిధ్యశాసనమున (Indian Councils Act) ముస్లిము మతస్థులకుఁ బ్రత్యేకప్రాతినిధ్యము నిమ్మని యడిగిరి. తుదకుఁ దమ కోరికను జెల్లించుకొనిరి." ఈ నాటక మంతయు మింటో ప్రభువే యాడించెనని మౌలానా మహమ్మదాలీ చెప్పిన మాట సత్యదూరము కా దనుటకు మార్లే ప్రభువు మింటో ప్రభువు నకు వ్రాసినజాబులోని యీ మాటలే సాక్ష్యము: "మహమ్మ దీయులను గూర్చిన మన వివాదము నింకఁ బొడిగింపను. ముస్లిముల 'అదనపుహక్కు'లను మీ తొలుతటి ప్రసంగమే ఈ ముస్లిము బూచి దలయెత్తుటకుఁ గారణమైనదని విన్న వింతును." ఈ విషయమున మార్లే ప్రభువు పరోక్షసాక్ష్యమే కాక మఱియొక ప్రత్యక్షసాక్ష్యము గూడ నున్నది. దానిని మౌలానాయే చెప్పెను. ఈ ప్రత్యేక ప్రాతినిధ్యవాంఛకును, నీ రాయబారమునకుఁ బుట్టుక ఆలీఘురులోఁగాదు; సిమ్లా

నగరమందే. ఆలీఘరుకళాశాలయం దా కాలమున నధ్యక్షుఁడుగానున్న శ్రీ ఆర్చిబాల్డు అనునాతఁడు ఆలీఘరు సిమ్లాల మధ్య సంధానకర్త. ఈతఁడు సిమ్లా కేగి, మింటోప్రభువును దర్శించి, తిరిగి వచ్చి, కళాశాలా గౌరవాధ్యక్షులగు నవాబు మోసినుల్ ముల్కు నీ రాయబారమునకై ప్రేరేపించెను. శ్రీశ్రీ ఆగాఖానులవా రప్పటి కప్పుడే ఇంగ్లండునకుఁ బయనమై యేగిరి. వారు ఏడెను రేవు చేరకమున్న నవాబు మోసినుల్ముల్కు వారికిఁ దంతివార్త యంపి, వెనుకకు రప్పించెను. వారు వెంటనే బొంబాయికిఁ దిరిగి వచ్చి, రాయబారులకు నేతలై, మింటో ప్రభువును దర్శించిరి. ఈ కథ యంతయు శ్రీ ఆర్చిబాల్డు వ్రాఁతలవలననే మన కిపుడు తెల్లమగును. మోర్లే ప్రభువు మింటోప్రభుని ప్రసంగమునుగూర్చి మాత్రమే వినెనుగాని ఇండియాలోఁ దెర వెనుక నడచిన యీ నాటకమును గూర్చి విని యుండఁడు.

యువకుఁడగు అబుల్ కలాం ఆజాదు ఈజిప్టునుండి తిరిగి వచ్చు నప్పటికి మన దేశమున గాలిపా టీ విధముగా నున్నది.

ఆజాదు జనకుఁడు 1857 తిరుగుబాటు నాఁటి దారుణానుభవములను గొమరునకు వినిచియుండును. పగదీర్చు కొనుటలో శత్రుమిత్రభేదమును బాటింపని యా నాఁటి భీషణ హింసా కాండ హృదయశల్యమై వేధించుచుండ, తండ్రి పాశ్చాత్యులపై రెత్తినచో మండిపడుచున్నను కొమరున కట్టి ద్వేషము లేదు. భారత ముస్లిములను పూర్వాచారాంధ్యము నుండి సర్ సయ్యదహమ్మదు ఖాన్ పాశ్చాత్యవిజ్ఞానము దెసకు మరల్చి మేలుచేసె ననుటలో ఆజాదు కెట్టి సంశయము లేదు. కాని, భారత ముస్లిములను రాజకీయములకుఁ,

గాం గ్రెసుకు దవ్వొనర్చి తాను బ్రిటిషు సామ్రాజ్యశక్తికి ఉప కరణమాత్రుఁడైతినని సర్ సయ్యదెఱుఁగఁడాయెఁగదాయని యాజాదు వగచెను. ఇట్టి తలపోఁత యాకాలపు ముస్లిములలో నెవరికోకాని పొడమదాయెను. సర్ సయ్యదుచేసిన యీ పని వలన యావద్భారతమునకు రాజకీయాభ్యుదయము కుంటు వడుటయే కాక, ముస్లిములకు స్వాభిమానము, ఔదార్యము, మంత్రశక్తియుఁ గొఱవడి, పరప్రత్యయనేయబుద్ధి యలవడె నని మౌలానా ఆజాదు విచారము పాలాయెను.

1908 నాఁటికి మౌలానా కిరువదియేండ్లు. అప్పటికే యాయన భావధార తీవ్రపరివర్తనము లందసాగెను. అప్పటి భారత రాజకీయ పరిస్థితియే యాయన భావములందు ప్రధాన మగు మార్పునకుఁ గారణమైనది. ఆయన జన్మభూమియగు వంగరాష్ట్రి మసంతృప్తిచే నుడికి పోవుచు, నూత్న రాజకీయ ప్రబోధముచే మేల్కొనుచుండెను. భారతభూమిని దిలకించు విదేశీయులకుఁ బరస్పరవిరుద్ధములగు రెండు చిత్తరువు లేక కాలమందే కన్పించుచుండెను. దేశభక్తి ప్రచోదితులై, స్వాతంత్ర్య మనోరథముపై హిందువు లొకవంక నూరేగు చుండిరి. ప్రభుత్వ పరుషదండనీతి కించుకయుఁ జలింపక, పచ్చ పచ్చని పడుచుదనపుబ్రదుకులను వారు మాతృభూమి చరణ కమలములచెంత బలి యొసఁగుచుండిరి. ఇఁక రెండవవంక, ముస్లిములు - స్వాతంత్ర్య సమరపరాఙ్ముఖులై, ప్రభుత్వ మాడించినట్లెల్ల నాడుట కొడఁబడి, జాతీయతా మహోద్యమ మున కడ్డుదగులుటకై కృతనిశ్చయులై నిలిచియుండిరి. బ్రిటిషు పారతంత్ర్యమునుండి విడివడుటకై తరుణభారతము నడుము కట్టి ముందునకు సాగిపోవుచుండ, ముస్లిములు రాజభక్తి

మంత్రమును జపించుచుండిరి. ఈ వైరుధ్యమును గాంచి యాజాదు భయకంపితుఁడయ్యెను. తన మతస్థు లిట్టి దైన్యమున కొడఁబడుట నాయన సహింపలేకపోయెను. వారి కెల్లయిన సద్బుద్ధి నొడఁగూర్పఁ గృతనిశ్చయుఁ డయ్యెను. ముస్లిముల బుద్ధిని మార్చు నుపాయమేదియాయని మౌలానా పెక్కేండ్లు చింతించినంతట నాయనకు రెండుమార్గములు స్పష్టములై గోచరించెను. ఆలిఘురులోఁ దలయెత్తిన పెడబుద్ధుల నెదుర్కొను నుత్సాహశక్తిని సృజించుట యొకటి; ముస్లిములపాలిటి పరమబంధువులైన యాంగ్లేయులు వారికి నూరిపోసిన రాజభక్తిని కూఁకటివ్రేళ్ళతోఁ బెకలించుట యొకటి.

మౌలానా యంతట వలయు సన్నాహము లొనర్చుకొని, ముస్లిములఁ బ్రబోధించుటకై 'అల్ హిలాల్' (చంద్రరేఖ) అను వారపత్రికను బ్రచురింపనారంభించెను. 1-6-1912 న ప్రథమ సంచిక వెలువడెను. అప్పటి కాయన కిరువది నాలుగేండ్లు. ముస్లిము లప్పటికప్పుడే యాయనను మౌలానా (మహానేత) యని గౌరవించుచుండిరి. మౌలానా మహమ్మదాలీ తన 'కామ్రేడు'పత్రికాముఖమున 'అల్ హిలాల్' కిట్లు స్వాగతము పల్కెను: "ఈ పత్రిక నారంభించుటకై మౌలానా అబుల్కలాం ఆజా దెంతటి వ్యయప్రయాసలకు లోనయ్యెనో మే మెఱుఁగుదుము. చిత్తరువులచే విరాజిల్లుచు నీ పత్రిక క్రొత్తదారి ద్రొక్కినది. ఈ దేశమున నురుదుపత్రికలు విసువు గొలుపు ప్రాఁతకాలపుటచ్చులతో ముద్రముదుఁగుచుండ, నీ పత్రిక తురుష్కలిపి నవలంబించి మేలుచేసినది. ఇది నూతనారంభము కాకున్నను, ముచ్చట గొల్పుచున్నది.

ముస్లిముల విద్యావిషయములకు, శాస్త్రచర్చలకు, సాహిత్యమునకు నిందు తప్పనిసరిగాఁ జోటిచ్చుటయే కాక, టర్కీ, పారసీకము, మొరాకో మున్నగు నిస్లాము ప్రపంచ స్థితిగతులిం దభివర్ణితము లగుచుండును.'' ఈ స్వాగతవచనములందు 'అల్ హిలాల్' పత్రికోద్దేశములనుగూర్చిన ప్రస్తావమించుకయు లేదు. 'కామ్రేడ్' పత్రిక యాకాలమున ఆలిఘురుమతము నవలంబించి యుండుటయే యిందులకుఁ గారణము. తన మతమునకడ్డుదగులు 'అల్ హిలాలు'ను 'కామ్రేడు' అభినందించుట పొసఁగదు కదా! కష్టనష్టములను గణింపక, తనవారు విరక్తులగుదురనియేని యోజింపక ఇట్లు పత్రికను బ్రచురింపఁదొడఁగిన మన యువ మౌలానా తన యాశయములను రెండవ సంచికయందే స్పష్ట మొనర్పసాగెను. ఆ ప్రాఁత సంచికలను జూచు భాగ్యము నాకు లభింపలేదుగాని ప్రారంభ సంచికలతోనే ముస్లిము ప్రపంచము తల్లడ మందఁజొచ్చెనని మౌలానాయే చెప్పఁగా వింటిని. తమ బుద్ధులు పెడదారిఁ బట్టినవా యని ముస్లిములు గాఢాలోచనలోఁ బడిరఁట. అజ్ఞానముపై, దురభిమానముపైఁ గత్తిగట్టి సర్ సయ్యదహమ్మదు విజయమందఁగా, ఈ మౌలానా ప్రతీపబుద్ధులపై, సంకుచిత ధర్మములపైఁ గత్తిగట్టి బయలు దేఱెను.

ఢాకాపురమున ముస్లిము విద్యాప్రచారసభ ముగిసినంతనే ముస్లిము లీగును నెలకొల్పు యత్నములు సాగెను. ముస్లిములను కాంగ్రెసునుండి మరలించి, బ్రిటిషు ప్రభువులకు భక్తులనొనర్చి, తెలివిగల హిందువులవలన ముస్లిముప్రయోజనములు నష్టపడకుండ రక్షించుటకై జన్మించిన దీ ముస్లిము లీగు. ఆలిఘురు కళాశాలా కార్యదర్శియు, ముస్లిములీగు జనకులలో

ముఖ్యుఁడునగు నవాబ్ ముష్తాక్ హుస్సేను తన ప్రథమ ప్రసంగమునందే "బ్రిటిషు రాజ్యరక్షణమున నిస్లాముఖడ్గ మెప్పుడు సిద్ధముగా నుండును" అని చాటెనఁట. ఈ ముస్లిము లీగు మతమును బ్రతిఘటించుటకై మన మౌలానా ఆదిలోనే ప్రతినఁ బూనెను.

---

# 6. నిర్బంధావాసము

'అల్ హిలాల్' పుట్టిన కొన్ని వారములకే దాని ప్రభావము గన్పింపఁ జొచ్చెను. ఆఱునెలలు నిండకుండఁగనే పదునొకండు వేల ప్రతులమ్ముడు వోయెను. దానిని జదివెడువారు ముఖ్యముగా ముస్లిములు. సంవత్సరమునకుఁ జెల్లింపవలసిన శుల్కము పంద్రెండురూప్యములు. అటులయ్యు నింతటిప్రచారమా పత్రికకు లభించుట యక్కజమే యగును. ప్రతీపబుద్ధులు, రాజభక్తులు నగు ముస్లిములలో వెంటనే కలవరము జనించెను. సాహెబ్జాదా అఫ్తబ్ అహమ్మదుఖాన్ ప్రభృతులు వ్యతిరేక ప్రచారము సాగించి, కలకత్తానగరమున 'అల్ హిలాల్' ప్రచారమును గొంత యరికట్టిరి. నిర్దుష్టము, సంప్రదాయ సిద్ధమునగు నా పత్రికయందలి ఉరుదుశైలి వంగ ముస్లిములకుఁ గొఱుకు వడకుంటయు నిందులకుఁ గారణము గానోపు. యు. పి. లో మాత్రము దానిప్రచారము క్రమముగా వృద్ధియై, జనరంజక మయ్యెను. ఆ రాష్ట్రప్రజలు పలుతావుల గుములు గూడి యా పత్రికా పఠనమును పురాణశ్రవణము చేయఁ జొచ్చిరి.

'అల్ హిలాల్' తన రాజకీయ మతమును చాటి చెప్పుటయే కాక సాంఘిక, ధార్మిక విషయములనుగూడ ధైర్యముగా వ్యాఖ్యానింపఁ జొచ్చెను. గోహింసాకారణముగా నయోధ్యాపురమున 1913 లో గలహములు చెలరేఁగినంతట గోవును బలియిచ్చు హక్కుగలదని ముస్లిములు పట్టుబట్టుట మతసామరస్యమునకు భంజకమగునని మౌలానా మోమోటము విడిచి, చాటి చెప్పెను. ఆకాలమున నింతటి వింతమాట చెప్పుట విడ్డూరముగాఁ దోఁచెను. హకీం అజ్మలు

ఖానువంటి ఆప్తమిత్రము గూడ మౌలానాపై విఱుచుకొని పడి, వాదప్రతివాదములకు దిగెను. 1920 నాఁటికి హాకీంజీ తన పొరపాటు నంగీకరించి, మౌలానాతో సంపూర్ణముగా నేకీభవించెను. మౌలానా మహమ్మదాలీయు 'అల్ హిలాల్' వ్రాఁతను నిరసించి, ఖండించిన వాఁడే. ఇది యిటులుండ 'అల్ హిలాల్' ప్రభావము విదేశములందును బ్రసరింపఁ జొచ్చెను. తదనంతరకాలమున యూరోపునందుఁ బ్రవర్తిల్లిన విశేషములుగూడ మౌలానాకే యనుకూలింపఁగా మౌలానా చెప్పినదే నిక్కమౌ మైనని యాయన శత్రువులుగూడ నాలుకలు గఱచుకొనిరి. అప్పటి పరిస్థితులను గూర్చి సర్ వాలెంటైను షిరోల్ చెప్పిన సంక్షేప రమణీయోక్తులనే యిటఁ బొందుపఱుచుదును :

"సయ్యదహమ్మదు నెఱుఁగని క్రొత్తతరము ముస్లిములు బయలుదేఱి, యాయన యుపదేశములు ప్రాఁతకాలపువని యాక్షేపింపఁజొచ్చిరి. పాశ్చాత్య విద్యావ్యాసంగముచే వీరు నేర్చిన పాఠములకు, సర్ సయ్యదు చెప్పిన వానికిఁ బొత్తు గుదుర దయ్యెను. హిందువులలోని తీవ్రవాదుల ధోరణికి వీరి ధోరణి దగ్గఱి చుట్టముగాఁ గన్పించెను. వారివలెనే వీరును భారత జాతీయతా మహోత్సాహమునఁ బాలు పంచుకొన నువ్విళులూరుచుండిరి. ముస్లిముల భారతప్రభు భక్తియే కాదు, బ్రిటిషు సామ్రాజ్యానురక్తియు సన్నగిలుటకుఁ దగిన కారణములుగూడఁ గలిసి వచ్చెను. కర్జను ప్రభువు వంగభూమిని విభజించి, ముస్లిము ప్రాబల్యముగల తూర్పువంగమును నిర్మింపఁగా, 1911 లో నా విభజనమును బ్రభుత్వము తిరుగఁదోడుటచే హిందూ ప్రాబల్యముగల వంగరాష్ట్రమే

మరల ముస్లిములకు శరణ్యమయ్యెను. సంప్రదాయబద్ధులగు వృద్ధ ముస్లిములకుఁగూడ దీనిచే నాశాభంగము, నంత స్తాపము జనించెను. ఇఁకఁ బురోగమనశీలురగు ముస్లిము లావల టర్కీలో బయలుదేఱిన విప్లవ ప్రభంజనముచే నూఁగు లాడుచు, నచటఁ దలయెత్తిన ముస్లిము మహారాజ్యమును దలపోసి మురిసిపోఁ దొడఁగిరి. ముస్లిము దేశములలోఁ దల యెత్తుచున్న స్వాభిమానమువలనను, స్వాతంత్ర్య వాంఛవల నను నెప్పు డేమి పుట్టి మునుఁగునోయను భీతిచే బ్రిటిషు సామ్రాజ్య నేతలు కుటిల రాజనీతి నవలంబించుచుండిరని టర్కీ ప్రజోద్యమ నాయకులు భారత ముస్లిములకుఁ గను విప్పుఁ గల్పింపఁజొచ్చిరి. ఈజిప్టును బ్రిటను ఆక్రమించుటయు, మొరాకో విషయమునఁ బరాసులతోను, పర్షియా విషయ మున రష్యన్లతోను బ్రిటను ఒడంబడిక గుదుర్చుకొనుటయు— ఇవి యన్నియు నిటులుండఁగా – ఇటలీ ట్రిపోలీపై నెత్తిపోవు టయుఁ గాంచినంతటఁ బాశ్చాత్యుల కౌటిల్య మెల్ల భారత ముస్లిములకుఁ గరతలామలక మయ్యెను. క్రైస్తవరాజ్యము లన్నియు నేకీభవించి ముస్లిము ప్రాభవము నంత మొందించు టకు సమకట్టుచున్నవని గోచరించెను. ఈ నైహిక ప్రాభవము నశించినచో ముస్లిముల పారమార్థిక సామ్రాజ్యమును నశించు నని వృద్ధ ముస్లిములకుఁగూడ భయ ముప్పతిల్లెను. యూరోపు రాజ్యకూటము తురుష్క సామ్రాజ్య వినాశనమునకై పన్నాగములు పన్నుచు, నా సామ్రాజ్యమందున్న క్రైస్తవ ప్రజలకు స్వాతంత్ర్యమును, రాజకీయ సంస్కరణములను గోరి యొత్తిడి చేయుచుండెను. అంతకుమున్నే టర్కీనుండి విడివడి, స్వతంత్రములైన ఐరోపీయ క్రైస్తవ రాజ్యముల

కీరీతిగా బలుపు చిక్కుటయే కాక, యాసియా యందున్న సామంత రాజ్యములకుఁ గూడ టర్కీ యలుసై పోవును. యూరపు రాజ్యము లిట్లు టర్కీని గోఱలూడ్చిన పన్నగము నొనర్పఁజూచుచున్నతఱి జర్మనీ, స్వప్రయోజనముకొఱకు, టర్కీ నా విపత్తునుండి కాపాడెను. ఇస్లాము మతము పేరిటి మహాపన్నగమునకు పడగవంటి టర్కీ సామ్రాజ్యమును జిదుకఁ బొడువవలయునను యూరపురాజ్యముల కూట నీతికి 1912-13 నాఁటి బాల్కను యుద్ధములు మఱియొక తార్కాణమై ముస్లిములకుఁ దోఁచెను. భారత ముస్లిము లందఱకుఁ దురుష్క సామ్రాజ్యమును రక్షింపవలెనను నాస్థ యుండుట యటులుండఁ, దీవ్రవాదులు భారతదేశమున టర్కీ రక్షణమునకై ధనము సేకరించి కాన్స్టాంటినోపిలు కేగిరి. అచట సుల్తానుపేరట రాజ్య చక్రముఁ ద్రిప్పుచున్న తురుష్క ప్రజానేతలతో సఖ్యము గావించిరి. ఆ తీవ్రవాదులే భారత ముస్లిములీగును వశీకరించి, దానికి భారత కాంగ్రెసు సాహచర్యముఁ గూర్చుటకై తీవ్ర యత్నములు గావించిరి.”

భారత ముస్లిము లీగుకు లండనులో నొక శాఖయుండెను. అందలి సభ్యులు భారత ముస్లిములను హిందువులతో సఖ్యము నెఱపుఁడని హెచ్చరించిరి. శ్రీ విలియం బ్లంటు మున్నగు వారు గూడ ముస్లిములు మత దురభిమానము వీడి భారత కాంగ్రెసుతోఁ బొత్తుగలియుట సేమమని యుపదేశించిరి. టర్కీకిఁ బ్రాప్తించిన యీ బహిరంగోపద్రవములకంటె మన మౌలానాకు భారతదేశాంతరంగిక పరిస్థితులే ప్రధానమై తోఁచెను. భారత ముస్లిములు జపించెడి “రాజభక్తి” మంత్రము మౌలానాకుఁ గంటకప్రాయము. రాజనీతిని బురస్క

రించుకొని యాయన మొదటినుండియు నీ రాజభక్తి వాదమును బ్రతిఘటించెను. భారత ముస్లిముల చిత్తవృత్తి మాఱిపోవుటకై పరిస్థితు లిట్లు ముంచుకొని వచ్చుచున్నను మౌలానా మహమ్మదాలీ వంటివారు కాంగ్రెసుతో ముస్లిములకు రాజకీయ సఖ్యము సనేమిరా వలదనుచుండిరి. ముస్లిములకుఁ గాంగ్రెసుతో సఖ్యము నుపదేశించిన లండను ముస్లిములను మౌలానా మహమ్మదాలీ యెట్లు తెగనాడెనో పరికింపుఁడు: "కీర్తి కాంతచేఁ గొందఱు మందబుద్ధులు - టర్కీ పర్షియాలకుఁ బ్రమాదము పుట్టెను గావునను, మన ప్రభుత్వము వంగదేశ విభజనమును దిరుగఁద్రోడెను గావునను ముస్లిములు భారత కాంగ్రెసుతో నేకీభవింపవలెనని వాడవాడలఁ జాటఁజొచ్చిరి. మాకు వినోదము గూర్చుచున్న యీ బుద్ధిహీనత కేమిగాని, బాధ్యత నెఱిఁగిన లండను ముస్లిములీగుకూడఁ బర్షియాలోను, ట్రిపోలిలోను ఐరోపీయులు ముస్లిములపై నెత్తివచ్చిరను కారణమున హిందూముస్లిము సఖ్యత నుపదేశించుటఁ గాంచినంత, నెంతటి స్వస్థచిత్తుల కేని ఒక్కొక్కతఱిఁ జిత్తభ్రమణము గల్గునని నేఁటికిఁ దెలిసివచ్చినది. విదేశములందలి ముస్లిముల విపత్తులకు భారత ముస్లిముల ప్రయోజనములకు నైరుధ్య మున్నదందురా? లేక ముస్లిములిన్నాళ్లు నీచమగు కపట రాజనీతికి పాల్పడి రందురా? అట్లు కాక, ఇచటి పరిస్థితు లేమేని మార్పుజెందినవా?"

ఇచటి పరిస్థితులు మాఱనిమాట నిజమేకాని భారత ముస్లిముల సంకుచిత దృష్టిమాత్రము మాఱవలసి యున్నది. భారత కాంగ్రెసు పుట్టిననాఁటినుండియు జస్టిసు బద్రుద్దీన్ త్యాబ్జీ, రహింతుల్లా సయానీవంటి దూరదృష్టి గల ముస్లిము

పెద్దలు మంచికిఁ, జెట్టకుఁ గాంగ్రెసు తోటిపాటి వారమేయని దారి చూపుచునే యుండిరి. లక్నో నగరమందలి సున్నీ ముస్లిముల నాయకునిచే షేక్ రజాహుస్సే నొక యాజ్ఞాపత్రము (ఫత్వా) ప్రకటింపఁ జేసెను. ముస్లిములందఱుఁ గాంగ్రెసు నభిమానింప వలెననియుఁ, గాంగ్రెసును ప్రతిఘటించుచున్నది ముస్లిముల ప్రభువులే కాని ముస్లిములు గాదనియు నాఫత్వా హెచ్చరిక సల్పెను.

ఈస్థితిలో వినిపించిన ప్రబోధగీతము ముస్లిములను మేల్కొలిపెను. 'అల్ హిలాల్' పత్రిక కొలఁదినెలలు ముగియకుండఁగనే ముస్లిమువిద్యావంతులకు నూతనరాజనీతిప్రబోధము గల్గినది. న్నినాళ్లు ముస్లిముల రాజకీయ పురోగతి కడ్డునిలిచి, బ్రిటిషు ప్రభుత్వమునకు జయధ్వానములు సల్పుచున్న ఆలిఘురు నాయకుల యాట లీప్రబోధముచేఁ గట్టువడెను. అపుడు సయ్యద్ వజీరుహుస్సేను ముస్లిములీగు కార్యదర్శి. (వీరు పిమ్మట న్యాయమూర్తులై, సర్ బిరుద మందిరి.) వీరును మొదట 'అల్ హిలాలు'కుఁ బ్రతికూలురే యయ్యుఁ, గాలవశమున ముస్లిము ప్రజల యవబోధమును గమనించి, ముస్లిములీగు ధోరణిని మార్చుట కంగీకరించిరి. ఈ పనిమీఁద వారు దేశమెల్లెడ సంచరించి, కలకత్తాకేగి, మౌలానా ఆజాదుతో దీర్ఘముగ సంప్రతించిరి. పిమ్మట 1913 ఏప్రిలు మాసమున లక్నో నగరమున ముస్లిములీగు సమావేశమయ్యెను. "బ్రిటిషు రాజభక్తియు, ముస్లిము ప్రయోజనముల రక్షణమే" అంతకుమున్ను లీగు లక్ష్యములు కాఁగా, లక్నో సభలో "ఇండియాకు సముచిత స్వపరిపాలనము" అని యా లక్ష్యము మార్పుచెందెను. ఈరీతిగా లీగుకు రాజకీయ లక్ష్య

మొకటి తొలిసారిగా నేర్పడెను.

"సముచిత" మను విశేషణము మౌలానా ఆజాదుకు రుచింపదయ్యెను. లీగు నిబంధనలలో రాజభక్తి నుద్ఘాటింపఁ బనిలేదని కూడ ఆయన వాదింపఁగా, మౌలానా మహమ్మదాలీ ప్రతిఘటించెను. రాజభక్తి ధర్మము నుద్ఘాటింపవలసిన దే యని యాయన చెప్పిన యీ మాటలు నేఁడు మన కచ్చెరువు గూర్చును: "కాల్మాను (ధర్మ ప్రమాణమును) ఒక్కసారి పఠించినచోఁ జాలును ముస్లిమగుటకు. అట్లయ్యు, ధర్మరతు లగు ముస్లిములా ప్రమాణ వచనములను నిత్యము బారాయణ మొనర్చుటలేదా? అంతియేకాదు; కాల్మా ఎల్లపుడు వారి జిహ్వాగ్రములందే యుండును. అట్లే మనము బ్రిటిషు ప్రభు భక్తుల మైనందుల కాభక్తితో సంతుష్టిఁ జెంది యూరకుండఁ దగదు. ఎడప దడప, మన సకల ప్రవృత్తులందు నా రాజభక్తి నుద్ఘాటించు చుండవలెను."

భారత ముస్లిముల భావము లిట్లు శీఘ్రపరివర్తన మందుటకు యూరపునందలి సంఘటనలును దోహద మొనర్చెను. ఇంతకుము న్నుదాహరించిన సర్ వాలెంటైను షిరోలు వాక్యములందలి ఘటనలకెల్ల మెఱుగు పెట్టినట్లుచట మహా యుద్ధము సంప్రాప్తమాయెను. ఆ యుద్ధమందలి ఘటనలచే మౌలానా మహమ్మదాలీ వంటివారి మనస్సులుగూడ మాఱి పోయెను. యుద్ధ మొకవంక జరుగుచుండఁగనే యాయన "ప్రభుత్వము మనకిపుడు స్వపరిపాలన మొసఁగుదు నన్నను మన మంగీకరింపము. దానికిఁ దరుణము మించిపోయెనని విన్నవింతుము. వరము లడుగుటయుఁ, బుచ్చుకొనుటయు శాంతివేళ లందేకాని యిపుడుగాదు. లంచములు పుచ్చు

కొనుటకు మనము రష్యాలోని పోలుజాతివారముగాము'' అని ప్రకటించెను.

మౌలానా మహమ్మదాలీ చేసిన యీ ప్రకటనయే పిమ్మట నాయన పత్రిక ధరావతు గోల్పోవుటకును, సోదరుని తోఁగూడ నాయన నిర్బంధముపా లగుటకును గారణ మాయె నని యిప్పు డందఱు నెఱిఁగినదే. ఇది యిటులుండ 'అల్ హిలాల్' పత్రిక యుద్ధకాలమున దేశమంతట బహుళ ప్రచార మంది 25,000 ప్రతు లమ్ముడువోఁ దొడఁగెను. దాని పలుకుబడి యెట్టిదో యీక్రింది ముచ్చటలు దెల్లమొనర్చును. ముల్తానులోఁ బనిచేయుచున్న శ్రీ ఫిల్బీయను ఐ. సి. యస్. ఉద్యోగిని పంజాబు ప్రభుత్వము 'అల్ హిలాల్'ను గూర్చి సమాచారము సేకరించుటకై ప్రత్యేకముగా నియోగించెను. ఆయన వేఱుపనిమీఁద కలకత్తా కేగుట తటస్థింపఁగా, 'అల్ హిలాల్' పత్రికయందలి నిరుపమశైలి కచ్చెరువంది యాయన మౌలానా ఆజాదును దర్శించి, యా పత్రికా ప్రాశస్త్యమును బ్రస్తుతి గావించెను. మౌలానాతోడి యీపరిచయమే శ్రీ ఫిల్బీ అరబు భాషను నేర్చుటకును, పిమ్మట మెసపొటేమియా కరిగినపుడు 'అరేబియా హృదయము' అను గ్రంథమును రచించుటకును గారణమయ్యెను.

వంగ విప్లావక సంఘముతో మౌలానాకుఁదొలుతఁ గొంతసంబంధ ముండెనుగానఁ బ్రభుత్వ రహస్యచారదళాధిపతి యగు శ్రీ క్లీవులండు మౌలానాను బంధించుట కేమైన నాదరువు దొరకునేమోయని తఱచివేచి, ఆ పూర్వగాథను గాలించి చూడఁ దొడఁగెను. తన పత్రికకుఁ, దనకు నేదో మూఁడనున్నదని 1914 నవంబరు నాఁటికే మౌలానా

కనుమాన మంకురించెను. యు. పి. గవర్నరగు సర్ జేమ్సు మెస్టను ప్రేరణమున నలహాబాదు నందలి 'పయొనీరు' పత్రిక 'కలకత్తాలో జర్మను పక్షపాతము' అను సంపాదక వ్యాసమును బ్రకటించి, యందు మౌలానా జర్మనీ దెసకు మ్రొగ్గుచుండెనని యారోపించెను. 'అల్ హిలాల్'పై నితరు లెంతగాఁ గన్నువేసి యుండిరో తెలుపుటకై సుదీర్ఘమగు నా వ్యాస భాగములనిట నుదాహరింతును. పఠితల కాపత్రికను బరిచయ మొనర్చు నీ వాక్యములు గమనింపుఁడు.

"'అల్ హిలా'లను సచిత్ర ఉరుదువారపత్రిక కలకత్తా నుండి వెలువడు చున్నది. అబుల్ కలాం అను ఢిల్లీ ముస్లిము తత్సంపాదకుఁడు. ఈ రాష్ట్రమునందు దీనిప్రచార మధికము. ఇతర రాష్ట్రము లందును బ్రచార మున్నదేమో? యుద్ధారంభము నుండియు దీని జర్మను పక్షపాతము పఠితలకుఁ గొట్టవచ్చిన ట్లగపడుచున్నను, ప్రభుత్వ మిన్నాళ్లు దీనివ్రాఁతల నెట్లు సహించెనో యని యక్కజ మొదవుచున్నది. దీని ఉరుదు రచనలు కలకత్తాలో నెవ్వరికి బోధపడవుగదా యని ప్రభుత్వ ముపేక్షించి యుండును. ఈ పత్రికా సంపాదకుఁడు దీనిని కలకత్తానుండి ప్రచురించుటకుఁ గూడ నిదియే ముఖ్య కారణము గానోపును. దీని తుంటరి వ్రాఁతలందు వ్యంగ్య గర్భములై ధ్వనించెడి యపహాస్యములు, నవహేళనములును బట్టుకొంద మన్నచోఁ జేతికిఁ జిక్కవు. ఆంగ్లమునకు మార్చినచో నవి మొదలే మటుమాయమగును. ఉరుదు మూలము నాంగ్లేయులు చదువరు గావున వారికివి నిరపాయములై కన్పించును. ప్రభుత్వము దీనిజోలి కేగకుండుట కిదియుఁ గారణము గావచ్చును."

పిమ్మట వివిధ వ్యాసములనుండి యిచ్చిన ఉదాహరణ ములలోఁ గొన్నిటి నిటఁ బొందుపఱుచుదును.

"ఆంటువర్పు కోట లీయుద్ధమునఁ బ్రసిద్ధికెక్కిన కారణ మేమనఁగా, యుద్ధతంత్రము వాని కర్మమునకు వానిని వదలి యూరకుండక పోవుటయే. లీజిదుర్గములో, నామూరుదుర్గ ములోఁ గొన్ని లోపములున్నవని చెప్పిన యుద్ధతంత్రము, దాని పుణ్యమాయని, ఈకోటలో నట్టివి కనుపెట్టలేదు. కావున నా దుర్గము శత్రువులకుఁ బట్టువడినను దాని సుదృఢత్వమునకు, రక్షకశక్తికి లోపము గలుగలేదు. దానియందు లోపములున్న వని పదింబదిగఁ జాటుటకు మాఱుగా, శత్రువుల బలాధిక్యము నంగీకరించుటవలన నీనాఁటికి సత్యదేవత నించుక కనికరించిన ట్లయినది. కర్మముచాలక శత్రువులకుఁ బట్టువడిన కోటలలోని రంధ్రముల నన్వేషించుటలో నిన్నాళ్లుఁ జూపిన ప్రజ్ఞలో నొకించుక యీనాఁటికి జర్మను శతఘ్నుల ప్రభావమును గ్రహించుట కుపయోగపడినది. ఇంతకు, నీ విజయములను సాధించినది జర్మనులు గాదనియు, 37 సెంటిమీటర్ల వెడల్పు మూతులనుండి 30 మణుగుల మందుగుండును రువ్వనేర్చిన వారిఫిరంగులదే ఈప్రజ్ఞ యనియుఁ దెల్లమైనది. ("ఈ గడ్డిపోచ యింతకు నేర్చునని మన మనుకొనమైతిమి" అనుచు నిచటనొక పారసీకభాషిత ముదాహృత మైనది.) బ్రిటిషువారి సాహా య్యముగూడ ఆంటువర్పునకుఁ జేరినదనియు, నాస లుడిగిన యూపౌరులు రెండురాత్రులపాటూసమై సంతోషముననోలలాడి రనియుఁగూడ వెల్లడియైనది. ఆ సాహాయ్యము చేరినంతటఁ బౌరులు స్వాగతముచెప్పి, దేవాలయములలో నీశ్వరభజన మొనర్చిరఁట. అమూల్యమగు నీ బాసటవలన నా నిర్భాగ్యపు

బెల్జియమున కొరగిన దేమియులేదు. పరాసు దేశపు మాగాణ ములలో నంతటి యుద్ధకౌశలమును, నద్భుతవీరమును నెఱపిన బ్రిటిషు పరాక్రమమునకు, దైవ ప్రాతికూల్యవశమున, నిచట నవకాశము లభింపదయ్యెను. అప్పటికిని బ్రిటిషువారు తమ ప్రజ్ఞాతిశయముచే, సర్వనాశముఁ దప్పించుకొని, బెల్జియన్ కాందిశీకులతో పాటు ఆంటువర్పు, ఆస్టెండులనుండి బ్రదికి బైటఁ బడఁగలిగిరి...

"ఇంతకు, జర్మనుల యుద్ధోపకరణ ప్రభావ మెవ రెఱుఁగనిది? యుద్ధమునకుఁ బూర్వమే యది లోకవార్త యైనది. ఆ వార్త యథార్థమేయని యిపుడు యుద్ధమునఁ దెల్లమైనది. బెల్జియమునంతటిని ఆక్రమించి జర్మనీ పారిసు నగరము వఱకు సాగిపోయినది. రష్యా యెల్లల నతిక్రమించి జర్మనీ యచట యుద్ధము సాగించుచున్నది. ఆఫ్రికాయందున్న జర్మను వలస భూము లిప్పటికిని శత్రువశములు కాలేదు. ప్రశస్తమగు జపాను నౌకాదళము రెండు నెలలు పెనఁగు లాడియు 'కాయిచౌ'ను జయింపలేదాయెను. ఇఁక జర్మనీ భూభాగమును జూతమన్న, నచట నొక యంగుళమేని శత్రు వులకు వశముకాలేదు. ఈ యుద్ధమున జర్మనీకి శత్రు దేశము లగు ఫ్రాన్సు బెల్జియములును, రష్యాలోఁ గొంత భాగమును దలక్రిందులుకాఁగా, జర్మనీ మాత్రము రణగుణ ధ్వనిలేక, నిమ్మకు నీరెత్తినట్లు శాంతముగనున్నది. దాని యార్థిక స్థితియు, వ్యాపారమును యుద్ధమునకుఁ బూర్వమున్నట్లే చెక్కు చెదరకుండ సాగిపోవుచున్నవి. వారి యంత్రశాలలు యుద్ధసామగ్రిని, ఫిరంగులను నిర్మించుచున్నవి. తడవకొక నూరు సముద్ర గర్భనౌక (**Submarines**) లచట సిద్ధ

మగుచున్నవి. యుద్ధపర్యవసానము నీ తారతమ్యమే తెలియఁ జెప్పుచున్నది. ఆస్ట్రెండు, ఆంటువర్పులను బట్టుకొనుటచే యుద్ధమున జర్మనీస్థితి మెఱుఁగగుటయు, దాని శత్రువుల సముద్ర మార్గములు కట్టువడిపోయినవి. జర్మనీలక్ష్య మిప్పటికే సగము సిద్ధించినది. బెల్జియము దిక్కున సముద్రమునుండి జర్మనీకి భయములేదు గావున నది యిఁక నూతనాక్రమణము నారంభించును. పెట్టు నదిలో జర్మనీ యీవలకే మందు గనులు నాటినది కావున, నిఁక ముఖ్యముగా నింగ్లీషుఛానెలు దెసకు సాగిపోఁ జూచును."

ఆ యీ వ్యాసములను గూర్చి 'పయొనీరు' పత్రిక చేసిన వ్యాఖ్యానమును రెండు వాక్యములలో సంగ్రహింపవచ్చును:

"జర్మనీ దుర్జేయమనియు, బ్రిటిషు సామ్రాజ్యము దానిని బ్రతిఘటింపఁ జాలదనియు స్వమతస్థులకు విశ్వాసము గూర్చుటయే యీ వ్యాసకర్త యుద్దేశము. బ్రిటిషు సైనికులను గూర్చియు, నావికులను గూర్చియు నర్మగర్భములగు నిట్టి ద్వేషోక్తుల నొక బ్రిటిషు పౌరుఁడు ప్రకటించుచుండఁగాఁ, జూచి యూరకుండిన యీ ప్రభుత్వము జర్మనీలో దుర్లభమగు సహనము తనకుఁ గదా యున్నదనుకొని సంతుష్టిఁ జెందవచ్చును."

వాస్తవ మెటులున్నను మహాలానా వ్రాఁతలు పక్షిష్టములనుట స్పష్టము. ఆయన వ్యాసములందున్న విషయ బోధ మాంగ్ల పత్రికలందుఁ గూడఁ బ్రాయికముగా లభింపదు. ఏది యెట్లయినను, మిత్రమండలి కప్రియమగు సత్యమును వక్కాణింపఁగల ధీరుఁడాయన. 'పయొనీరు' పత్రిక అంతగా నాడిపోసికొనిన యీ వ్యాసము ప్రకటితమైన 18 మాసముల

వఱకుఁ బ్రభుత్వము "జర్మనీలో దుర్లభమగు సహానము" దాల్చి యూరకుండెను. పిమ్మట నా పత్రిక ధరావతు గోల్పోవుటయుఁ, బంజాబు, యు. పి., మద్రాసు రాష్ట్రములలో నా పత్రికాసంపాదకుఁ డడుగిడరాదని ప్రభుత్వమాంక్షవిధించుటయు జరగెను. 7-4-1915 న వంగప్రభుత్వమాయన నా రాష్ట్రమునుండి వెడల నడఁచెను. ఆరోగ్యము కొఱకై యాయన రాంచీ కేగఁగా భారతప్రభుత్వ మచటి నుండి యాయనను 1920 ప్రారంభమువఱకు నిర్బంధించి యుంచెను.

రాంచీలో నిర్బంధావాస మున్నపుడేనియు నాయన ప్రతి శుక్రవారము మసీదు కేగి, ధర్మబోధ గావించుచునే యుండెను. గ్రంథపఠనమున కనుజ్ఞ లభించుటచే నచటనే యాయన 'తజ్‌కిరా' యనుపేర నిజస్మృతులను గ్రంథముగా రచించెను. ఇంద్రజాలమువంటి యా గ్రంథశైలి - గ్రంథము మొదలిడినచో నంతమువఱకు వదలనీయదు. అట్లయ్యు నా గ్రంథమున నాయన జీవితవిశేషము లంతగా లేవఁట. ఖురానుపై నాయన రచించిన వ్యాఖ్యకూడ నచటనే కొంత వఱకు సాగెనఁట. ఆ కథయంతయు ముందున్నది.

———

# 7. వెల్లువపోటు

1919 నుండి 1921 వఱకు నడచిన భారతదేశ చరిత్ర నెందఱో చెప్పిరి. జవాహర్లాలు పండితుఁడును దన 'ఆత్మకథ' యందు దానిని జెప్పెను. పండితుని ప్రత్యక్షశైలియు, నుదాత్తభంగియు నితరులకు రావు. ఆ రసవద్గాథను నేను మరల నిచటఁ దడవను. మాతృభూమికి స్వాతంత్ర్యము నార్జించుటకై భారతీయులు విక్రమించిన యద్భుతకాల మది. ఆ పోరాటమున నుడుతభక్తిగాఁ బాల్గొన్నవారెల్లరు దానిని స్మరించి యుప్పొంగిపోవుదురు. ఆ వీరగాథలో ఎవరికథ వారి కుండనే యున్నది. ఆ కథల నేకరువుపెట్టినచో నదియొక మహాపురాణ మగును. స్త్రీ బాల వృద్ధముగ భారతప్రజ యంతయు స్వశక్త్యనురూపముగఁ బాల్గొన్న యా పురాణ మునఁ జర్వితచర్వణత గానుపించదు.

పండు నా శుభవేళ బ్రదికియుండుటె, నాఁటి
పడుచువారలదె సూ స్వర్గభోగమ్మనిన—

అందు మాలానాకు సంబంధించిన కథను మాత్ర మిచటఁ దడవుదును. 1920 లో నిర్బంధావాసమును వీడి వచ్చినంతనే ఎన్నఁడు ననుకోనని వింత యాయన కండ్లఁ బడెను. అప్పటికి సంవత్సరకాలమునుండి పీడించుచున్న రుజ నుండి గాంధిజీ బయటఁబడి, గర్వభూయిష్ఠమగు మహా సామ్రాజ్యమును ధిక్కరించి, కాలుద్రవ్వుచుండెను. ఇన్నాళ్లు క్రుంగి, కృశించి, యూపిరిసలుపక సగముచచ్చి, చప్పగాఁ జచ్చి పట్టనములలోఁ, బల్లెలలోఁ బడియున్న జనత కా మహ నీయుని పిలుపు వినినంతనే ప్రాణము లొక్కుమ్మడిగా లేచి వచ్చెను. అది యహింసా సమరముగావున నిరుపేదలకు,

నిరంకుశరాస్యులకు, రుజాగ్రస్తులకుం గూడ నందుం బాల్గొన వీలుగల్గినది. పాంచాలమునం బెల్లుబికిన యుత్సాహతరంగము లా యహింసాసమర మహారథికుఁడు పెట్టిన హద్దు నతిక్ర మించెను. ఆ మహాప్రవాహమును నిలువరించిన బ్రిటిషు సేనాని సామ్రాజ్యరక్షణ తత్పరుఁడై కఱకు గసాయితనమున కొడిగట్టెను. సజ్జనులగు నాంగ్లేయులు గూడ నా యూచ కోఁత నేవగించుకొని సిగ్గున గ్రుగ్గిపోయిరి. ప్రజలను భయ భ్రాంతులను జేయు పూనికమై యా సేనాని యిట్లు నిరపరాధ జన సహస్రమును సంహరించెనే కాని యతని మనోరథము మాత్రము ఫలింపదయ్యెను. మౌలానా మహమ్మదాలీ చెప్పినట్లు "ముప్పదేండ్లనాఁడు సర్ సయ్యదహమ్మదుఖాను, తాత్కాలిక ప్రయోజనము నర్థించి, నిర్మించిన యడ్డు గోడలను గూల్చిన పుణ్యము డయ్యరు సేనానికి దక్కినది. అమృతసర నగరమందు 1919 లో జరిగిన కాంగ్రెసు సభా రంగమున కీ సేనాపతియే యమాయిక దూతమై, భారత ముస్లిములను జేరఁబిలిచిన ట్లయ్యెను. ఈతఁడు వర్షింపఁజేసిన తుపాకి గుండ్లకుఁ, బాపము, హిందూ ముస్లిము భేదము లేదు. రాజభక్తిలో ముస్లిములకంటె నేడాకు లెక్కువగాఁ జదివిన మన సిక్కు సోదరులుగూడఁ దమ యమృతసర పవిత్రక్షేత్ర మును నిజరక్తధారచేఁ దడిపి, హిందూ ముస్లిము వీరులతో పాటు తాము బలియైపోయి రన్నచో నిది యీశ్వర సంకల్పముగాక మఱియేమి?"

ఇట్లు పండిన పంజాబుపాపమునకు ఖిలాఫత్ పాపము గూడఁ దోడైనది. ముస్లిముల దివ్యక్షేత్రములకు భంగము రానీయమనియు, వాని నన్యులచేతికిఁ జిక్కనీయమనియు

బ్రిటిషు ప్రధాని యాపత్సమయమున భారత ముస్లిములకిచ్చిన మాటను దప్పిపోయెను. దుస్సహమగు నీ యపరాధముచే ముస్లిములోకమెల్ల నొక్కుమ్మడిఁ గ్రుద్ధమై లేచి, సర్వమునకుఁ దెగించి నిలిచెను. జర్మనీ నోడించి, బ్రిటనును రక్షించుటకు ధన మాన ప్రాణముల నర్పించిన భారత ప్రజలకు రౌలటు శాసనము మూర్తీభవించిన బ్రిటిషు కృతఘ్నతవలె నొక వంక నెదురయ్యెను. విదేశ రణరంగములందు స్వమతస్థుల నెదిరి బ్రిటిషువారి సరస నిలిచి పోరాడని ముస్లిముల కీ ఖిలాఫత్ ద్రోహము రెండవ వంక నెదురయ్యెను. ముస్లిము లంతట వైస్రాయి చెంతకు రాయబార మేగిరి. ఇంగ్లండు కొక రాయబారము నంపిరి. ఈ ప్రయత్నములెల్ల విఫలమైనంతట వా రెల్లరు సంప్రతించుకొని, భారత ప్రజానేతయగు గాంధిజీ చూపిన మార్గమును దాము ననుసరించుట కొడఁబడిరి. దేశము సుసజ్జితముగాకుండఁ గొన్ని నెలల క్రిందఁ జేసిన శాసనోల్లంఘనము పురిటిలోనే భగ్నమయ్యెను. దానికంటె సాహాయ్య నిరాకరణము పటిష్ఠము, ఫలప్రదము, సహజము నగు ప్రతిక్రియ. సాహాయ్యనిరాకరణమునకుఁ బ్రాణమువంటి దహింస. ఈ రెండును ఇస్లాము ధర్మమున కనుగుణము లేనా యని శంక. ఈ స్థితిలో మౌలానా అబుల్ కలాం ఆజాదు రంగమున కవతరించెను. అపారమైన పాండిత్యము, నసదృశమైన వాచాలతయు, నెదిరి మనస్సుల నారాధించు నేర్పును ఆయన సొమ్ములు. తమ గ్రంథజాలముఁ దక్కసితరము నెఱుఁగని సాటి పండితులవలెఁగాక నవీన విచారధారయు,లోకజ్ఞతయు నున్న మౌలానా సరిగా సమయమునకు నిర్బంధము వీడి వచ్చెను. ముస్లిము నాయకులలో వయసునఁ జిన్నయయ్యు

మౌలానా గాంధిజీకిఁ బెట్టని కోటయై నిలిచెను. అహింసా పూర్వకమగు సాహాయ్య నిరాకరణమను నీ క్రొత్త యాయుధము పట్టితర ముస్లిము నాయకులకుఁ జిక్కలేదు. సాహాయ్య నిరాకరణమును జేపట్టుటకుమున్ను ముస్లిము నాయకులు దమలోఁ దాము చేసిన మంతనములను, దుదకు దాని నంగీకరించిన విధమును మౌలానాయే యిట్లభి వర్ణించిచెప్పెను:

"18-1-20 న నేను తొలిసారి గాంధిజీని ఢిల్లీలోఁ గలిసి కొంటిని. టర్కీ విషయమున ముస్లిములకుఁ గల్గిన మనోవేద నను వైస్రాయితో విన్నవించుటకై రాయబారము నడుపు బూనికమై హిందూ ముస్లిము నాయకులచట మంతనముండిరి. లోకమాన్య తిలకుగూడ ఢిల్లీలోనే యుండిరి. వైస్రాయికంపఁ దగు విన్నపము క్రిందఁ దక్కిన రాయబారులతోపాటు నేనుఁ జేవ్రాలు పెట్టితిని. కాని ప్రభుత్వ భవనమున కేగ నాకు మనస్కరింపదయ్యెను. మౌలానా మహమ్మదాలీ ప్రభృతులు నన్నుఁ గూడ రాయబారులతో నంపవలెనని పట్టుబట్టిరి. ఇది యంతయు వృథా ప్రయత్నమని నా మనస్సునకు వచ్చు చుండెను.

"వైస్రాయి చెంతకు రాయబారు లరుగుటయు, అను కొన్నట్లే వట్టి చేతులతోఁ దిరిగి వచ్చుటయు నైనది. లండ నుకు రాయబార మేగుదురేని అందులకుఁ దగిన సౌకర్యములు గూర్తు నని మాత్రము వైస్రాయి చెప్పెను. మౌలానా మహమ్మదాలీ యా రాయబారమును నడుపవలెనను కొంటిమి. ఆయనయు సమ్మతించెను. అంతట నొకయాలోచన పొడ మెను. ఇట్లు రాయబార మంపుటతో సరిపెట్టుకొనుటయేనా,

ముస్లిములు చేయఁదగిన దింకేమైనఁ గలదా? నే నీ విన్నప ములు, యాచనలుఁ, బరివేదనములుఁ బనిచేయవంటిని. ప్రభు త్వమున కొత్తిడి గలిగించుసాధనము వెదకవలె నంటిని. ఈ యాలోచన చాలమందికి రుచింపదయ్యెను. చూపిన యుపా యములోఁ దప్పులు వెదకు వారే కాని క్రొత్త యాలోచన చెప్పువారు లేరైరి.

"హకీం అజ్మాలు ఖాను మందిరమున నాలుగంటల సేపు తలపట్లు పట్టుకొన్నను పర్యవసానము శూన్యమయ్యెను. గాంధిజీ యంతట నిద్దఱు ముగ్గురతో నొక యుపసంఘము నేర్పఱచినచో వారితోఁ దాను సంప్రతించి, యొక పథకముఁ గుదుర్తుననియుఁ, బిమ్మట నందఱుఁ గూడి కార్యనిశ్చయముఁ జేయఁదగుననియుఁ జెప్పెను. అంతట హకీము సాహెబుతో, నేనుగాంధిజీ వెంట ఆచార్య రుద్రాగృహమున కేగి, మూడు గంటలసేపు మంతన మొంటిమి. ఆ మంతనమందే సాహాయ్య నిరాకరణ మవతరించినది. గాంధిజీ సవిస్తరముగఁ జెప్పిన పథకము నామోదించితిని. అంతకంటె ఫలప్రదము, యోగ్యము నగు మార్గము లేదని నాకు స్పష్టమయ్యెను.

"మఱునాఁడు గాంధిజీ రాయబారుల నందఱఁ జేర్చి, తన పథకమును వివరించెను. సభ్యుల కింకను సంశయములు వీడలేదు. అబ్దుల్ బారీ, మౌలానా మహమ్మ దాలీ,షౌకతాలీ లింకను నాలోచించి చెప్పుదుమనిరి. హకీం సాహెబు మాత్రము నాతోఁ బూర్తిగా నేకీభవించెను. ఆ తరుణముననే మీరటు నగరమున ఖిలాఫత్ సభ జరుగుచుండెను గావున గాంధిజీతో నే నా సభ కేగితిని. సాహాయ్య నిరాకరణ మంత్రమును గాంధిజీ తొలుత నా సభాముఖముననే ప్రజల

కుపదేశించెను. పిమ్మట ఫిబ్రవరి మాసమునఁ గలకత్తాలో రెండవ ఖిలాఫత్ సభ సమకూడెను. ఆ సభకు నేనే అధ్యక్షుఁడను. సాహాయ్య నిరాకరణమే ముస్లిములకు శరణ్యమని నే నా సభాముఖమునఁ జెప్పితిని.''

పిమ్మటఁ గలకత్తాలో జరగిన విశేష కాంగ్రెసు సభకు, నాగపూరున సమావిష్టమైన సామాన్య కాంగ్రెసు సభకు నీ రీతిగా క్షేత్రము ముందుగనే పదనై యుండెను. కావున శాసనసభలకుఁ, గళాశాలలకు, న్యాయస్థానములకు వెలిపెట్టుచు సాహాయ్య నిరాకరణ మొనర్పవలెనను కార్యనిశ్చయ మా సభలలో సర్వజనామోదమును సులభముగాఁ బడయఁగల్గెను.

ఇంకను జెప్పుట కే మున్నది? దేశమున నాల్గు చెఱఁగుల సభలు జరిగినవి. లక్షలాదిగా స్త్రీ పురుషు లాసభలందు గుములు గూడిరి. గాంధిజీ మౌలానా లాసభలలోఁ బ్రబోధ మొనర్చిరి. ఆలీ సోదరు లొక రాష్ట్రమందు, దేశబంధుదాసు, పండిత మోతీలాలు జవాహర్లాలు నెహ్రూలు మఱియొక రాష్ట్రమందు సంచరించి, జనసమూహముల నుద్బోధించిరి. అద్భుతమైన ప్రజావబోధము గల్గినది. అనుకొన్న పను లను కొన్నట్లు గాంధిజీ నెఱవేర్చుఁదొడఁగెను. కోటి రూప్యముల ద్రవ్య మనుకొన్న నాఁటికిఁ బోఁగయ్యెను. విద్యార్థులు కళాశాలలను, లాయర్లు న్యాయస్థానములను విడిచి వచ్చిరి. కొందఱు తిరుగ వానిని ద్రొక్కి చూడలేదు. పండితు లిరువురు, దేశబంధు దాసు, సర్దారు పటేలు, బాబు రాజేంద్ర ప్రసాదు, శ్రీ రాజగోపాలాచారి వంటి పెద్ద లాయర్లు నెల నెలకు వేల కొలఁదిగా సంపాదించిపెట్టు తమవృత్తిని విడనాడి, దేశారాధనమునకు నడుముగట్టిరి. నారీ మణులుఁ దండతండ

ములుగా సభల కేతెంచి, నగలు నాణెములు నిలువుదోఁ పోసఁగి, గాంధిజీ భిక్షాపాత్రను నింపిరి.

మౌలానా వాక్ప్రవాహమునకై ప్రజలు చెవులుగోసి కొనుచుండిరి. సామాన్య సభలందే కాదు. ముస్లిము పండితుల సభలలోఁ గూడ నాయన ప్రసంగములు ప్రియతరము లయ్యెను. దేశము నలుదెసలనుండి సహస్రాధికులగు మౌలానాలు లాహోరులో విశేషసభ జరిపి, అబుల్ కలాం ఆజాదును భారత ముస్లిములకుఁ బీఠాధిపతిగా వరించిరి. ధర్మాచార్యు లందఱకు స్పృహణీయమైన యీ యపూర్వగౌరవము మౌలానా దనకు వలదని విన్నవించెను. మౌలానాను సంస్కార వాది యని యెఱిఁగియుండియు, సనాతన ధర్మాభిమానులగు లక్నో దేవబంధు నగరవాసులగు మౌలానాలు గూడ ఆజాదు నీ ఇమామపదము నంగీకరింపుమని బలవంతపెట్టిరి. ఇంతలో మౌలానాకుఁ జెఱసాల ప్రాప్తించెను. ఆ కథయంతయుఁ దరువాతి ప్రకరణమున వివరింతును. 1923 లోఁ జెఱసాల వీడి వచ్చిన పిమ్మట మౌలానా నీపదము నంగీకరింపు మని మరల నిరోధించిరి. అపుడు జమైతుల్ ఉలేమా కార్యకర్తలతో మౌలానా తన మనసు విప్పి చెప్పెను. ఎంతటి యధికునైన నిట్టు లాచార్యపీఠమున నభిషేకించుట యపాయకరమనియు, ముస్లిముల కది క్షేమకరముగాదనియుఁ, దన్ను మోమోట పెట్ట వలదనియుఁ జెప్పి మౌలానా మహత్తరమైన త్యాగ మొనర్చి, ముస్లిము ధర్మాచార్యుల కెల్లరకుఁ దొల్లిటికంటె సమ్మాన్యుఁ డయ్యెను.

---

# 8. విశ్వాస ప్రకటన

1921 చివరిభాగములోఁ బ్రభుత్వము పని అల్లడతల్లడగా నుండెను. ఆ సంవత్సరము పొడవునను శాసనధిక్కారము వ్వోత్తుగా సాగుచుండెను. తుద కాలీసోదరులు రాజద్రోహమును, సైనికులకు అపరక్తిని బోధించుటతో నది మిన్నుముట్టుటయుఁ, బ్రభుత్వ మాసోదరులను బందెఁబెట్టెను. ఆ యిరువురలో మహమ్మదాలీ గాంధిజీతో దేశసంచారము సల్పుచుండెను. ఆ నాఁడొక సభలో నుపన్యసింపనున్నతఱిఁ బ్రభుత్వమాయనను బంధించెను. ఈ బంధనకుఁ గారణమేమో గాంధిజీకిఁ దెలియదు. వెంటనే యాయన దేశ మంతట నిట్లు చాటెను: "ప్రభుత్వము మహమ్మదాలీని గాదు, ఖిలాఫతునే చెఱపట్టినది. ఖిలాఫత్ అనఁగా ఆలీ సోదరులే కాని వేఱు గాదు...మన మాసోదరుల ధీరతను, సత్యరతిని, నిర్భీకతను, విశ్వాసమును, అవిరతకర్మపరతను అనుసరింతముగాక!" ఆలీసోదరులను, మఱియైదుగురను బంధించిన కారణములను బొంబాయి గవర్నరు మఱి రెణ్ణాళ్ళకు వివరించెను. కరాచీ సభలో సిపాయిలకు రాజాపరక్తిని బోధించుచుఁ జేసిన కార్య నిశ్చయమునకు వారే కారణముగాన బంధించితి మనియుఁ, బ్రభుత్వ మింక నిట్టి యాగడము సాగనీయదనియు గవర్నరు కాలు ద్రవ్వుటతో, దానికిఁ బ్రతిగాఁ బ్రజల పక్షమున గాంధీజీయు నిట్లు ప్రకటించెను: "సిపాయిలకు రాజాపరక్తిని గత సెప్టెంబరులోనే భారత కాంగ్రెసు బోధించినది. గవర్నరెఱుఁగఁడేమో కాని ఖిలాఫతు సంఘు మంతకుమున్నే యీ పని చేయ నారంభించినది. ఆ సంఘముకంటె మున్నే నే నీ బోధ చేసితిని. ఒక సిపాయిలే కాదు, ప్రభుత్వోద్యోగులెల్లరు నీ

ప్రభుత్వము చేసెడి పాపములలోఁ బాలు పంచుకొను చున్నారని చాటి చెప్పునధికార మీ దేశమున కున్నది. ఈ మాట తొలుతగాఁ జెప్పిన కీర్తియో, అపకీర్తియో నాకే దక్కవలసియున్నది. కాంగ్రెసు చేసిన ప్రకటననే ముస్లిముల పేరఁ బునరుద్ఘాటించుట తప్ప కరాచీ సభ క్రొత్తగాఁ జేసిన పాప మేమియు లేదు....స్వధర్మాభిమానులగు ముస్లిములకే కాదు, మానవ మాత్రులెల్లరకుఁగూడ నాలీసోదరులు చూపి నదే మార్గము...ఆలీసోదరులు సిపాయిల మనసు విఱిచి రను టయే శుమార్గ్వాము కాదు. మఱి శ్రీ గవర్నరుగారు రాజ ద్రోహము మాట యెత్తుట మొదలే సయిరింపరానిది. రాజ ద్రోహమే కాంగ్రెసుకు విహితధర్మమని శ్రీ గవర్నరుగారు తెలిసికొనుట మేలు. ఈ దేశమున సాగుచున్న ప్రభుత్వము పట్ల అపరక్తిని బోధించుటకే సాహాయ్యనిరాకరణవాదు లెల్లరు శపథము దాల్చిరి.'' ప్రభుత్వ మేమిచేసినను సరియే యని సిద్ధపడి, దేశమునందలి పెద్దలెల్లరు నీ ప్రకటన క్రిందఁ జేవ్రాళ్ళుంచిరి : ''ఇచటఁ జేవ్రాళ్లుంచిన మేమెల్ల రము నెవరియంతటవారు చెప్పునది ఏమి యనఁగా, ప్రభు త్వోద్యోగములందును, సిపాయి దండులోను ఈ దేశస్థులు చేరుటయు, చేరి యింకను ప్రభుత్వమును సేవించుచుంటయు యుక్తమగునో, కాదో బహిరంగముగాఁ దెలియఁ జెప్పు నధికారము పౌరులందఱకుఁ గలదు. ఈ ప్రభుత్వ మిండియాను దారిద్ర్యమునకు, నవిసీతికి, దాస్యమునకుఁ బాల్పఱిచినది. తన సిపాయిలచే, పోలీసులచే నీ ప్రభుత్వము ప్రజల యభిలాష నణఁగఁ ద్రొక్కించినది. రౌలటు శాసనము నాఁటి హింసాకాండయే దీనికిఁ దార్కాణ. ఇంతియేకాక,

మా దేశమున కెన్నఁడు నపచారముచేసి యెఱుఁగని అరే బియా, ఈజిప్టు, టర్కీ ప్రజల స్వాతంత్ర్యమును మా సిపాయి లచే మట్టు పెట్టించిన దీ ప్రభుత్వము. ఇట్టి ప్రభుత్వమును సేవించుటయు, అందును ఈప్రభుత్వ సైన్యమునఁ బనిచేయుటయు భారతీయుఁడైన వానికి గౌరవప్రదము కాదు. భారతజాతి కిది పరువుతక్కువను ఘటించును. కావున నుద్యోగులు, సిపాయిలు నీ ప్రభుత్వమును సేవించుట మాని, మఱి యొక జీవనోపాధిని జూచుకొనుట ధర్మము.'' ఇందు మొదటి చేవ్రాలు గాంధిజీది. రెండవది మౌలానాది. ఈ ప్రకటనమును బిమ్మట నసంఖ్యాకులగు సభలలో శత సహస్రకంఠము లుద్ఘాటించెను. ఇంత చేసినను, అది యేమి వింతయో కాని, ప్రభుత్వము మిన్నకుండెను. దేశము నలు గడల నిట్లు చిచ్చుముట్టుకొనునని యూహింపమిచేఁ బాపము, దానికి ఱిచ్చపా టొదవియుండును.

ఆ వెనువెంటనే వేల్సు రా కుమారుఁ డీ దేశమున కేతెంచుటయుఁ, గాంగ్రెసు తదాగమనమునకుఁ బెడమొగము పెట్టుటయుఁ దటస్థించెను. కాంగ్రెసునకు రాకుమారు నవమా నించు తలంపించుకయు లేదు. బ్రిటిషు వారిది 'చల్లని' పరిపా లనమని చాటుకొనుటకు యువరాజు నూరేగించుచున్నారు గావునఁ గాంగ్రెసు ఆ యుత్సవములకు వెలిపెట్టెను. దరిద్రతకు నిలయమైన యీ దేశ మొక వంక దొరతనముపట్ల విరక్తిచే నుడికిపోవుచుండఁగా, యువరా జాగమనోత్సవములకు, విహార ములకుఁ గోట్లకొలఁది సొమ్ము వమ్ము సేయుటకంటెఁ బాపము, ద్రోహము నుండఁబోదు. కావున కాంగ్రెసు యువరాజురాకపై నాంక్షవిధించి, యా యాంక్షను నిర్వహించుటకై రాష్ట్ర

రాష్ట్రమున సేవాసక్తులను (volunteers) సంఘటన మొనర్పఁజొచ్చెను. మఱి, ప్రభుత్వము చేతులుముడిచికొని యూరకుండునా? ఆ వాలంటీరు దళములను, ఆదళములను సంఘటిత మొనర్చుటను న్యాయనిషిద్ధములుగాఁ బ్రకటించెను. అంతట నా నిషేధాజ్ఞనుల్లంఘించి, బహిరంగముగా వలంటీర్లను జేర్చి, యట్లు చేరినవారి పేళ్లను బత్రికలలోఁ గాంగ్రెసు ప్రకటింపసాగెను. యు. పి. లో మోతీలాలు జవాహర్లాలు పండితులు, వంగభూమిలో దేశబంధు సి. ఆర్. దాసు మౌలానా ఆజాదులు వలంటీర్లలో నగ్రగాములైరి. దేశబంధు దాసు సోదర దేశీయుల నుద్దేశించి యిట్లు శంఖారావము గావించెను: "నా ముంజేతుల సంకెళ్లను, దేహమున నినుపగొలుసులను మోయుచున్నాను. ఎన్నాళ్లీ బంధన వ్యథ? భారత భూమియే బంధనాగారమైపోయినది. కాంగ్రెసు తలపెట్టిన పని సాగిపోవలసినదే. నన్ను బంధించిననేమి, బంధింపకున్న నేమి? నేను చచ్చిననేమి, బ్రదికియుండిననేమి? అది యొక లెక్కలోనిది కాదు." దేశమంతయు నొక్కుమ్మడి వీరావేశమున లేచి నిల్చినది. బొంబాయి నగరము వికృతచేష్టలచేఁ దలవంపులు దెచ్చికొన్నను దక్కిన నగరములందుఁ గాంగ్రెసు విధించిన యాంక్ష శాంతముగాఁ గొనసాగెను. అలహాబాదు కలకత్తాలు శ్మశానములవలెఁ బాడుపడి యువరాజునకు దర్శన మిచ్చెను. యువరా జెచటికేగినను గతిపయరాజోద్యోగులు మాత్రము స్వాగతము పల్కిరి.

ప్రభుత్వ మంతట నున్మత్తతాండవమున కెత్తికొని,తరతమ భేదములను బాటింపక దేశీయులలో మహోన్నతులను గూడఁ జెఱలోఁ బెట్టెను. యు. పి. లో నెహ్రూలు, పాంచా

లమున లాలాలజపత్ రాయలు, కలకత్తాలో దేశబంధు చిత్తరంజనదాసు మౌలానాలు—వారు వీరన నేల? వేలకు వేలు బంధనాగారములలోనికి సాభిమానముగ నడచిపోయిరి. డిసెంబరు జనవరి నెలల మధ్య నిట్లు ముప్పది వేలమంది చెఱసాలలకు నడచి, చిన్నవియుఁ బెద్దవియు శిక్షలనుభవించిరి. వీరిలో నొక్కరును నిర్దోషులమని చెప్పికొనరైరి. న్యాయస్థానములలో వారు చేసిన భాషణములు దశ దిశల మాఱుమ్రోఁగెను. బ్రిటిషు న్యాయస్థానముల ధర్మబుద్ధియు, బ్రిటిషు ధర్మబుద్ధియు నెట్టివో – ఆపస యంతయు బట్టబయలయ్యెను. ఆ యేఁటి కాంగ్రెసులో దేశబంధుదాసు,ముస్లిములీగు సభలో మౌలానా ఆజాదు అధ్యక్షపీఠము లలంకరింపవలసిన వారు. ఆ ముచ్చట తీరకుండఁగనే. చెఱసాల ప్రాప్తించినందుల కాయుభయులుఁ బొందిన యానందమునకు మేర లేదు. దేశబాంధవుని యిల్లాలు తన భర్త చెఱసాలకేగినందులకు మురిసిపోవుచు గాంధిజీపేర లేఖ యంపెను. చెఱసాలకేగుటకు మున్నే మౌలానా గాంధిజీ కంపిన లేఖలో నిట్లు వచించెను : "దిన దినము మీ సహచరులకుఁ గారావాసము ప్రాప్తించుచున్నది. కావున మీకుఁ బురుషబలము తగ్గిపోవుచున్నను దైవబలము మాత్ర మధికమగుచున్నది. మొన్నటి బొంబాయి యల్లరులు మీకు మనస్తాపమును,వ్యాకులతను గల్పించినవి. మీ బాధను గాంచి నేనును గలఁతఁ జెందితిని. కలకత్తా నగరమిపుడు మేల్కొన్నది. అది విజయలక్ష్మిని సాధించి మీకు దుఃఖోపశమనముఁ గూర్పఁగలదు." మౌలానా దేశబంధుల న్యాయస్థానవిచారణము, దాన దీన జాగునఁబడి, మూఁడు నెలలు గడచెను. మౌలానాకు సంవత్సర కారావాస దండనము

ప్రాప్తించెను. మహాలానా యది చాల లఘుదండన మని వగచెను. ఆ సత్యాగ్రహమున దండితు లందఱవలె నాయనయు న్యాయస్థానమునఁ గొన్ని మాటలు చెప్పెను. తక్కిన యందఱి మాట లొక యెత్తు, మహాలానా చెప్పిన దొక యెత్తు. ఆయనకు సాజమగు రమణీయ ఉర్దూభాష నాశ్రయించి చెప్పిన యీ మాటల సొగసితరభాషల లోనికి రాదు. ముప్పది పుటలు నిండిన యీ భాషణమును "భారతీయాభిజాత్యముపట్ల, ఖిలాఫతుపట్ల మహాలానా తనకుఁ గల యభిమానము నిందద్భుతముగాఁ బ్రవచించెను. యావజ్జీవ దాస్యబంధనమున కర్హమగు ప్రసంగరాజ మిది. రాజనీతి శాస్త్రము నేర్చువారి కిది యాచార్యక" మని గాంధిజీ ప్రస్తుతించెను. దానిని జదివినచో, "ఈ మహాలానా యాంగ్ల విద్యాశాలలలో నెన్నఁడుఁ జదివినవాఁడు కాఁడే! ఇంతటి చరిత్ర జ్ఞానసంపదయు, నింతటి సునిశితవాద కౌశలము నెట్లలవడెనా" యనిపించును. మాతృభూమిపై ఆయనకున్న యగ్గలపుభక్తి కక్కజమందుదుము. ఇరువది యేండ్లు గడచినను నేఁటికి నాయభిభాషణము సరిక్రొత్త తావులీను చుండును. దాని నుండి కొన్ని భాగము లిచట నుద్ధరించుట యప్రస్తుతము గాఁజాలదు.

సత్యరక్షణకై బాముల కగ్గమైన జీసను సోక్రటీసుల కోవలోఁ దాను నొక భక్తుఁడనేయని మహాలానా సగర్వముగఁ జెప్పికొన్న యీ వాక్యము లాలింపుఁడు:

"మానవేతిహాసమును బరికించినచో న్యాయస్థానము లందు జరిగిన యన్యాయ్యములు గుప్పతిప్పలై కన్పించును. వాని కాశ్వాసాంతము చెప్పెడి తరుణ మింకను రాలేదు. జీసను వంటి పరమపవిత్రుని విజాతీయ న్యాయస్థానములు

పరమపాపిగా నిర్ధరించి ఘోరదండనము పాల్పఱిచెను. సత్యవాదులలో నగ్రగణ్యుఁడగుటయే సోక్రటీసుచేసిన దోషము. ఆ మహనీయుని నోటికిన్యాయాధికృతులు విషపాత్ర నందించిరి. ఫ్లారెన్సు దేశీయుఁడగు గెలీలియోతపస్వి తాను దర్శించిన సత్యమును విడనాడక, పాలకుల దురాగ్రహమునకు గుఱియై, వీరమరణము పాలయ్యెను. ఇట్టి ధన్యజీవనులు నిలిచిన యప రాధిస్థానమున నిలిచెడి భాగ్యము నేఁడు నాకు లభించుటచే ధన్యుఁడను. పరమేశ్వరుఁడు నన్ననుగ్రహించెను." పిమ్మట రాజాపరక్తిని బోధించుటను గూర్చి సమచిత్తుఁడై సలిపిన ధర్మవిచారమును బరికింపుఁడు:

"అలసత్వమునకు, ఆంతర దౌర్బల్యమునకుఁ బాల్పడి ప్రజాశక్తి క్షీణించినపుడు కొందఱు బలవంతు లాప్రజపై నాధిపత్యము దాల్చుట కద్దు. భారతదేశమున దొరతనము సాగించుచున్న దట్టి బలవంతులే. ప్రజలలో స్వాభిమానము, సంస్కార వాంఛయు, పురోగమ నాభిలాషయుఁ బొడమి నచో నీ పాలకుల కది కంటకప్రాయమై తోఁచును. ప్రజ లసంతుష్టిచేఁ గదలఁబాఱినచో నీప్రభువుల యాట కట్టునుగాన ఆ కదలికను బ్రభుత్వాధికారముగా నెంచి, నేరము మోపుదురు. ఔను, తమ ప్రాభవము తఱిగిపోవు చుండ నెవ రూరకయుందురు ? అట్లు తఱిగిపోవుట ధర్మ సంస్థాపనమునకు దారితీయునను నాలోచన వారి కేల ? ఇట్లు ప్రజలును, పాలకులును నిజ ధర్మరక్షణము కొఱకుఁ, దమ బ్రదుకు కొఱకుఁ బోరాడుట తప్పదు. ప్రజలు మేలుకొని సహజమగు స్వత్వములను గోరుచుండఁ, బ్రభువులు దమచేత నున్న యధికారములను బిగ్గబట్టుకొందురు. ఇందుఁ బ్రభువుల

తప్పేమి? యనవచ్చును. నిజమే, ఎవరిబ్రతుకు వారికిఁ దీపికదా! ఆత్మనాశనమును జేతులారఁ దెచ్చి పెట్టుకొనుట ప్రాణి ధర్మము కాదు. ప్రభుత్వము బ్రదికినచో ధర్మమునకు హాని కలుగు నందురేని, యది వారి ప్రధాన విషయము. మానవ స్వభావ మును మనము తుడిచి పెట్టఁజాలము. మంచివలెనే చెట్టయు నీలోకమున బ్రదుకఁగోరుట సాజము. ఈ రెంటిలో బలవత్తర మైనదే బ్రదుకును. భారతదేశమునఁ బ్రస్తుత మీ మాత్స్య న్యాయమే చెల్లుచున్నది. కావున నేఁడు ప్రభుత్వము చేతు లందున్న యపరిమితాధికారమును, న్యాయ్యము పేర,ధర్మము పేర ఊడఁ బెఱుకుకొన నెంచుట కంటె ఘోరాపరాధము మఱి యొకటి యుండఁబోదు. ఇట్టి ఘోరాపరాధమున కే నొడిగట్టినమాట నిజము. అంతియే కాదు; ఈ ప్రభుత్వా పరక్తిబీజములను బ్రజాహృదయముల నాటి, దారి చూపిన వారిలో నాకును బద్ధుకలదు. పరమ పవిత్రమైన యీ రాజా పరక్తిని బెంచి, పోషించుటయే నా జీవిత పరమార్థము."

ఒక ప్రజపై మఱియొక ప్రజ యేలుబడి సాగించుట పాప కర్మమని వివరించు నీ పంక్తులను బరికింపుఁడు :

"స్వాతంత్ర్యాభిలాష సహజము. ఈశ్వరుఁడు ప్రసాదిం చిన వరమది. ఈశ్వర సేవకులను దనకు దాసులుగాఁ జేయు నధికారమే ప్రభుత్వమునకును లేదు. ఆ దాస్యమునకుఁ,బార తంత్ర్యమునకు నెన్ని మంచిపేరులు పెట్టినను దాస్యము దాస్యమే. ఈశ్వరసంకల్పమునకు, ధర్మమునకు నిది విరోధి కావున నాదేశము నీ దాస్యబంధమునకుఁ దప్పించుట నాకు విహితధర్మము. 'సంస్కరణము'లనియు, 'క్రమముగా నధి కార సంక్రమణ'మనియు నెంతగాఁ బులిమిపుచ్చినను ఆ

మాయమాటలు నన్నీ ధర్మమునుండి తొలఁగింపఁజాలవు. స్వాతంత్ర్యము మానవుని ప్రధాన స్వత్వము. ఒరులు దానికి హద్దులు పెట్టి, పంచుట తగదు. ఇది దాక్షిణ్యమునకు విషయముగాదు. స్వాతంత్ర్యము నించుకించుకగాఁ గొలిచియిత్తు మనుట, అప్పును వాయిదాలపై తీర్చుట వంటిదే....మాయాస్తి నాక్రమించుకొన్నవాని దాక్షిణ్యబుద్ధితో మాకుఁ బనిలేదు. ఈ దురాక్రమణపాపమును దాక్షిణ్యము పరిహరింపఁజాలదు.

"పాపములలోఁ దరతమభేదమే కాని మంచివి, చెట్టవి యను భేదముండదు. చౌర్యములలో దుష్టము, దుష్టతరమను భేదమే కాని మంచి చౌర్యము, చెడుచౌర్యమునను భేదముండదు కదా! అట్లే యీ ప్రభుత్వ దురాక్రమణము గూడ పాప కార్యము. దీనిని సమర్థింపలేము."

పిమ్మట ఖిలాఫతును గూర్చియు, ముస్లిముల ధర్మమును గూర్చియు నిట్లు వివరించెను :

"ఇది మానవధర్మము, భారతీయధర్మమే కాదు; ఇస్లాము ధర్మము గూడ నిదియే. ఇస్లామనఁగా మానవస్వత్వ బోధకు నామాంతరమే కాని యన్యము గాదు. ముస్లిమునగు నాకు ఇస్లాము చెప్పిన యీ ధర్మమే విహితము. రాచఱికి మొకరిసొత్తు గాదు. జీతములు పుచ్చుకొను నధికారులసొత్తు అంతకంటెఁ గాదు. ప్రజాతంత్రాత్మకమైన స్వతంత్రప్రభుతనే తప్ప ఇట్టి దొరతనముల నిస్లాము ధర్మ మంగీకరింపదు. మానవజాతిగోల్పోయిన యీ స్వతంత్రతకుఁ బునః ప్రతిష్ఠసల్పుటకే యిస్లాము ధర్మ మవతరించినది. ప్రభువులచే, విజాతీయుల దురాక్రమణచే, స్వార్థపరులగు పీఠాధిపతులచే, నితర

బలవంతులచే మానవుని స్వాతంత్ర్య మపహృతమయ్యెను. అట్లు లభించిన రాచఱికము తమకు భుక్తమయ్యెననియుఁ, దాము బలవంతులమనియు వీరు మురియుచున్న తఱి, ఇస్లా మవతరించి, ధర్మబలమే బలమనియుఁ, దక్కినవి కావనియుఁ బ్రవచించెను. ఈశ్వర సృష్టమైన జీవరాశిచేఁ బనిగొను ప్రభు వీశ్వరుఁడే కాని యితరులుగారు. మానవులందఱు సమానులు. వారి మూలస్వత్వములలో నెక్కువ తక్కువలు లేవు.

"ఇస్లాం ప్రవక్తయు, ఖాలీఫులు చెల్లించిన ప్రభుత్వములు ప్రజాతంత్రాకములు. స్వతంత్రులు, సమానులునగు ప్రజ లెల్లరు నేకీభవించి, స్వేచ్ఛమై వరించిన ప్రభుత్వము లవి. కావుననే ప్రజాతంత్రాక ప్రభుత్వముల యధిపతులకు, రాజులకు ఖాలిఫ్ సంజ్ఞ వర్తించును. ఖిలాఫత్ శబ్దమునకు ప్రాతినిధ్య మనియే యర్థము. ఖాలిఫ్ అధికారమంతయు నా ప్రాతి నిధ్యముచే సంక్రమించినదే. తదతీతమైన యధికారము ఖాలిఫ్‌కు లేదు.

"ప్రజాభీష్టమును, అనురక్తిని బడయని ఇస్లాము ప్రభుత్వము నేనియు ముస్లిములు నైతికముగా సమర్థింప నిరాకరింతురన్నచో నిఁక విజాతీయ ప్రభుత్వమును వారెట్లు పరిగణింతురో చెప్పఁ బనిలేదు. నేఁడు భారతదేశమున నిస్లాం ప్రభుత్వమే నెలకొనె ననుకొనుఁడు. అందు రాజాభీష్టముగాని, యుద్యోగుల దొరతనముగాని చెల్లుచుండునేని దానిని బ్రతి ఘటించుట ముస్లిము మతస్థుఁడగు నాకు ప్రధాన ధర్మముగా నెంతును. అట్టి దొరతనము పీడాకరమని చెప్పి, దానిని దొలఁగఁద్రోయఁజూతును.

"స్వచ్ఛమగు నీ ఇస్లాము ప్రభుత్వ ధర్మము తదనంతర

కాలమందలి ముస్లిము ప్రభువుల సొంత దొరతనముచేఁ గలుషితమయ్యెనని యంగీకరింతును. పూర్వ రోమక చక్రవర్తులయుఁ, బారసీక సామ్రాట్టులయు ప్రాభవ వైభవములఁ గాంచి, కనులు మిఱుమిట్లుగొన్న ముస్లిము రాజులుగూడఁ దమ సామ్రాజ్యమును విస్తరింపఁజేయ నెంచిరి. జీర్ణ వస్త్రధారులు, ఋషికల్పులు నగు తొంటి ఖాలీఫుల మార్గమును వీడి, యీ ముస్లిము ప్రభువులు కెయిజర్ ఖుస్రూల మహా వైశ్వర్యముల కాసచేసిరి. ఇట్టి ముస్లిము రాజవంశముల దొరతనములు చెల్లుచున్నపుడెల్ల ఇస్లాము ధర్మవీరు లా రాచఱికములను, వాని యత్యాచారములను దెగడి, పెక్కు కడగండ్ల కగ్గమయ్యు, కంటకమయమైన ధర్మమార్గమును వీడకుండిరి.

''ఇస్లాం ప్రవక్త ముస్లిముల కుపదేశించిన ధర్మమిది : 'ప్రజాపీడన మొనర్చు ప్రభుత్వమును లక్షింపక, సత్యమును వక్కాణించువాఁడు క్రూరహింసలకు గుఱియై మరణించునేని వాని మరణము ధన్యము.' ఇస్లాము ధర్మగ్రంథమగు పవిత్ర కొరాను 'సత్యమునకు, నీశ్వరునకుఁ దక్క వా రితరులకు భీతిల్లరు. సత్యమును జాటి చెప్పుటకు వా రెంతటికైనఁ దెగింతురు' అని ముస్లిము ధర్మలక్షణమును బ్రవచించెను. ఆ కొరానే 'ఈశ్వరుని యీ భూమిపై వారే సత్యసాక్షులు' అని ముస్లిము ప్రజల లక్షణమును వాకొన్నది. కావున ముస్లిము ధర్మము ననుసరించినన్నాళ్ళు వారు సత్యమునకు మాఱు మోమిడక, దానిని వక్కాణింతురు. ముస్లిములను కొరాను 'సాక్షు' లనియే పేర్కొనును. సాక్షులనఁగా సత్యసాక్షులే. ముస్లిము ప్రవక్త యెవ్వరిచేనైన ధర్మ శపథము చేయించునపుడు 'నే నెందున్నను, ఎట్లున్నను సత్యమునే చాటుదును'

అను వాక్యమా ప్రమాణ వచనమున ననుసంధించెడివారు.

"ముస్లిముల యితిహాసమున నబ్దుల్ మాలిక్ సార్వభౌముని నాఁటి కథ యొకటి యున్నది. ప్రభువుల యత్యాచారములను బహిరంగముగఁ జాటి చెప్పిన రాజద్రోహుల శరీరములను - ఏ యవయవమున కా యవయవమును - ముక్కలుగా ఖండించి చంపవలెనని సార్వభౌముఁ డాజ్ఞ యిడెను. సత్యవాది యగు నొక ధర్మవీరుని శరీర మిట్లు కండ తుండెములుగా నఱకుచున్నను ఆతఁడు సుస్థిరుఁడై యా హింస నెల్ల భరించుచుండ, ఆతని నాలుక తన్ను ఖండించు దనుక రాజకృతమైన యత్యాచారము నుగ్గడించుచునే యుండెనఁట! సిరియా మొదలు సింధుదేశము వఱకుఁ బాలించిన సార్వభౌముని నాఁట నడచిన గాథ యిది. సత్యమునకై యిట్టి క్రూర హింసలు సహింప నేర్చినవారు సెక్షను 124-ఏ ను జూచి భయపడుదురనుట కల్ల. మఱి, ముస్లిములకీ పతనము గల్గుటకుఁ గారణమేమి యందురేని ఇస్లాము ధర్మమునకు వారు దూరులగుటయే కారణమని యంగీకరింతును.

"నే నీ వాక్యములు వ్రాయుచున్న యీ తరుణముననే భారతదేశమున రాజకృతములగు నత్యాచారములకుఁ దల యొగ్గు ముస్లిము లున్నారని నే నెఱుఁగనిది కాదు. కాని, మనము ధర్మచ్యుతులమైనంత మాత్రాన ధర్మమునకు హాని వాటిల్లుట కల్ల.

"ఇస్లాము ధర్మగ్రంథములు నేఁడును నిలిచియున్నవి. స్వాతంత్ర్య హీనుఁడగు ముస్లిము జీవనము రోఁత యని యవి వాక్రొనుచున్నవి. సధర్ముఁడగు ముస్లిమునకు - స్వతంత్రుఁడుగ జీవించుటయో, ఆహుతియైపోవుటయో రెండే

మార్గములు. కావున భారత ముస్లిములు సోదర దేశీయులగు హిందూ సిక్కు పారసీ క్రిస్టియనులతోపాటు మాతృదేశ స్వాతంత్ర్యమును సాధించుటకై దీక్ష వహించిరి.

"నిజస్వత్వములను, స్వాతంత్ర్యమును సంపాదించు కొనుఁడని నా మతస్థులకు, భారత ప్రజకు నేను పంద్రెం డేండ్లుగా బోధించుచుంటిని. పదునెన్మిదేండ్ల యీడుననే యీ విషయమై వ్రాయుటకుఁ, బ్రసంగించుటకు నే నారంభించితిని. ఈ లక్ష్య సాధనకై నా బ్రదుకును మీఁదుగట్టితిని. నా పడుచుఁ బ్రాయమెల్ల దీనికై ధారవోసితిని. దీనికోసమే నాలుగేండ్లు నిర్బంధావాసమొనర్చితిని. ఆ తరుణమునఁగూడఁ బ్రజల నీ విషయమునఁ బ్రబోధించుట నేను విడనాడినది లేదు. నా బ్రదుకున కిదియే పరమార్థము. దీనిని సాధించుటకే నేను బ్రదుకఁ గోరుదును. 'నా ప్రార్థనలు, నా యనుష్ఠానములు, నా బ్రదుకు, నా చావు-సర్వము జగదీశ్వరునికొఱకే' యని కొరాను ప్రవచించినది. ఈ యిస్లాము ధర్మమును బోధించి, భారత ముస్లిముల రాజనీతిని దలక్రిందు లొనర్చి, వారిని క్రమముగా భారతీయతాభిమాన శిఖరమున కెక్కించిన వారిలో నే నగ్రగామిని. 1912 లో నేను ప్రకటింపఁ దొడఁగిన 'అల్ హిలాల్' అను ఉరుదు పత్రిక యీ లక్ష్యసాధనకొఱకే పుట్టినది. భారత ముస్లిముల ధర్మదృష్టిని, రాజనీతిని ఆ పత్రిక మూఁడేండ్లలోఁ దనవంకకుఁ ద్రిప్పనేర్చినదనుట ప్రత్యక్షమే.

"స్వాతంత్ర్యముకొఱకు, ధర్మముకొఱకు సాగుచున్న యీ సమరమునం దహింసను, సాహాయ్య నిరాకరణమును సాధనములుగా వరించితిని. ప్రభుత్వము నిజహింసా సాధన సర్వస్వముతో మ మ్మెదిరి నిలిచినది. మేము మా భార

మంతయుఁ బరమేశ్వరునిపై నిడి, యచంచలమగు ధైర్యమును, అనంతమగు త్యాగమును నమ్ముకొనియున్నాము.

"శస్త్రబలమును శస్త్రబలముతో నెదుర్కొనఁదగదని గాంధి మహాత్ముని మతము. నే నది విశ్వసింపను. ఒక్కొకచో నిస్లాము ధర్మము హింస నంగీకరించును. ఈ ప్రతిహింస ఈశ్వర ధర్మమున కనురూప మనియే నే విశ్వసింతును. అట్లయ్యు, భారత స్వాతంత్ర్య సంపాదనకై యహింసనే యాశ్రయింపవలెనని మహాత్ముఁడు చెప్పినమాట సత్యమని నే నంగీకరింతును. శస్త్రధారణముచే భారతము స్వాతంత్ర్యము సంపాదింపఁ జాలదనియు, సంపాదింపఁ దగదనియు నేను మనసార నమ్ముచున్నాను. అహింసయే భారతమునకు జయముఁ గూర్చును. భారతము సాధించిన యీ విజయము ధర్మ విజయమునకుఁ బతాక గాఁగలదు."

ప్రజాతంత్రాకమగు పరిపాలన మిస్లాము ధర్మవిరుద్ధమని చెప్పు ముస్లిము నాయకులు మౌలానా ప్రవచించిన యిస్లాము ధర్మమందలి ప్రజారాజ్య స్వరూపమును మనన మొనర్తురుగాక. "ప్రజల యభీష్టమును, అనురక్తిని బడయని ఇస్లాము ప్రభుతనేనియు ముస్లిములు నైతికముగా సమర్థింప నిరాకరింతు"రని మౌలానా చెప్పుచున్నాఁడు. పదునెన్మిదేండ్ల యీడుననే స్వాతంత్ర్య సాధనకై తన బ్రదుకును మీఁదు గట్టితిననియు, నా లక్ష్య మింకను సిద్ధింపవలసియున్నదనియుఁ గూడ మౌలానా చాటిచెప్పుచున్నాఁడు.

---

# 9. వెల్లువపాటు

ఆ సుదినముల మహిమ ఏమి చెప్పుదును! జలియన్ వాలా బాగ్ పుణ్యక్షేత్రమున హిందూ ముస్లిము సిక్కుల రక్త మేకధారగాఁ బాఱి, వారిని రక్తబాంధవులను గావించినది. ఆ తీర్థమున మునిఁగి, వారు స్వరాజ్య సమరదీక్షితులైరి. వారి హృదయముల నాశాంకురములు పొడమి, ఐక్యభావము పల్లవించినది. పరమేశ్వరుఁడు వారి ననుగ్రహించెను. ఒకపరి ఆలీ సోదరులతో, నొకపరి మౌలానా ఆజాదుతో, మఱియొకపరి ఇతర ముస్లిము నేతలతో జతగూడి గాంధిజీ దేశము నాల్గు చెఱఁగుల సంచరించిన తఱి ముస్లిము ప్రజ జడత్వము విడిపోయెను. రాజకీ వ్యవహారములందు వారి కాస్థ తోలకరించెను. ఒకరితో నొకరు వంతులుపడుచు వారు త్యాగనిరతులు, నుపకారపరులు నగుచు, నద్భుతమగు సౌందర్యమున నోలలాడఁదొడఁగిరి. స్వకులముతోఁ దక్కనితరులతోఁ బొత్తుగుడువని సనాతనాచార పరాయణులగు హిందువులు గూడఁ బూజ్యులగు ముస్లిము పెద్దలతో నిజగృహముల నేకపంక్తి నారగింపఁజొచ్చిరి. సభలకేతెంచుటయుఁ బురుషుల యుపన్యాసము లాలకించుటయు నెఱుఁగక, రవికేని మోముచూపని ముస్లిము కాంతలంతిపురిపీడి యేతెంచి, సభలుగావించి, గాంధిజీ నాహ్వానించి, తత్ప్రసంగము లాలకింప నువ్విళులూరసాగిరి. ఆలీ సోదరులు, నితర ముస్లిమునేతలుగూడఁ గనులకు గంతలు ధరింపక యీ సభలకేగఁగూడదు. గాంధిజీ కా నిషేధము లేదు. ఆయన పరమపవిత్రుఁడు; ఎచటికేని ఆయనకుఁ బ్రవేశము గలదఁట. స్త్రీలందఱు గాంధిజీకిఁ దల్లులు, బిడ్డలునఁట.

ఇతరులు–తమవారేనియు–మానవమాత్రులే కావునఁ గనులఁ గంతలుదాల్చి రావలెనఁట. ఇట్లు చెప్పుచు గాంధిజీ సభలకు ముస్లిము ఇల్లాండ్రే తెంచిన యా సుదినములు మఱపునకు రావు. అఱమరిక లెఱుఁగని ఈ యైక్యభావమున కంతటికి మకుటాయమానముగ ముస్లిములు గోమాంస భక్షణమును, ఈద్ పండుగవేళ గోబలిని విడనాడిరి. "ముస్లిముల ఖిలాఫత్ గోమాతను రక్షించుట మనకు విహిత ధర్మము. బేరసార ములకుఁ, బ్రతిఫలాపేక్షకు నది విషయము గాదు. మన గోమాతను రక్షించుభారము ముస్లిములపైఁ బెట్టుఁడు. వారి ధర్మమును వా రెఱుఁగుదురు" అనుచు గాంధిజీ తన రచనలచేఁ, బ్రసంగములచేఁ బ్రబోధించుచుండెను. ఈ మాటలచే మనసులు కరఁగినవా రటులుండఁ గొందఱు గో భక్షణమును, గో బలిని దమకుఁదామై విడనాడిరి. అజ్ఞానముచే గోవులను బలియిచ్చు వేళలం దడ్డుపడి రక్షించిన వారును గలరు.

ఆ దినములలోనే మన ప్రజల రాజనీతి నైపుణ్యము గూడ మిన్నుముట్టినది. కాంగ్రెసుతో సమాధానపడుటకై రీడింగుప్రభువు ప్రేరణచే జరిగిన సభయే యిందులకుఁ దార్కాణ. యువరాజాగమనముపైఁ గాంగ్రెసు ఆంక్ష పెట్టినది గావున నా బెడదను తప్పించుకొనుటకై ప్రభుత్వ మీ యెత్తు నెత్తెను. మన కోరికలనన్నిటిని బ్రభుత్వ మంగీక రించినను ఒనఁగూడు ప్రయోజనమంతగాఁ గన్పింపదయ్యెను. కావున మన పెద్దలు ఖిలాఫత్ బందీల నందఱను విడుదల చేసి తీరవలెనని పట్టుపట్టిరి. ఆ బందీల పరోక్షమున రాజీ యత్నములు ఫలింపఁజాలవని గాంధిజీయు, హైందవ నాయ

కులును ప్రభుత్వమునకుఁ దెలియఁజెప్పిరి. ఈ కోరికను ప్రభుత్వము నిరాకరించుటచే మౌలానా ఆజాదు దేశబంధు దాసులును, వారితోఁ జెఱసాలలోనున్న వేలకొలఁది బందీలును శిక్షాకాలము పూర్తియగువఱకుఁ జెఱసాలలందే యుండిరి.

పిమ్మట గాంధిజీని ప్రభుత్వము బంధించెను. ఆ కారణముచేఁ గాకున్నను-శాసనోల్లంఘనమును విరమించిన పిమ్మటఁ బ్రజల యుత్సాహము చల్లఁబడి, కట్టుబాట్లు సడలఁ బాఱెనవి. నిర్మాణ కార్యకలాపమో యని యెంత మొత్తి కొన్నను ప్రజ లా మొఱఁ బెడచెవి నిడిరి. రాజనీతిజ్ఞులగు పెద్దలందఱుఁ జెఱసాలలం దుండిరి. స్వాతంత్ర్యోద్యమము ముమ్మరముగా నున్నన్నినాళ్లుఁ బెడపెడగానున్న మతాభిమానులు మరల ముందంజ యిడిరి. మన బలహీనతయే తనకు బలముగా బ్రదికెడి ప్రభుత్వ మీ కులాభిమానులను చేఁజిక్కించుకొని, యిచ్చివచ్చినట్లాడింపఁ జొచ్చెను. 1919–22 లలోఁ దలచూపలేక ముచ్చుముణిఁగియున్న యీ భేదోపాయము మరలఁ దలయెత్తెను. స్వప్రయోజనపరులు వివేకహీనుల దురభిమానములను రెచ్చఁగొట్టసాగిరి. ఇందుఁ బ్రభుత్వమును నిందింపవలసినది లేదు. జవహర్లాలు పండితుఁడు చెప్పినట్లు "సామ్రాజ్యాధిపతుల కీ భేదోపాయ మే కాలమందును బరిపాటియే. ఈ భేదోపాయ మెంత ఫలించిన సామ్రాజ్యముల కంత బలము చేకూఱుచుండును. కావునఁ బ్రభువుల కిది నింద్యము గాదు; మన కిందు వింతయు లేదు. దీని నలక్ష్యమొనర్చుటయు, దీని కెడ మిచ్చుటయు మనదే పొరపాటు."

ఈమాట లెటులున్నను 1922 లో గాంధిజీ చెఱఁబడిన

పిమ్మట నీ భేదనీతికి జయము చేకూరినమాట సత్యము. మనము సాధించితి మనుకొన్న యేకీభావము నిస్సారమనుట కాపిమ్మటి వృత్తాంతమే సాక్షి. ఐక్యభావము మన హృదయముల నెలకొననేలేదు. గోబలిని నివారింప హిందువులు సమకట్టినంతనే దొమ్మియు, రక్తపాతముఁ దప్పవయ్యెను. మసీదుల ముందుగా మేళతాళములతో నూరేగినచో జగడములు దాపురించెను. దేశమంతట నీ మసీదు లున్నవి. ప్రతిదినము నైదువేళలం దీ మసీదులలో నమాజు జరుగుచునే యుండును. ఏవియో ఊరేగింపులు, నుత్సవములు జరుగుటయుఁ దప్పదాయెను. అట్టిచో, నించుక పరస్పర సహనము, సద్భావము లేనినాఁ డీ కలహము లుప్పతిల్లుచునే యుండును. ఇంచుకంత సర్దుకొనిపోవు గుణమున్నచో నీ కలహముల నివారింపవచ్చును. 1919–22 ల మధ్యఁ బ్రజా హృదయముల నేలిన సోదర భావమెల్ల, అదియేమి పాపమో, ఏమికుట్ర జరిగెనోకాని, చప్పగాఁ దుడిచిపెట్టుకొని పోయెను. అహింసా మంత్రము నోట నుచ్చరించుటయే కాని మనసులో లేదని తేలిపోయెను. బలప్రయోగమే శరణ్య మను భావము ప్రబలమాయెను.

కొన్ని రాష్ట్రములలో నార్థిక స్థితిగతులుగూడ నీ కలహములకుఁ గారణము లైనవి. ఒకానొకమంత్రి స్వమతస్థులకే యుద్యోగము లన్నియు నిచ్చుచుండెనని యన్యమతస్థులకుఁ గన్నెఱ్ఱయై కొఱకొఱగా నుండెను. ఇరువాగుల ద్వేషమున కిది తోడయ్యెను. ఋణ గృహీతలు, కర్షకులు నగు పేద ముస్లిములను హైందవ ఋణదాతలపై, భూస్వాములపైఁ గొండ ఱెసగొల్పసాగిరి. అర్థసంబంధములగు

నిట్టి యసూయలుగూడఁ బెక్కుచోట్ల మత కలహములకు దారితీసెను.

ఉభయమతములందును దురభిమానులు స్వమతమునం దన్యుల నెటులేని కలిపికొనుటకై యత్నించుచుఁ, బరస్పరము నిందించుకొనఁ జొచ్చిరి. ఇతర మతస్థులను దమలోఁ గలిపి కొని తీరుదుమని ముస్లిములును, అన్యమత ప్రవిష్టులకు శుద్ధి సంస్కారము గావించి తమలోఁ గలిపికొని తీరుదుమని హిందువులును ముష్కరత వహించిరి. ఈ పట్టుదలలే జగడములకు దారితీసి, దొమ్మిపోరులు దెచ్చిపెట్టుచుండెను. వార్తాపత్రికలుఁ, గరపత్రములు నీ కలహాగ్నిలో సమిధలనువైచి మంటలను బెద్దవి చేయుచుండెను.

1924 లో గాంధిజీ చెఱవీడి వచ్చుసరికి దేశ మింతటి అధ్వాన్నస్థితిలో మ్రగ్గుచుండెను. దేశమున నేమూలనో దొమ్మిపోరులు జరుగకుండఁ బక్షముదినము లేనియుఁ గడచుట గలువై పోయెను. ముల్తానులో, సహరాన్‌పూరులో, ఆగ్రాలో, అజ్మీరులో, పాల్వాలులో — ఇట్లు లనేక ప్రదేశములందుఁ గొట్లాటలుఁ, గొల్లగొట్టుటలు, గృహ దాహములు, దివ్యస్థలముల నపవిత్ర మొనర్చుటలు–పట్ట పగ్గములులేక చెలరేఁగిపోఁ జొచ్చెను.

హిందువులు, ముస్లిములుగూడ గాంధిజీయే తమ కీ కష్టములు దెచ్చిపెట్టెనని యాడిపోసికొన సాగిరి. "ఖిలాఫతు విషయమున ముస్లిములతో మీా మూలముననే చేతులు గలిపితిమి. తత్ఫలితముగా ముస్లిములు మేలుకొని యొక్క త్రాటిపై నడవనేర్చి, హిందువుల హతమార్చుట కెత్తుకొని" రని హిందువులు నిందింపఁగా, ముస్లిములు "మేము కల్ల

కపటము లెఱుఁగక, మీ మూలమున వంచితులమైతిమి. మహమ్మదాలీని మీ పక్షమునకుఁ ద్రిప్పికొంటిరి. సర్ సయ్యిదహమ్మదంత కష్టించి నిర్మించిన ఆలిఘరు సంస్థను నిందలపాలొనర్చితిరి. మీరు పెట్టిన యాంక్షవలననే మా పెద్దలు శాసన సభలలో నడుగిడరైరి. ఆ కారణమున మా ప్రయోజనములన్నియుఁ బదటఁ గలిసిపోయె''నని గాంధిజీని నిందించిరి. అంతట గాంధిజీ హిందూ ముస్లిము కలహ కారణములను సవిమర్శముగాఁ జేర్కొని, తన్నివారణోపాయము సూచించుచుఁ బత్రికయం దొకవ్యాసముఁ బ్రకటించెను. చరిత్రలో స్థిరాక్షరమైపోయిన యావ్యాసమున గాంధిజీ యిట్లువచించెను: ''నే నింతకుమున్ను చేసినపని కించుకయు వగవను. ఇది యెల్ల నిట్లు జరుగునని దివ్యదృష్టిచే నేను గ్రహించియున్నను ఈ ఖిలాఫతు మహోద్యమమునం దుఱికియే యుందును. ప్రజాసామాన్య మిట్లు కన్నుదెఱచుట తప్పదు. దీనివలన మనకుఁ జేకూఱిన మే లింతంత యనలేము. మేలుకొన్న ప్రజను నేను మఱల నిద్రపుచ్చ నొల్లను''. ఈ వ్యాసముచే ననేక సందేహము లుదయించెను. 'ఔను, కాదను వాగ్వాదములు చెలరేఁగినవేకాని దానివలనఁ బ్రయోజనము శూన్యమాయెను. మఱికొన్నాళ్లకే ముస్లిము లమేధి శంభల గుల్బర్గాపురములందలి దేవాలయముల నపవిత్ర మొనర్చినంతట దారుణ కలహములు చెలరేఁగెను. అంతటితో నాఁగక కోహాట్‌లో ఘోరాతిఘోర కర్మలు సాగి, లక్షల కొలఁదిగా ఆస్తి నష్టపడెను.

గాంధిజీ సంతాపవివశుఁడై పోయెను. ''అమేధి శంభల గుల్బర్గాలందలి దొమ్మి పోరులచేఁ దల్లడిల్లిపోయి లోలో

రగులుచున్న నాహృదయము నీ కోహటు దురంతము గప్పున మండించెను. ఏమి చేయుటకును బాలుపోక రెండురాత్రులు మనస్వాస్థ్యము లభింపక, తాపముచే వేఁగిపోయితిని'' అని యా మహాత్ముఁ డాక్రోశించెను. 18-9-24 బుధవారమునాఁ డాయన కుపాయ మగపడెను. "నాకుఁ బ్రాయశ్చిత్తమే గతి. ఎఱుఁగక చేసిన పాపములను మన్నింపవేయని తాపతప్తమగు హృదయముతోఁ బరమేశ్వరుని పాదములపైఁబడి వేఁడి కొందును. ఒకరి ధర్మము నొకరు నిందించుట, నోరు పాఱ వైచుకొనుట, కల్లలాడుట, నిరపరాధుల తలలు బ్రద్దలు సేయుట, దేవాలయములను, మసీదులను మలిన మొనర్చుట- ఇంతకంటె నీశ్వరద్రోహము లేదు. పరమేశ్వరుని పాదములకుఁ దప్పిపోతి'' మని యాయన వాపోయెను. ఇరువదియొక్క దినము లుపవాస ముందునని ప్రాయశ్చిత్తము విధించుకొనెను.

ఈవార్త వినినంతట దేశ మంతయు నల్లడతల్లడగుడిచి, ఒడ్డగిలఁబడెను. మహాత్ముఁ డుపవసించుచున్న ఢిల్లీ నగరము నకు మిత్రులెల్లరుఁ బరుగిడి పోయిరి. 'ఐక్యసాధన సభ'కు మోతీలాల్ నెహ్రూ అధ్యక్షుఁ డయ్యెను. ప్రస్తుత విషయ మును సాకల్యముగాఁ జర్చించి నివారణోపాయము వెదకుటకై సమాలోచన మారంభమయ్యెను. హిందూ ముస్లిము పెద్దలు నూటయేఁబదిమంది కూడి పెక్కుదినము లాలోచించిరి. ఎన్నియో కార్యనిశ్చయములు చేసిరి. ఎంతచేసినను గాంధిజీ కోరిన పశ్చాత్తాప మించుకయు నాసభలోఁ బొడగట్టదయ్యెను. సభ్యులేమియు సాధింపకయే వట్టిచేతులతో వెడలిపోవు సూచ నలే పొడకట్టెను. ఆసభ కాహూతుఁడై యేగిన కలకత్తా నగర బిషపు తటస్థ భావయుతముగాఁ బల్కినపల్కు లివి :

"అచటఁ జేరిన యిరువాగులు నొకరి సద్భావ మొకరు విశ్వసింప లేకపోయిరి. ఒక రౌదార్యము చూపఁగా రెండవవారది యెల్ల నేదియో ప్రయోజనము సాధించుటకై యెత్తినయెత్తని సంశయించిరి. ఒక రొకటి చెప్పఁగా, రెండవవారు దానికిఁ బ్రతిగా నింకొకటి చెప్పి బేరములాడఁ దొడఁగిరేకాని ఏకీభావము సాధించు యత్నమే యచటఁ బొడకట్టక పోయెను."

ధర్మభీతి లేక, అమానుషకృత్యము లొనర్చినందుల కించుకంత పశ్చాత్తాప ధోరణిని, త్రికరణశుద్ధిని ఆ సభలో సమకూర్చుటకై కొందఱు యత్నించిరి. అట్టి సత్పురుషులలో మౌలానా అబుల్ కలాం ఆజా దొకఁడు. ఒకఁ డననేల? ఆతఁడే వారిలో నగ్రేసరుఁ డనఁ దగును. "జరిగిన యత్యాచారములను బులిమిపుచ్చుటకును, గొంతెమ్మ కోరికలను సమర్థించుటకును నే నీసభకు రాలేదు. ఎవరి కెంత యప్రియమైనను సత్యమును చాటి చెప్పుటకే నే నేతెంచితి" నని మౌలానా స్పష్టముగాఁ బలికెను. ఆ సభలోఁ జేసిన కార్యనిశ్చయములలో రెండవదిది: "ఒరులపైఁ బగతీర్చుకొనుటకో, ఒరులను శిక్షించుటకో యిచ్చవచ్చినట్లు వర్తించుట ధర్మహానికి, న్యాయశాస్త్ర భంగమునకుఁ గారణమగును. కావున వివాదకారణము గల్గినపుడు మధ్యవర్తి పరిష్కారమునకుఁ దలయొగ్గవలెను. అది సాధ్యముకానిచో న్యాయస్థానములందుఁ దగవు తీర్చుకొనవలెను" అని యా సభ నిశ్చయించినది. అతి ముఖ్యమగు నీ కార్యనిశ్చయము మౌలానా ఆజాదు లేనిచో జరిగెడిదే కాదు.

గోవును గూర్చిన వివాద మింతకంటెను ముఖ్యమైనది. "భుజబలము వలననో, శాసనబలము వలననో హిందువులు

గో వధను నివారించుటకు యత్నింపక సామమార్గ మవలం బింపఁ దగును" అని మొదటి ముసాయిదాలో వ్రాసిరి. హిందువు లంతట "మేము దీని కొడంబడినచో మీ రింతకు మున్ను గోవధ చేయని స్థలములలోఁ గ్రొత్తగా గో వధ చేయమనియు, గో వధను కాలక్రమమునఁ జప్పగా మాను కొందుమనియు నంగీకరింపవలసి యుండు"ననిరి. గో వధను ముస్లిములు చప్పగా మానుకొనుట పొసఁగదు కావున మౌలానా యపుడు కలుగఁజేసికొని, అనుతాపౌదార్యములు పొంగిపొరలు హృదయముతో నద్భుతముగఁ బ్రసంగించి సభ్యుల హృదయములఁ గరఁగించి విజయమును సాధించెను. ఆ సభలో నున్న హైందవనాయకు లొకరు మౌలానా నిట్లు ప్రశంసించిరి: "ఆయన వచోనైపుణి యెల్లరు నెఱిఁగినదే. అది యటులుండ స్వమతస్థు లాయనను దత్త్వవేత్తయనియు, మహా పండితుఁడనియు సమ్మానింతురు. అట్లయ్యుఁ, గరుణ రసావేశముచే, భావౌదార్యముచే నా నాఁటి ప్రసంగ మాయన తొల్లిటి ప్రసంగనైపుణి నెల్ల మఱపించెను. భారత దేశమందలి విశేష పరిస్థితులతో నిస్లాము ధర్మమును సమన్వ యించిన యాయన యౌదార్యము నెంత మెచ్చినను దనివి తీరదు. ఆయన వేఁడికో లుభయమతస్థులను గరఁగించి, సభా వ్యవహారమును క్రొత్తదారిఁ బట్టించినది. బలికోసమేనియు గో వధము సేయుట యిస్లాము ధర్మమునకు ముఖ్యముగాదని యటు స్వమతస్థులకు విన్నవించెను ; ఇటు హైందవమిత్రులకు 'మాలోఁ జాలమంది గోమాంసము ముట్టము. అంతటితో నాఁగక హిందువులతో సౌదర్యముకోసమై గో మాంసభక్షణ ముజ్జగింపుఁడని మా మతస్థులకు బోధించుచుంటి' మని మనవి

చేసెను." ఈ మాటలచే ముస్లిముల మనస్సులు కరఁగినను గోవధను పూర్తిగా మానుకొనుటకు వారు వెనుకాడు చుండిరి. తుదకీ వ్యవహార మెటు మ్రొగ్గునో తెలియకున్న స్థితిలో సభాధ్యక్షుఁ డిరు తెగలవారిని 'మరల సంప్రదించు కొని, కార్యనిశ్చయ మొనర్పుఁ'డని వేఁడికొని, యా నాఁటికి సభను ముగించెను. ఇట్లు దారియుఁ దెన్నును గానరాకున్న తరుణమున, అంతకుమున్న మౌలానా వేఁడికోలుచే ద్రవీ భూతచిత్తుఁడై యున్న మాలవ్యా పండితుఁడు సభారంగమున నిలిచెను. పండితుఁ డేమనునోయని సభ్యు లూపిరి బిగ్గబట్టి యుండిరి. అపుడాయన 'గోవధను ముస్లిములు పూర్తిగా విడనాడవలెనని మేము పట్టుబట్ట'మని వచించెను. ఆ మాటతో సభ్యులకుఁ బ్రాణములు లేచివచ్చిన ట్లాయెను. సభలో మహోత్సాహతరంగము పెల్లుబికి నట్లయ్యెను. ఇఁక నేమున్నది? తక్కిన సభాకార్యము చరచర నడచిపోయెను. మొదటి ముసాయిదాలో హక్కుల ప్రస్తావమే కాని బాధ్యత లెవ్వరికిఁ బట్టవయ్యెను. ఇపుడు బాధ్యతలు లేని హక్కు లుండవని తెల్లమయ్యెను. హక్కులకై వివదించుట మాని యుభయులు బాధ్యతలు నిర్వర్తింతురేని చిక్కులన్నియుఁ దొలఁగిపోవునని యెల్లరు గ్రహించిరి.

గాంధిజీ యుపవాసవ్రతము ముగిసినంతట ముస్లిము నేత లాయన శయ్యను బరివేష్టించి యుండిరి.

గాంధిజీ వారితో భావోద్వేగమున, నల్పస్వరముతో "ఈశ్వరేచ్ఛ యెటులున్నదో నే నెఱుఁగను. మీరు మాత్రము హిందూ ముస్లిముల కైకమ్యము సాధించుటకై ప్రాణములేని అర్పింతుమని బాసచేయుఁ"డని వేఁడికొనెను.

మౌలానా ఆజాద్ హకీమ్ అజ్మల్‌ఖాను లట్లు మరలఁ బ్రతిజ్ఞ గావించిరి. ఆ హకీమ్ సాహెబు నేఁడు లేఁడు. ఆ నాఁటి ప్రతిజ్ఞలకు సాక్షిగానున్న భక్తశిఖామణి, దీనబాంధవుఁడు సి. యఫ్. ఆండ్రూస్ గూడ మనల విడనాడియేగెను. ఈశ్వరానుగ్రహముచే మౌలానా మాత్రము మన మధ్య నున్నాఁడు. ఆ నాఁటి శపథ పరిపూర్తిచేఁ, దనకుఁ బ్రాణ మిత్రములగు హకీంజీ దీనబాంధవుల యాత్మలుగూడ గాంధిజీతోపాటు సంతోషింపఁగలవని మౌలానా యెఱుంగును.

ఇంతకు, గాంధిజీ చెప్పినట్లు, ఈశ్వరేచ్ఛ యెటు లున్నదో యెఱుంగము. కాని గాంధిజీ తపశ్చర్యామూలక ముగా నేర్పడిన 'ఐక్యసాధన సభ'యందు మౌలానా చూపిన యౌదార్యము మాత్రము మఱపునకు రాదు. కలకత్తా నగర బిషపుతో నే నీమధ్య మాటలాడుచుండఁగా మౌలానాను గూర్చిన ప్రస్తావము వచ్చెను. పిమ్మట నా బిషపు నాకిట్లు లేఖ యంపెను:

"1924 శరత్కాలమున నడచిన శాంతి సభా వృత్తాంతము నా కెప్పుడు నాదకు వచ్చుచుండును. అపుడు నాకుఁ బరిచితులైన హిందూ ముస్లిము నాయకులలో ముగ్గురు నలువుర యోగ్యత నా కెన్నఁటికిని మఱపురాదు. ఆ సభలోఁ జేసిన కార్య నిశ్చయములందుఁ బ్రస్ఫుటమగు న్యాయబుద్ధికి, సహనమునకు నా ముగ్గురు నలువుర వాజ్నిపుణతయే ప్రధాన కారణము. విషయ నిర్ణాయక సభ్యుల చర్చలలోఁ దొలుత నుభయపక్షీయులు నెవరి హక్కులను గూర్చి వారు వివరించుటయే కాని యెదుటివారి కష్టనష్టముల నాలోచించు ధోరణియే కన్పించలేదు. తాము

నమ్మినదానిని బాహాటముగాఁ జెప్పివేయుట న్యాయ్యమే యైనను, ఆ చెప్పుటలో, నెదుటివారికిఁ గూడ నట్లుచెప్ప హక్కున్నదని గుర్తించుట యుచితమని ఇరువాగులకుఁ గ్రమముగాఁ దెలిసివచ్చెను. ముస్లిము పక్షీయులలో మౌలానా ఆజాదు ప్రసంగములు సభ్యుల హృదయముల నెంతయు లోఁగొనెను. లేనిపోని పునరుక్తుల పొంతఁబోక, క్లిష్టత యొకించుకయుఁ గానరాకుండ, సమాధేయోక్తులతోఁ దన వాదము నాయన వినిపించుచుండ నా ప్రసంగనైపుణి నాకు వీనులవిందుగా నుండెను. ఆ ప్రసంగము ఉరుదుభాషలో నడచినను నందలి హేతువాద బల మందఱి మనస్సులకు వచ్చెను. ఇప్పటికిఁ బదియాఱేండ్లు గడచినను ఆ వచో నైపుణియు, నందలి న్యాయబుద్ధియు నా మనస్సున నచ్చొత్తి నట్లు నిలిచియున్నవి. కాంగ్రెసు మహాసభాధ్యక్షతా పట్టమున కర్హమైన మౌలానా యోగ్యత కితరసాక్ష్యము లేల? ఇపుడు, చెరియొక దారిగానున్న యుభయమతస్థుల నొక దారిని నడిపించుభాగ్యము మౌలానాకు లభించుఁగాక!"

. గాంధిజీ యుపవాసమును, ఐక్యసాధన సభయుఁ దుదకు హిందూ ముస్లిముల కైక్యము సంపాదింపలేక పోయెను. ఉభయ మతములందలి పెద్దలందఱు నాసభ కేతెంచిరేకాని తమ మతస్థులకు వారు ప్రతినిధులుగ రారైరి. ఇరు దెసలఁ గాలుద్రవ్వుచు మోహరించి యున్నవారికి నచ్చఁజెప్పుశక్తి వారికి లేకపోయెను. ఉపవాసము ముగియకుండఁగనే మరల జబల్పూరులో, అలహాబాదులో కలహములు రేఁగెను. 1925లో మరల నిదియే యాట చెలఁరేగుటఁ గాంచి గాంధిజీ విసివి వేసరిపోయి, ఆ మే నెలలో నొకసభయందు నిస్పృహ

వశుఁడై యిట్లు పలికెను:

"ఈ రోగమునకుఁ జికిత్స చేయుట నావలనఁగాదు. దీనిని నేను నివారింపలేనని యొప్పికొంటిని. హిందూ ముస్లిము లిరువురు నా వైద్యమునకు సమ్మతింపకైరి. కావున నీ వివాద మునుగూర్చి యపుడపుడు ప్రస్తావించుచుంటయు, నేనాఁటికేని ఈయుభయులు నేకీభవింపనిచో మన దేశమునకు బంధవిముక్తి లేదని చెప్పుటయుఁదక్క నా చేయఁదగిన దించుకయు లేదు. ఒకరి రక్త మొకరు కళ్లఁ జూచినఁగాని ఉభయులకు సమాధా నము కుదుర దందురేని అవశ్య మాపని గానిండు. ఒకరి తల లొకరు బ్రద్దలుకొట్టుట తప్పదేని ఆపని నవశ్యము వీరులవలె నిలఁబడి చేయుట యొప్పును." దుఃఖముచేఁ గుమిలిపోవుచు గాంధిజీ యీమాటలు చెప్పి పదియేనేండ్లు గడచినను ఆ దుర్భర స్థితి యించుకయు మార్పుచెందకపోఁగా నానాఁటికి విషమించు చున్నది. ఏది యెట్లయినను, ఈ యుభయులు నేకీభవింపక తప్పదను దృఢసంకల్ప మొకటి యున్నచోఁ జాలును. అట్టి సంకల్ప మున్నవారిలో మౌలానా ఆజాదు మేటి.

---

# 10. ధర్మ విచారము

మతమును గూర్చి, ధర్మమును గూర్చి మౌలానా యభిప్రాయ మెట్టిదో మనము గ్రహింపవలె నన్నచో నొండు రెండు విషయములను గమనింప వలయును. తత్త్వవేత్తలగు పూర్వాచార పరాయణుల వంశమున జనించియు, నాయన తొల్లిటి సంప్రదాయములను, సమయములను గణింపక స్వతంత్ర బుద్ధితో ధర్మనిర్ణయము చేయఁదొడఁగెను. చతుర్థాధ్యాయాంతమున మన మీ విషయమును దడవిచూచితిమి. ముస్లిముల తత్త్వ విచారధారను, వారి వ్యాఖ్యాతల వాద పద్ధతిని, నేఁటి పండితుల పాండిత్య ప్రకర్షను, హేతువాద రతుల భిన్నమార్గములను సాకల్యముగా విచారించినఁగాని మౌలానా త్రొక్కిన మార్గము మన కవగతము గాదు. ఇస్లాము ధర్మమును సహేతుకముగా వ్యాఖ్యానించుట కాయన త్రోవదీసెను. దానిని సాకల్యముగా విప్పిచెప్పుట నావలనఁ గాదు. పాశ్చాత్యుల కట్టి విచారణతోఁ బనియు లేదు. కావున స్థూలముగాఁ గొన్ని విషయముల నిటఁ దడవి చూపుదును.

పూర్వాచార్యులు చెప్పినదెల్లఁ బరమ ప్రమాణ మనియుఁ, బూజ్యులగు పెద్దల వ్యాఖ్యానములు శిరోధార్యము లనియు మౌలానా గణింపక, వారు చెప్పినది యుక్తియుక్తము, తర్కసహము నగునా, కాదా యని విచారించుచుండెను. నేఁటి భౌతిక విజ్ఞానులు దర్శించిన విశేషము లన్నియుఁ బూర్వ గ్రంథములందే యున్నవనియు, నిపుడు క్రొత్తగాఁ దెలిసి కొనుట కేమియు లేదనియు వాదించువారిలో నాయన చేరఁడు. ఆయన శాస్త్రదృష్టిచే పూర్వాపర విచారణ చేయుచుండును.

కావున మౌలానా వ్యాఖ్యానములు కేవల ప్రకరణార్థమునే కాక, ఆయా గ్రంథముల పరమార్థమునుగూడఁ బరామృశించు చుండును. ఇస్లాము ధర్మవృక్షమున కిది మూలమనియు, నివి యాకులుఁ, గొమ్మలు ననియు నాయన వేర్పఱచి చూపు చుండును. మన మీ యంశముల మనమున నిడికొన్నచో నిస్లామును గూర్చియు, నితర ధర్మములఁ గూర్చియు మౌలానా చేయు వ్యాఖ్యానములు మన కిట్టె యవగతము లగును.

ఆయన కొరానుకు వ్యాఖ్యానమును, దర్జుమాయు రచించి, యా మహాగ్రంథమునకు "తర్జుమానల్ కొరాఁ" అని పేరిడెను. తన వ్యాఖ్యాన పద్ధతిని దెలుపుచు నాగ్రంథ మున కాయన భూమికను రచించెను. సప్రమాణమగు నీగ్రంథ రచనమున కొక గాథ యున్నది. దాని నిట వివరించుట యప్రస్తుతముగాదు. మౌలానా ఆజాదు రాంచిలో నిర్బంధా వాసమందున్నపుడా గ్రంథమున మూడింట రెండుభాగములు రచించెను. మూడవ భాగము రచించుచుండఁగా డెప్యూటీ కమీషనరు, అలవాటుచొప్పున 'సోదా' చేయవచ్చి, యచట దొరకిన వ్రాఁత కాగితములెల్లఁ గొంపోయి, భారత ప్రభుత్వ పర మొనర్చెను. చెఱవీడి వచ్చినపిమ్మట మౌలానా కాగ్రంథ మును తిరిగి యీయరైరి. కీర్తిశేషులగు సింహా ప్రభువు ద్వారమున నాయన భారత ప్రభుత్వమునకు విన్నప మంపి కొనెను. బీహారు ప్రభుత్వము నడిగినచో నది లభించునని భారత ప్రభుత్వము చెప్పినమీఁదట మౌలానా బీహారు ప్రభు త్వము నడిగెను. అంతట నా ప్రభుత్వము సగము కాలిపోయి, చెల్లాచెదరైన గ్రంథమును మౌలానా కొసఁగెను. దగ్ధావ శిష్టమగు నాగ్రంథము నిచ్చుచు బీహారు ప్రభుత్వము "మీ

యదృష్టము మంచిది కావున నిదియేని దక్కినది. సర్వము నగ్నికాహుంతి కావలసినదే" యని యొదార్చెను. పూర్వము కార్లయిలు వ్రాసిన 'పరాసు విప్లవ' మను మహాగ్రంథము జె. యస్. మిల్లు చెంతనుండఁగాఁ, దత్సేవకుఁ డద్దాని నగ్గిపా లొనర్చెను. తనవలన నెంతటి ఘోరనష్టము జరిగినదో యెఱుఁగని యా యవివేకి సేవకుని వంటిదే బీహారుప్రభుత్వము గూడ. నాఁడు కార్లయిలు వలెనే మాలానా ఆజాదుగూడ నాగ్రంథ మంతటిని దిరుగ రచించుకొనెను.

సాంఘిక రాజనైతిక విషయములందు మాలానాతో నైకమత్యము లేనివారుగూడ నాయన వ్యాఖ్యానమును దలఁదాల్తురు. అగాధము, సవిమర్శమునగు నాయన వైదుష్యమును భారత భూమియందు, నితర దేశములందుఁ ముస్లిము పండితులు మిగుల సన్మానింతురు.

ఇఁక నా గ్రంథమును గూర్చి యోజింతము. సకల ధర్మములకు మూల మొక్కటియే యనియుఁ, బ్రతిదేశమునను, బ్రతి ప్రజకుఁ గాలాంతరమున నొక్కొక యాచార్యుఁడుఁ, బ్రవక్తయు నవతరింతురనియు, వారు బోధించిన ప్రధాన సిద్ధాంతములందు భేదము గానరాదనియు మాలానా ముఖ్యముగాఁ బ్రతిపాదించెను. "ఈశ్వరప్రేషితులగు ప్రవక్తలెల్లరు సర్వకాలములందు, సర్వదేశములందు భక్తిని, కర్మాచరణమును లోకసంగ్రహార్థ ముపదేశించిరి. భక్తియననేకేశ్వరోపాసనము,కర్మమనఁగా సత్కర్మము నని యర్థము. దీనికి భిన్నమైన దేదియు సద్ధర్మ మనిపించుకొనదని కొరాను చెప్పుచున్నది. ఆ కొరానే (6.18) 'ఏకేశ్వరోపాసనము చేయుచుఁ గామక్రోధ వర్జితులగుఁడని ప్రజలకెల్లరకు బోధించుటకై

నేను ప్రవక్తనంపితి' ననియు, 'నన్నుఁగాక యితర దైవము లను భజింపవలదని చెప్పుటకే నేను ప్రవక్తల నంపుచుందు' ననియు వచించుచున్నది. ఈశ్వరుఁ డెల్లరకు మానవత్వము ననుగ్రహింపఁగా, వారు పెక్కు నామములుఁ, బెక్కు మతములు ధరించి, మానవైక్యమును భగ్నమొనర్చుచున్నారు. భిన్న వంశముల జన్మించిన మీరు భిన్ననామములు దాల్చి యొకరి నుండి యొకరు వేఱగుచున్నారు. ఒక దేశమున జన్మించిన వా రన్యదేశస్థులతోఁ బోరాడుచున్నారు. ఒక జాతివా రింకొక జాతివారితో డీకొనుచున్నారు. అట్లే యొక వర్ణమువా రింకొక వర్ణమును ద్వేషించి కలహించుచున్నారు. భాషలు గూడ మీలో భేదభావములకుఁ గారణమగుచున్నవి. ఈ భేదములు చాలక, ధనికులుఁ బేదలనియు, సేవకులు యజమానులనియుఁ, గులములలో నెక్కువతక్కువలనియు, బలవంతులు దుర్బలులనియు – నిట్లెన్నో పొరపులతో మీరు వేఁగుచున్నారు. ఇట్లు బహుభేదములచే, వైరములచే సదమదమగుచుఁ, దెగిన ముత్తెపుఁబేఁటలోని ముత్తెములట్లు చెదరియున్న మానవులందఱను మరల గుదిగ్రుచ్చి, యేకోదరుల నొనర్పఁజాలిన దివ్యసూత్ర మేకేశ్వరభజన మొక్కటియే. మీ కెన్ని భేదము లున్నవో యందఱు వేల్పు లుండరు గదా! మీ యందఱి సేవలందుకొను నీశ్వరుఁ డొక్కఁడే. ఆ స్వామిపాదముల చెంగటనే మీ రందఱు మోఁకరిల్లుదురు. ఆ తండ్రి పదకమలముల చెంతఁ బ్రణమిల్లినంతనే యైహికము లగు కులమత వర్ణజాతిభేదములెల్లఁ గరఁగిపోయి, మీ హృదయము లేకత్వము భజించును. అంతట నీ భూమండలమంతయు మీ దేశమే యనియు, మానవలోక మంతయు నొక్కతండ్రి

సంతానమనియు, నొక్క కుటుంబమనియు మీరు గ్రహింతు రని కొరాను బోధించుచున్నది.'' మౌలానా వ్యాఖ్యాన సరణి యిది.

మఱియు నిట్లు చెప్పుచున్నాఁడు :

''సకల వేదములు, మతములు, సకల ప్రవక్తలు ఋషులు కొరాను ప్రవచించిన నిత్యసత్యము కంటె నితర మును బ్రవచించుట లేదు. కొరాను కంఠోక్తిగా నేమను చున్నదో చూడుఁడు: '(నేను చెప్పిన) సత్యమును కాదందు వేని అందులకుఁ బూర్వగ్రంథ ప్రమాణమును పేర్కొనుము' (46.3). సకల మతములకు మూలములగు శాశ్వతసత్యము లకుఁ బరస్పరవిరోధము గానరాదని కొరాను చెప్పుచున్నది. ఇది నిక్కమగునేని సకల ధర్మములకు మూలమందున్న నిత్య సత్య మొక్కటియే.''

పిమ్మట మతమున కాయువుపట్టేదియో, పై తొడు గేదియో, మూలమేదియో, కొమ్మలేవియో యిట్లు తెలియఁ జెప్పుచున్నాఁడు: ''సకల ధర్మోపదేశములలో రెండు భాగము లున్నవని కొరాను చెప్పుచున్నది. శాశ్వతములగు మూల సిద్ధాంతము లొకభాగము; బాహ్యాలంకారములు రెండవ భాగము. ఇందు మొదటిది ప్రధానము; రెండవది అప్రధా నము. మొదటి దానిని భక్తియనియు, రెండవ దానిని సదా చారవిధులనియుఁ గొరాను పేర్కొన్నది. ఈ రెండవ దానికే షరా, నుసుక్, మిన్హాజ్ లను పేళ్లు గలవు. మొదటి రెండు పేళ్లకు మార్గము లనియు, మూడవదాని కాచారకాండ యనియు నర్థము. లోకమునందలి మతములకు మూల సిద్ధాం తములలో భేదములేదనియుఁ, గర్మకాండలోనే భేదమున్న

దనియుఁ గొరాను చెప్పుచున్నది. మూల మొక్కటియే; ఆకులు కొమ్మలలోనే భేదము. శరీరములందే కాని యాత్మ భేదము గానరాదు. మఱి యీ శరీరభేదము తప్పని దగుచున్నది. ఏల నందురా, మానవుల శ్రేయము కొఱకే మతము లేర్పడినను, ఆ మానవులు దేశకాలములచే భిన్నులుగా నుందురు. దేశకాలభేదముచే మానవజీవన వైఖరియు మాఱుచుండును. కావున బాహ్యమగు మతశరీరమున నా యా దేశకాలముల కుచితములగు లక్షణములు గోచరించుచుండును. కావుననే కొరాను 'ఓ మహర్షీ! ఒకొక్క ప్రజకొక్కొక కర్మకాండను విధించితిని. ఆకారణమునవారు తమలోఁ దాము పోరాడుకొనరాదు' (22.67) అనుచున్నది. పిమ్మట మతమునకుఁ బ్రాణభూతమేదియో కొరాను దెలిపి, మానవులు శ్రేయము నెట్లు సాధింపవలెనో చెప్పుచున్నది. భక్తుఁడు దూర్పు మొగమై మ్రొక్కినను, పడమటిమొగమై మ్రొక్కినను నొక్కటియే. ఈశ్వరుఁ డొక్కఁడే యని యెఱిఁగి, సత్కార్మాచరణ మొనర్చుటయే ముఖ్యమని చెప్పి, పిమ్మట సత్కార్మాచరణము నిట్లు కొరాను వివరించుచున్నది:

పూర్వాభిముఖుఁడౌట పుణ్యమ్ముగాదు,
పడమటి మొగమౌటఁ బాపమ్మురాదు.
పరమేశు నెదనమ్మి, చరమదినమును నమ్మి
స్వర్గ్యాసులను, ధర్మసంహితను, దూతలను
నమ్ముకొను; మదియె పుణ్యమ్మునకుఁ బెనుదారి.
పరమేశపదభక్తి బంధుల, కనాథులకు,
అర్థులకు, దీనులకు, నధ్వగులకును, దాస

జనబంధము క్తికై సకలధనముల నిచ్చు
టదియె పున్నెముదారి యని యెఱుఁగు మోరి!
స్వామి పదదృఢభక్తి, సతతదానాసక్తి
కలిమిలేములయందుఁ గష్టసుఖములయందు
సమచిత్తుఁడై, ఓర్మి చాలఁగల్గినవాఁడు
చేసిన బాసలు చెల్లించుకొనువాఁడు
అతఁడే సద్భక్తుఁ, డతఁడె సత్యవ్రతుఁడు.'' (2.177)

(శ్రీ) ఏ. యూసుఫాలీ ఛందోబద్ధముగాఁ జేసిన తర్జుమా నే నిందుఁ గైకొంటిని. మౌలానా చేసిన తర్జుమాలో 'సంహిత' యనుచో 'సంహిత'లనియు, 'చేసినబాసలు చెల్లించుకొను వాఁడు' అనుచోట 'చేసిన శపథము నిలుపుకొనువాఁ'డనియు నున్నది.

భగవద్గీతలలో ద్వితీయాధ్యాయాంతమందున్న పందొమ్మిది శ్లోకములను గాని, ద్వాదశాధ్యాయమందలి భక్త లక్షణములను గాని, మోక్షానందషట్కమును గాని యీ కొరాను ప్రవచనముతోఁ బోల్చి చూచినచో మౌలానా వ్యాఖ్యయందలి తాత్పర్యము మన కవగతము కాఁగలదు.

మౌలానా యింకను ఇట్లు చెప్పుచున్నాఁడు :

''పిమ్మట నీ క్రింది మహావచనము నందలి ప్రత్యక్షర మును శ్రద్ధగా గమనింపుఁడు. 'మీలోఁ బ్రతియొక్కనికి (భిన్న మతస్థులకు) ఒక్కొక్కధర్మమును, మార్గము నుపదేశించితిని. ఈశ్వరుఁడు సంకల్పించినచో మిమ్మెల్లర నొక్కతీరున సృజించి యుండును (కర్మకాండలో భేదముండదనుట). మీ మీ విధుల నెట్లు నిర్వహింతురో పరీక్షించుటకే యీ భిన్నత్వము

సీశ్వరుఁడు గల్పించెను. కావున (ఈ భిన్నత్వమును విస్మరించి) యొకరిని మించి యొకరు సత్కార్మాచరణ మొనర్పుఁడు' (5.48). ఈశ్వరుఁడు కొరాను ననుగ్రహించు నాఁటికి భిన్న భిన్నమగు కర్మకాండ నాచరించుచు, నదియే ప్రధానధర్మ మని భ్రమపడుచు, ఇతర కర్మకాండ నాచరించువారికి ముక్తి లభింపదని యెంచుచుండిరి. అట్లు తలపోయుట ధర్మవిరుద్ధమని కొరాను పల్కుచున్నది. ఈశ్వరుఁ డొక్కఁడేయని నమ్మి, సత్కర్మనాచరించుటయే ప్రధాన మనియు, ఈ ధర్మము నే ప్రజయు గుర్తగొనఁజాలదనియుఁ గొరాను చెప్పును...దేశ కాలములను బట్టి ఆచారకాండ యెల్లపుడు మాఱుచుండును. ...సర్వజ్ఞుఁడగు నీశ్వరుఁ డీ యనేకత్వము నూరక కల్పింపఁడు. ఈ వేర్వేఱు కర్మకాండను వేర్వేఱు ప్రజలకు విధించెనని చెప్పెనేకాని వేర్వేఱు మతములకని కొరాను చెప్ప లేదు. ధర్మ మనునది యెల్లరకు నొక్కటియే కాని యందనేకత్వము, భిన్నత్వము నుండదు. మానవ స్వభావమును బట్టి బాహ్యమగు నీ యాచారకాండ భేదించుచుండుననియు, తమదియే సదాచారమని యెవరికివా రెంచుకొనుచు,నొరులుతమ్ముఁ గూర్చి యేమనియెంతురో గ్రహింపలేకున్నారనియుఁ గొరాను వాకొనుచున్నది. నీ మార్గము నీకు మంచిదైనట్లే ఎదిరిమార్గ మెదిరికి మంచిదై తోఁచును కావున సహనమొక్కటియే తారకము."

కొరానులో 21వ సురయందలి 92, 93, 94 సూక్తులు తదుపదేశ సారసంగ్రహములని మౌలానా వచించెను. కావున ఆసూక్తిత్రయము నిట నుదాహరింతును:

92. "(ప్రవక్తల ముఖమున మేముచేసిన యుపదేశ

మిని) 'మీ రందఱు నేక గర్భజాతులగు సోదరులు (మీలో భిన్నమతములు, భిన్నవంశములు లేవు); నే నొకఁడనే మిమ్మెల్లరఁ బోషించు నీశ్వరుఁడను; కావున నన్నే భజింపుఁడు' (ఇందు భేద మొనర్పకుఁడు)."

93. "ప్రజలు దమలో భేదములు కల్పించుకొని, యేకమగు ధర్మము ననేక శకలములుచేసిరి. తుద కందఱు మమ్మే పొందవలెను."

94. "కావున (ఇదియే సత్యమని స్మరింపుఁడు) ఎవఁడు పరమేశ్వరుని నమ్ముకొని పుణ్యమాచరించునో, వాని కర్మ వృథా పోదు. వాని పుణ్యకర్మలు మేము గణించుచు (ఉందుము)."

వీనిని మౌలానా యిట్లు వ్యాఖ్యానించెను: "కాలాంతరములం దవతరించిన ప్రవక్తలా యా ప్రజల కేమి యుపదేశించిరి? భిన్నజాతులకు వారు చేసిన యుపదేశ మేకమా, అనేకమా? 'మీరందఱు నేకగర్భజాతులగు సోదరులు, నే నొకఁడనే మిమ్మెల్లరఁ బోషించు నీశ్వరుఁడను; కావున నన్నే భజింపుఁ' డని 92 వ. సూక్తి కంఠోక్తిగాఁ బ్రవచించినది.

"ప్రజ లీ యుపదేశమును విస్మరించి, యేక మగు ధర్మము ననేకశకలము లొనర్చి, యనేక మతములను గల్పించుకొని యొండొరులకు దూరమైపోయిరి. ఏకత్వములను వీడి యనేకత్వము నాశ్రయించి, కూడి యుండుటకు మాఱుగా వేర్పాటు వేర్పాటని హుంకరింపఁ జొచ్చిరి. అయ్యుఁ దుద కందఱు నీశ్వరునే పొందుదురు. అపుడంతయుఁ దెలిసివచ్చును. ధర్మమును విస్మరించినవారి కేగతిపట్టునో విస్పష్టమగును.

"ఈశ్వరునకు స్వస్తియగుఁగాక! ఒక్క సూక్తిలోఁ గొరాను సకలార్థముల నద్భుత శక్తిచే సంగ్రహించినది. తర్కసహమగు సూత్రపరంపర యనఁదగునుగాని దానిని సూక్తి మాత్రముగా నెంచఁదగదు. చూడుఁడు: (1) మీ రెన్ని భేదములు గల్పించుకొన్నను మీ రందఱు సోదరు లనుట నిక్కము; (2) నేను గాక మీ కితర రక్షకులు లేరు; (3) మానవకోటియెల్లను ఏకోదరమై, తద్రక్షకుఁడు నొక్కఁడే యైనపుడు ఆస్వామి పూజాకలాపము గూడ నొక్కటియే యగుట యొప్పును గదా, మఱి యది రెండు గానేల? మీ రందఱు నొక్కటియే, ఆతని వారే మీ రెల్లరు; కావున వానినే భజింపుఁడు. ఈ సూత్ర పరంపరయం దంతట నద్వైతమే కాని ద్వైతమెందును గన్పింపదు. 'కావున' యను మాట యీ వాదసరణిని సిద్ధాంతీకరించుచున్నది.

"సోదరాద్వైతము, ఈశ్వరాద్వైతము, మతధర్మా ద్వైతము-ఈ మూఁడు నీ యొక్క సూక్తిలో సంగ్రహింపఁ బడినవి. కొరాను చేసిన యుపదేశములలో నీ యద్వైత త్రయమే ప్రధానము, మూలభూతమై సర్వత్ర కానవచ్చును. మానవుల యనేకత్వమున నేకత్వ మున్నదని చెప్పుటయే సోదరాద్వైతము. దేశజాతి మతభాషాభేదము లెన్నియున్నను మీ రందఱు సోదరుల మనుట మఱువకుఁడు. ఈశ్వరుని మీ రే రూపముతో, నే నామముతో, నే యాలయమున, నెట్లు పూజించినను, ఎన్ని గుణములు కల్పించినను ఏకమగు ఆ సత్పదార్థ మనేకము కాఁబోదు. ఏకోదరులగు మీకు నీశ్వ రుఁడు నొక్కఁడే యగునుగాని పెక్కురుగారు. అట్లే యేకో దరులగు మీకు మతముగూడ నొక్కఁటియే యగునని ధర్మా

ద్వైతము బోధించుచున్నవి. కావున నేకేశ్వర భజనమే పుణ్యాకర్మాచరణము. ఇందు భేదములకుఁ దావు లేదు.

"మానవజాతు లెన్నివిధములఁ జీలిపోయినను అన్నిటికిఁ బుణ్యామార్గము, ముక్తియు నొక్కటియే యని 94 వ సూక్తి ప్రవచించినది. ఈశ్వరభక్తియు, పుణ్యాచరణము-నివి సార్వకాలికములని కొరాను చెప్పుచున్నది. ఈశ్వరుని నమ్మికొని, పుణ్యాచరణము సల్పువాని కర్మశీలము వ్యర్థము గాదు; దానిచే నీశ్వరుఁడు సంప్రీతుఁడగును. ఈ సూక్తిలో 'ఎవఁడు' అను మాట ప్రధానము. 'మీరందఱు యూదులు కం'డని యూదులు, 'నాజరీయులుకం'డని నాజరీయులు చెప్పఁగాఁ, గొరాను, 'ఎవఁడు ఈశ్వరుని నమ్మి సత్కర్మలాచరించునో' యని చెప్పుచున్నది. ఈశ్వరభక్తుఁడై, పుణ్యము సల్పువాఁ డెవ్వఁడైనను వాని సత్కర్మ యూరకపోదు; ఫలించితీరును. ఇదియే పరమధర్మము. దీనికిఁ దిరుగులేదు. 'వాని భక్తిని, పుణ్యమును మేము పరిగణింతుము. దాని నెవ్వరును దుడిచివేయలేరు. లోకమెల్ల నది వ్యర్థమని యెంచిన నెంచుఁగాక. మా లెక్కలో నది శిలాక్షరమై వెలయుచుండును.' అతి ముఖ్యమగు నీ ప్రవచనము వ్యాఖ్యాతల యప్రస్తుతవాదముల పాలఁబడి యెట్లు చెడినదో వ్యాఖ్యాన గ్రంథములఁ బరికించినచోఁ దెల్లమగును."

మఱియొకచోఁ 'ప్రవక్తలపట్ల భేదబుద్ధి తగ'దను సూక్తిని మౌలానా యిట్లు వ్యాఖ్యానించెను: "ఈశ్వర భక్తులు ప్రవక్తల పట్లను, శ్రుతుల పట్లను భేదముఁ బాటింపక, అందఱను నమ్మి, దేనిని నిరాకరింపక మెలఁగవలెనని కొరాను చెప్పుచున్నది. 'సత్యము నెవ్వరేచట దర్శించినను

అది సత్యమే. దానిని విశ్వసింతు' నని యెంచి భక్తుఁడు చరింపవలెను."

మౌలానా చేసిన యింకొక వ్యాఖ్యానము నుదాహరించి దీనిని ముగింతును. మూలగ్రంథమును బట్టికొని ప్రాఁకులాడుచు, ధర్మమును తదాచరణమును వేఱుగా నెంచువారిని మౌలానా సహింపఁజాలఁడని యెంతును. ఈ వ్యాఖ్యను బరికింపుఁడు :

"యూదులు దామే పరమేశ్వరునకుఁ బ్రీతిపాత్రులమనియు, నీశ్వరుఁ డనుగ్రహించిన ధర్మమును దాము గుత్తగొంటిమనియుఁ జెప్పుచుందురు. యూదుల యీ మౌఢ్యమును కొరాను నిరాకరించినది. యూదులకు నరకప్రాప్తి లేదనియు, నొకవేళ నున్నచో నదియు నీశ్వరానుగ్రహమునకుఁ జిహ్నమే యనియు, నారకాగ్నిలోఁ దమ్ముఁ దప్పుల నొనర్చుట పరిశుద్ధి యొనర్చి స్వర్గమున కంపుటకే యనియు వారు చెప్పుచుందురు. నిస్సారములగు నీదంభోక్తులను గొరా నెట్లు ఖండించుచున్నదో చూడుఁడు : 'యూదులకు నరకాగ్నిదాహ ముండదనియు, యూదు లందఱు మోక్షార్హులనియు నెవరు చెప్పిరి? ఈశ్వరుఁడు యూదులకు దానపట్ట మొసఁగి మోక్ష పదమును గుత్తకిచ్చెనా? మీకడ నిందులకుఁ బ్రమాణమున్నదా? లేనిచో నీ యప్రమాణోక్తు లీశ్వరు నసత్యవాది నొనర్చునుగదా! ఇట్టి యీశ్వర ద్రోహము తగునా?' కొరాను చెప్పిన వచన మిదిగో : '(ముస్లిములు జ్ఞప్తియం దుంచుకొనుఁడు) మీకుఁ గాని, శ్రుతి ప్రామాణ్యము లున్న యితరులకుఁ గాని కోరినంత మాత్రమున ముక్తి చేకూరదు. (ఈశ్వ రాదేశ మిట్లున్నది:) పాపఫల మేరికేని అనుభవింపక తీఱదు. ఈశ్వరుని యాగ్రహము

నుండి మిమ్ము రక్షించువారు లేరు.' విషము దిన్నవారు యూదులేనియు, నితరులేనియుఁ జావక తీఱదు. యూదులకు, నితరులకుఁ గూడ క్షీరములు పుష్టినే యొసఁగును. అట్లే యన్ని మతములవారుఁ దమ తమ కర్మఫలము లనుభవించి తీఱుదురు.''

టెక్సాసులో కోహెన్ అనెడి యూదు ధర్మాచార్యుఁ డుండెను. ఆయన నెవరో యడిగిరఁట—''మీరు సేవించు ప్రజలలో యూదులు లేని కారణమేమి?''యని. ''నిజమే. యూదీయుఁ డొక్కఁడును లేఁడు. లేకున్న నేమి? ఇచటి ప్రజలను బాధించు రోగములకుఁ, గష్టములకు, లేమికి మతభేదములున్నవా?''యని కోహెన్ బదులు చెప్పెనఁట. నే నీ మాటలు మౌలానాకు జ్ఞప్తి సేయఁగా నాయన ''అవును, అదియే సరియైన వైఖరి'' యని హర్షించెను.

ఒక మతమువా రన్యమతస్థులపై దొరతన మొనర్చుట మౌలానాకు సమ్మతమా యను విషయము విచారింపవలసి యున్నది. 1922లో న్యాయస్థానమున మౌలానా చెప్పిన మాటలలో 'ఇస్లాము సామ్రాజ్యము' అను ప్రయోగము గన్పించుచున్నది. దీని యర్థము నాయన యిట్లు తేటతెల్లముగ వ్యాఖ్యానించెను: ''ఇస్లా మనఁగా సత్యమును నమ్మి, దాని ననువర్తించుటయే. ఈశ్వర విహితమైన ధర్మమును దప్పక చరించుటయే సకలమతసారమని కొరాను చెప్పుచున్నది. ధర్మ మనునది మానవులకే కాదు, సృష్టి కంతటికి వర్తించును.'' కావున నిస్లాము సామ్రాజ్యమనఁగా, మనోవాక్కాయముల నీశ్వరార్పిత మొనర్చినవారి సామ్రాజ్యమని యేర్పడుచున్నది. వీరినే బైబిలు ఈశ్వరుని ప్రభుతను, ధర్మమును నమ్మినవారని

వాకొనుచున్నది. ఈశ్వరునకు, ధర్మమునకుఁ దప్పిచ్చెడినవారిని జేరఁబిలుచుటయే యిస్లాము ధర్మము. అంతియేకాని ఇస్లా మనునది నూతన మతము కాదని మౌలానా మాటి మాటికిఁ జెప్పుచునేయుండును.

---

# 11. స్వభావలక్షణాదికము

పొడవై నిట్టనిలిచెడి నిండైన యా విగ్రహము, జ్ఞాన కళికలై మెఱయుచు భయభక్తుల నుప్పతిలఁజేయు నా కన్నులు- మౌలానాను గాంచినపుడెల్ల, మూర్తీభవించిన ఇస్లాము సంస్కృతి యననొప్పు హకీం అజ్మల్ ఖాన్, డాక్టరు అన్సారీ మున్నగు గంభీరాకారులు తలఁపునకు వచ్చుచుందురు. గౌరవము జనింపఁజేయు సభ్యతా సరసత్వములకుఁ దోడుగాఁ, జనవున కెడమీయని గంభీరానుభావ మొందు మౌలానాకుఁ గద్దు. కావునఁ బండ్లగంప కెగబడినట్లు వారును వీరు నెల్లపుడు మూఁగి, పీడగొల్పుచుండఁ, దమ కిష్టమున్నను లేకున్నను వారినెల్ల రంజింపఁజేయు నాయకశ్రేణిలో మౌలానా చేరఁడు. అగాధమగు నాయన పాండితికిఁ, దనివి తీఱని జిజ్ఞాసకు- ఒంటరిపాటున ధ్యానమగ్నుఁడై యుండు స్వభావ మొకటి తోడైనది. కావున జన సమూహములతోఁ గలసిమెలసి తిరుగుచు, వారి గోడు నాలించుచు, వారి నోదార్చుపని యాయనచేఁ గాదు. మఱి, హతభాగ్యులగు దీనులయెడ నాయనకు దయారసము లేదందమా? అట్లనఁ జాలదు. మొనమొన్ననే ఖాదీ మహోద్యమపు టాంతర్యమునుగూర్చి యాయన ప్రసంగించుచుండఁగా నెంత విన్నను తనివి దీఱదనిపించెను. ఆ నాఁటి ప్రసంగమునఁ "గలిమిలేముల మధ్య నేర్పడిన యఖాతమును పూడ్చని స్వారాజ్యము నిరర్థకము. అసంఖ్యాకులగు దీనజనులతో మన కైకీభావమును గూర్పఁగల సాధనము ఖాదీకంటె నితరము గన్పించదు. చిరకాలముగా మన మధిష్ఠించిన యున్నత పీఠమునుండి దిగిరావలయు నన్నను, అభాగ్యులగు మన సోదరులు స్వారాజ్య

సంపాదనమునకై మనతోఁగూడఁ గష్టించి స్వాతంత్ర్యా నందమును మనతోఁగూడఁ జూఱఁగొనవలయునన్నను, వారందఱు మేలుకొని మనతో లేచినిలువవలె నన్నను- ఈ వాంఛాసిద్ధి కందఱును ఖాదీ ధరించుటకంటె సాధన మొండు లేదు,'' అనుచు మౌలానా ఉద్బోధించెను. ఇంత సెప్పినను, ఏ పల్లెపట్టుననో రాట్నము ముందరఁ గూరుచుండి నూలు వడకుట యాయన స్వభావమునకుఁ బడదనియే యెంతును. ఇది యెఱుఁగనివాఁడు కాఁడాయన. నిజలోపముల నాయనవలె నెఱిఁగిన నాయకు లరుదు.

ఆయన బలము, దౌర్బల్యము నిందే కలదు. బుద్ధిజీవు లగు పండితుల స్వభావ మాయనది. ప్రతి విషయమునను సాధకబాధకములఁ దులదూచు నేర్పరియయ్యు, నాయన యొకపట్టున నే దిక్కునకును మ్రొగ్గనేరఁడు. ఆయనకున్న బుద్ధివైశద్యము కాంగ్రెసు శిబిరమునఁ బెక్కుమందికి లేదు. రాజనీతి తంత్రముల నాయనవలెఁ దేటతెల్లముగా వెలిఁగించి చూపెడి నేర్పు ఒరులకు రాదు. కాని, యాయన మనసున నేమి నిశ్చయించుకొనెనో తలుచుగాఁ దెలియఁబడదు. మోతీలాలు పండితునకు, మౌలానాకు గాఢమైత్రి కద్దు. స్వరాజ్యపక్ష మహాదశలో పండితుఁడు మౌలానా బుద్ధిబల నీతిబలములే తన కాదరువుగా నమ్మియుండెడివాఁడు. గాంధిజీ వాదమందలి ముఖ్యాంశమును మౌలానా యిట్టె పసికట్టి ''మహాత్మాజీ! మీరు చెప్పునది నా కర్థమైన'' దని తలుచుగాఁ బల్కెడివాఁడు. వెంటనే యా వృద్ధపండితుఁడు ''ఔనౌను. పాపము, మీ రన్నియు నిట్టె గ్రహింతు'' రని మధుర పరిహాసముచే మౌలానాను ముంచియెత్తినంతట

సందఱు విఱుగఁబడి నవ్వుకొనెడివారు.

ఆయన బలముగూడ నందే యున్నదంటిని, నిజమే. మౌలానాకు సాటిరాఁగల రాజ తంత్రజ్ఞులు కాంగ్రెసులోఁ గానరారు. మనసున నిశ్చయమేర్పడిన పిమ్మట నా విషయమును క్షుణ్ణముగా విశదీకరించి, సర్వతోముఖముగాఁ బరిశీలించి యాయనవలె వివరించు బుద్ధిపాటవ మితరుల కుండ నేరదు. కావుననే విషమఘట్టములం దెల్ల గాంధిజీ మౌలానా యేమి చెప్పునోయని చూచెడివాఁడు.

ప్రసక్తి గలిగినదిగాన గాంధిజీ మౌలానాల గాఢానురాగ బంధమెట్టిదో యించుక సూచింతును. సింధు రాష్ట్రమున మంత్రిమండలవరణ మెప్పుడును కొలుకరాని కొయ్యయే. 1939 లో నా చిక్కును విడఁదీయు భారము గాంధిజీదాఁక వచ్చెను. "నా బుద్ధికొక మార్గము తోఁచుచున్నది. కాని యిట్టిపట్టుల మీ సహజ ధర్మజ్ఞతయే నాకుఁ బ్రమాణము. ఈ విషయమున మీ తీర్పును మాఱువల్కక శిరసావహింతు" నని మౌలానా వచించెను. గాంధిజీ యంతట "అట్లుకాదు. ఇట్టి వ్యవహారములందు మీదియే తుదిమాట యనుకొంటిమి కదా. మీ తీర్పునకుఁ దలయొగ్గుఁడని (ఈ యుపసంఘమందున్న) వల్లభాయి రాజేంద్రబాబులతోఁ జెప్పుదు" నని పల్కఁగా, మౌలానా "నేను మీ తీర్పునే తలఁదాల్తు" నని పట్టుబట్టెను. కాదు కూడదని కొంత దవ్వట్లు సానురాగముగఁ బెనఁగిన మీఁదట మౌలానా యోటువడి, గాంధిజీయే గెలిచెను.

నేనొకతూరి మౌలానా నడిగితిని: "గాంధిజీతో మీకింతటి దృఢానుబంధ మెట్లేర్పడె"నని. ఆయన యిట్లు చెప్పెను:

"గాంధిజీ బుద్ధిబలము మాట యటులుండఁగా, నిష్కళంక మగు నా సత్యనిరతి నన్ను లోఁగొనెను. 1926 వఱకు నేను సంశయించుచునే యుంటినిగాని యపుడు 'యం గిండియా'లో గాంధిజీ వ్రాసిన వ్యాసమొకటి చదివితిని. కస్తూరిబాయి కెవరో కానుకనీయఁగా, దానినామె యాశ్రమాధికారి కిచ్చుట మఱచెనఁట. ఈ యల్పదోషమున కామెను గాంధిజీ నిందించినవిధముఁ జూచినంతట నాకుఁ దదాత్మోన్నతి తేట తెల్లమయ్యెను. 'సత్యవాది యన నీతఁడే. శత్రువులు గూడ నీయనను శంకింపలే'రనుకొంటిని. సత్యరక్షణాకై యీ మహాత్ముఁ డెంతకేనిఁ దెగించుఁగదా యని యక్కఁజ మందితిని."

కాంగ్రెసు వ్యవహారములలో మాలానా మాటకున్న చెల్లుబడి యితరులకు లేకపోవుట కిదియే కారణము గానోపు. కాంగ్రెసు సభ కాయన యధ్యక్షుఁడైనను, గాకున్నను ఈ చెల్లుబడి కెన్నఁడు లోపము గలుగలేదు. దైవము చల్లగాఁ జూచినన్నాళ్లు ముందుఁగూడ నట్టిలోపము గలుగఁబోదు.

ఇంతటి పలుకుబడియున్నను అధికారముఁ జేపట్టుట యాయనకు గిట్టదు. శాసనసభలకు స్వాతంత్ర్యము లభించుటకుఁ బూర్వమందును, బరమందును గూడ నా సభలలో నెందైన నాయన కోరినచోఁ గాంగ్రెసుపక్ష నాయకత్వ మిట్టె కరగత మయ్యెడిదే కాని, మాలానా యాజోలికిఁ బోలేదు. మోతీలాల్ పండితునకు, దేశబంధు దాసునకు మాలానా మాటమీఁదనే గుఱి. ఆయనతోఁ జెప్పనిదే ముఖ్యఘట్టము లందు వా రడుగుమోపెడివారు కారు. అట్లయ్యు వెనుక నుండి యాలోచన చెప్పుటయే కాని రంగస్థలము మీఁది

కెన్నఁడు నాయన వచ్చెడివాఁడు కాఁడు.

ఆయనకు గ్రంథములుఁ, దదవలోకనము నున్నచోఁ జాలును. అట్లు గ్రంథసంసార మగ్నుఁడై యున్నతఱి మౌలానా నిజస్వరూపము తెల్లమగును. స్మరణీయులు లోకమాన్య తిలక్ చెప్పుచుండెడివారు– తాము సరస్వతీ సేవకుఁ బాసి, మాతృదేశ సేవలోఁ బడితి మని. నిజమే. చెఱ వెలుపల నున్న కాలమంతయు దేశారాధనతోడనే సరిపోయెను గాని, లేకున్నచో 'వేద నిలయము', 'గీతా రహస్యము' వంటి వైదుష్య స్ఫోరక గ్రంథములు మఱి యెన్నేని వారు రచించి యుందురు. మౌలానా స్థితియు నట్టిదే యయ్యెను. తిలక్ మహాశయుఁడు భాషాతత్త్వ శాస్త్రమున నిధియని చాలమంది యెఱుఁగరు. ఆ శాస్త్రమున మౌలానాయు నంతటి పండితుఁడే. పాప మాయన కీ రోజులలోఁ బ్రాతర్భోజన వేళలందుఁ దక్క ఆ శాస్త్రకృషి కదను దొరకుటలేదు. ఒక్కొక్క శబ్దమును గైకొని, భారతదేశ భాషలలో దానికి సమానపదములను జెప్పుఁడని మౌలానా యడుగుచుండును. ఆ మాటలలో నేదేని క్రొత్తది చెవినిబడినంతనే యాయన మోము సంతోషముచే విప్పాఱుచుండును. గుజరాతీ వ్యవహారమందున్న 'తాజా కలం' అను మాటలను నే నొకసారి వాడితిని. అగుటకవి. పారసీమాటలే యయ్యు, నరబీ పారసీభాషలను పుడిసిలించిన యీ పండితుని చెవి నవి యెన్నఁడుఁ బడలేదు కాఁబోలు, ఆ మాటలను క్రొత్తగా వినుటచే నాయన సంతోషమును బట్టలేకపోయెను. పిమ్మట నా ప్రస్తావము వచ్చినపుడెల్ల మౌలానా నాతో "చూచితిరా, తాజా కలం అను ప్రయోగ మెంతచక్కఁగా నున్నదో! దానిని మనము

వాడుకొనవలె'' ననుచుండెడివాఁడు. కాంగ్రెసు కార్య నిర్వాహకు లెప్పుడును నీరసములు, నపుడపుడు పరుషములు నగు వాగ్వాదములతో విసివియుందురుగాన, భోజనావసరము లందు ఛలోక్తులు విసరుచు వినోదించుచుందురు. అట్టి వేళలందు, మౌలానా వివిధదేశములందు, వివిధకాలములం దెట్టి తినుబండములను వాడుకొనెడివారో- ఆయన కవి యెల్లఁ గొట్టిన పిండిగావున- నేకరువు పెట్టెడివాఁడు. ఆ ప్రసంగవశమున భాషాశాస్త్రచర్చ నెత్తికొని సభ్యులకు విజ్ఞానమును, వినోదమును గూర్చుట యాయన కలవాటు. ''చూచితిరా, మీ తమిళులకు 'టామరిండు' (చింతపండు)పైఁ బ్రీతి మిక్కుటము. ఆ శబ్ద మెట్లుపుట్టినదో మీకుఁ దెలియునా? చెప్పెదను వినుఁడు. స్పానిషుభాషలో దీనిని 'టామరిండో' యందురు. వా రామాట నరబీనుండి గ్రహించిరి. అరబ్బులు దీనిని 'తమారె హింద్' అందురు. తమా రనఁగా ఖర్జూరము. హిందూదేశమున ఖర్జూర వృక్షములు లేవు. ఖర్జూరపుఁ బండువంటిదే చింతపండుగావున దానికి అరబ్బులు హిందూదేశపు ఖర్జూరమని పేరిడిరి'' అనుచు మౌలానా వివరించి చెప్పుచుండును. సభ్యులలో నొకరు 'రిలిజియన్' (మతము) అను శబ్దమును వాడిరి. వెంటనే మౌలానా 'దీన్', 'మఝూబ్' అను నరబీపదముల భేదము నిట్లు వివరించెను: ''అరబీభాషలో మఝూబనఁగా మార్గము. పొరపడి దానిని మతమను నర్థమున వాడుచుందురు. మతమను నర్థమున 'దీన్' అను శబ్దము వాడుట యుక్తము. అవెస్తాభాషలో 'దినాయె' అను శబ్దమున్నది. దానికి ధర్మము, శాసనము, విధి యను నర్థములున్నవి. ఆ దినాయె శబ్దమే దీన్. ఈ శబ్దము

సంస్కృతమునఁ గూడ నుండియుండును. ధర్మశబ్దమునకు నిదియే యర్థముగావున, డినాయె ధర్మశబ్దములు రెండు నొక్కటియే యగునేమో................... కాలక్రమమున నీ శబ్దము లొకదేశమునుండి యింకొకదేశము నెట్లు ప్రవేశించునో చూచితిరా! సంస్కృతమున సన్న్యాస మను మాట యున్నదికదా. అది ప్రాఁత పారసీభాషలో ససాఁగా మాఱినది. అంతతో నది యాఁగలేదు. పారసీకమున ససాను నామకమగు రాజవంశమొకటి యుండెడిది. ఆ వంశమున మూలపురుషుఁడు తొలుత సన్యసించి, పిమ్మట రాజాయెనఁట. కావున నా వంశీయులు ససానులైరి. అది యేమికాలమో కాని రాజత్వ మేరికైన నిట్టె లభించెడిది. సంతానహీనుఁడైన రా జొకఁ డవసానకాలమున నేమి చెప్పెనో వింటిరా? తన మరణానంతరము కోటగుమ్మము తెఱవఁగనే ముందుగా నెదురైన వానిని సింహాసనమున నభిషేకింపవలసినదని చెప్పెనఁట!" ఇటుల మౌలానా వాక్ప్రవాహము వెల్లి విరియుచుండును.

మౌలానా ప్రాచ్యభాషాపాండితి యసదృశము. అరబీ పారసీభాష లాయనకు మోఁకాలిబంటి. మఱి, యాయన మాటలాడునపుడు సర్వ సులభము, పరిశుద్ధము నగు ఉరుదు నాశ్రయించును. ఆయన భాషించు ఉరుదుకే గాంధిజీ హిందూస్థానీ యని నామకరణమొనర్చెను. ఉచిత పద ప్రయోగమునకై మౌలానా తడవికొనఁబనిలేదు. ఆయన సంభాషణములందు ఉపమానము లూరక దొరలుచు, ఉద్దిష్టార్థము నిట్టె వెలిఁగించి చూపుచుండును. 1936 లో మే మొకతూఱి యలవోకగా మాటలాడుకొనుచుండ, మన

ప్రజాసామాన్యమునకు సాజమగు భక్తివిశ్వాసముల మాట నెవరో ప్రస్తావించిరి. నే నంతట "ఆ భక్తి విశ్వాసములే మనము నడపిన యుద్యమములకుఁ గొంతకొంత జయము గూర్చిన" వంటిని. అలవోకగా నే నన్న యీ మాటపై మౌలానా చేసినవ్యాఖ్యానము, చెప్పినది చెప్పిన ట్లిచట నుదాహరింప నేర్చినచో నెంత బాగుగానుండునో! వీనుల విందగు నా మహాబోధన విని తీరవలసినదే. "ఔను. అవి అంతపని చేసినవి. ఇప్పుడును చేయఁగలవు. కాని, యిందొక యిబ్బందిగలదు. బండితోలెడివాని ప్రమాదముచే నెడ్లబండి తలక్రిందాయె ననుకొనుఁడు. దానిచే బండివానికి, మఱి యొక రిద్దఱకు గాయములు తగులు, నంతియే. అట్టి ప్రమాదమే రైలుబండికిఁ బ్రాప్తించి, యది తలక్రిందులైనచో? వందల కొలఁది జనులకుఁ బ్రాణహానియు, నపార ద్రవ్యహానియుఁ దప్పదు. చూచితిరా, మత మా రైలుబండివంటిది. దానిని నడపువానికి మెలఁకువయు, నైపుణ్యము నేమాత్రమైనఁ గొఱవడెనా, ఇంతంత యనరాని నష్టము వాటిల్లును. మత ములు నేఁ డపాత్రులచేతులలోఁ బడుటచే నవి నాస్తిక ప్రాయములై చెడినవి. మనగతి యేమికానున్నదో?" ఆయన ధోరణి యిది.

ఆంగ్ల ప్రసంగము లాయన యంతగా నేరఁడుగాని యాయన గ్రంథభాండారమున నాంగ్లపరాసు మహాగ్రంథము లన్నియు నున్నవి. షేక్సుపియరు, షెల్లీ, వర్డ్సువర్తులవంటి యాంగ్లకవుల కావ్యము లాయనకు సుపరిచితములే. బైరను తన కభిమానకవియని మౌలానా నా కొకసారి తెలిపెను. "బైరనువంటి కవి యాంగ్లమున మఱిలేఁ"డని గెథే

(Goethe) చెప్పినమాటతో మాలానా యేకీభవించును. బైరను కవిత్వము మాట యటులుండ, గ్రీసు దేశ స్వాతంత్ర్యముకొఱ కాతఁడు నెఱపిన వీరకృత్యములును, ప్రజలకుఁ ద్రికరణస్వాతంత్ర్యము నర్థించి భావావిష్టుఁడై యాతఁడు చేసిన రచనలును, ఆతని విప్లావకప్రవృత్తియు మాలానాను ముగ్ధునొనర్చినవి.

గెథె, స్పియినోజా, రూసో, మార్క్సు, హావెలక్ ఎల్లిస్ మున్నగు మహనీయుల గ్రంథములును, వేదములు నుపనిషత్తులు, 'పీపు లా ఫాల్ నేషన్సు,' 'హిస్టోరియన్సు హిస్టరీ,' 'ఇంటర్నేషనల్ లైబ్రరీ ఆఫ్ ఫేమస్ లిటరేచర్' వంటి యుద్గ్రంథములెల్ల నాయన భాండారమున నున్నవి. తనివి సనని జిజ్ఞాసతో వేవర్లీ నవలలే కాదు, డ్యూమా హ్యూగోల నవలలన్నియు, నందును పరాసు విప్లవమునుగూర్చిన నవల లెల్ల నాయన చదివెను. టాల్స్టాయ్ రస్కిన్ల గ్రంథము లాయనచే బహువారపఠితములు. తత్త్వశాస్త్రము, నితి హాసము నన్నచో నాయనకుఁ బ్రాణమే. ఒకనాఁటి రైలు ప్రయాణములో నాయన న్యాయవైశేషిక దర్శనమును జదువుచుండఁగాఁ జూచితిని. ఇంచుకయుఁ దెలిపిలేని యీ రోజులలో నాయన మదాం జీన్ పాంపడర్‌ను గూర్చిన గ్రంథ మును గూడఁ జదువఁగల్గెను. ఆయన వ్రాఁతబల్ల కెదురుగా నున్న పుస్తకముల మంచెయందుఁ బువక్తను, మహా ఓమర్‌ను గూర్చిన గ్రంథములు గాననగును. అక్లే ప్లాబర్టు గ్రంథములును, వానిలో 'మదాం బొవరీ'యు నున్నవి! ఇఁక నరబీ పారసీ తురుష్క గ్రంథసంచయము మాట చెప్పెడి దేమి! వాని పేరులే మన మెఱుఁగము.

అంతులేని యుత్తర ప్రత్యుత్తరముల ద్వారమున నాయన బాహ్యలోక వ్యవహారములను గ్రహించుచుండును. కీ. శే. జగ్లుల్ పాషాతో నాయనకు జాబు జవాబులు నడచుచుండెడివి. ఫతేబే ఆయనకు గాఢస్నేహితుఁడు. ముస్తఫా కమల్ పాషాతో, నితర తురుష్క నాయకులతో నాయనకు సన్నిహితసంబంధము కద్దు. 1908 లో టర్కీయందుఁ బ్రవర్తిల్లిన విప్లవోద్యమ నాయకు లందఱు మౌలానాకు నెచ్చెలులు. వెనుకటి యూరపు యుద్ధమునాఁటి వఱకు నా తురుష్కనాయకులే యచటి పరిపాలనా భారము వహించియుండిరి. వారిలోఁ బార్లమెంటు సభాపతియగు అహమ్మదు రెడాయు, డాక్టరు సెలాహుద్దీను, ఎన్వరుపాషా, జవేదుబేలు మౌలానాతో జాబు జవాబులు నడపుచుండిరి. ఇరాక్ సంస్కర్తలలో మేటియగు టకీజదేతో నాయనకు మైత్రి గలదు.

తారతమ్యము లెఱిఁగినవాఁడు, సౌమ్య స్వభావుఁడు నయ్యు, నిరంతరము గ్రంథములే లోకముగా నొంటరిపాటులవడెను గావునఁ గొలఁది మందితోనే యీయన స్నేహము నెఱపెడివాఁడు. ప్రసంగ నిపుణుఁడయ్యు మౌనముగా నుండుటయే యీయన కలవాటు. ఈ కలిపికోలుతనము తక్కువగుటచేతనే యీయనను గూర్చి మాబోంట్ల కంతగాఁ దెలియదు. ఆయనకు నిరంతర ధూమపానమును, తేనీరును ప్రియమని మాత్రమే మే మెఱిఁగినది.

ఆయన నిరాడంబరుఁడు. ఆయన కచేరి చావడి యందును, మిత్రోపచార మందిర (Drawing room) మందును పుస్తకములకంటె నితరాలంకారము లుండవు.

"మీరు చెఱసాల కేగినపుడు ధూమపాన మెట్లుసాగినది?" అని నే నొకసారి యడుగఁగా మౌలానా యిట్లుచెప్పెను: "మంచి ప్రశ్న మడిగితిరి. 1921 లో ఆలిపూరు చెఱసాలకు నన్నుఁ గొంపోయినపుడు నా యొద్దఁ బది సిగరెట్లుమాత్ర ముండెను. నేను రెంటిని బీల్చి, తక్కినవాని నధికారుల కిచ్చివేసితిని. 'జెయిలులో మీకు దొరకవుకదా, వాని నిచ్చెదరేమి?' యని దేశబంధు దాసు నన్నుల్లసమాడెను. 'చెఱనుండి బైటఁ బడిన పిమ్మటనే వానితోఁ బని' యని బదులు పల్కితిని. పిమ్మటఁ గొలఁదికాలముననే వానిపై ధ్యాస నశించి పోయినది." మోతీలాల్ పండితుఁడు నిట్టివాఁడే. ఆయన యొకతూఱి "నేను భోగినైనమాట నిజమేకాని భోగలోలుఁ డను గాను. నే నిట్టి యీ భోగములను వదలుకొనఁగలను." అని వచించెను. డివాలెరా, సర్దారు వల్లభాయిపటేలు వంటి వారితో మౌలానాకుఁ బోలికలేదు. "మీకు ధూమపానము వంటి సామాన్య వ్యసనములుగూడ లేవు. ఇది వింతగా నున్నది" యని (శ్రీ) థామస్ ఒకపరి డివాలెరాతోఁ బల్కె నఁట. డివాలెరా యంతట "ఔను. మీ ఆంగ్లేయులే ఇందులకుఁ గారణము. న న్నొకసారి బంధించి, లింకాలన్ చెఱసాలకుఁ గొంపోయిరి. మీకు జ్ఞప్తియున్నదో, లేదోకాని నాకు మాత్ర మది మఱపునకు రాదు. నేను చెఱసాలలోఁ బ్రవేశింపఁబోవుచు వెంటనున్న పోలీసుతో నాకు సిగరెట్టు కాల్చవలెనని యున్నదంటిని. అతఁడు సమ్మతింపఁగా, నొక సిగరెట్టు ముట్టించితిని. ఆ సిగరెట్టు వంకఁ గన్గొనుచు 'ఈ బ్రిటిషువాండ్రు నన్నురికంబ మెక్కింతురేమో? ఆ పక్షమున నా కిదియే తుది సిగరెట్టు. దీని నెట్లు మఱవఁగలను? ఒకవేళ

నేను బ్రదికి మరల బయటఁబడినను సిగరెట్టు ముట్టనని ప్రతిజ్ఞ సేయుటయే దీనిని మఱవకుండుట కుపాయ' మనుకొంటిని. నాకుఁ జావు దప్పను తప్పినది; నాఁటి ప్రతిజ్ఞను నిలిపికొంటిని," అని చెప్పెనఁట. 1930 లో సర్దారు వల్లభాయిని మొదటి సారి నిర్బంధించినపుడు నిట్టిదే తటస్థించెను. ఆయన కురి కంబము లేదు సరికదా, ప్రాప్తించిన కారావాసమేనియు వడసారము మూడునెలలే. అట్లయ్యు, వెంటనున్న పోలీసు సిగరెట్టీయఁబోఁగా, వలదని సర్దారు నిరాకరించుటయే కాక, అది మొదలు మరలఁ బొగాకును ముట్టికొన్న పాపమునఁ బోలేదు. మౌలానా పదియేను నెలలు సిగరెట్టును మాని యుపవసించియుఁ, జెఱవీడి వచ్చినంతనే దానిని వెలిఁగించెను. పదపడి మీరటు చెఱసాలలో నున్నపుడు సిగరెట్టు నిషేధము లేదుగావున నాయనకు సిగరెట్టుతో వియోగమే లేదు.

మౌలానా పెందలకడనే మేలుకొని, వేళదప్పకుండఁ బనులన్నియుఁ జక్కఁబెట్టుకొనును. ధూమపాన మొక్కటియే యాయనకున్న వ్యసనము. నాటకాది వినోదము లాయనకు రుచింపవనుకొందును. ఊరేగింపులు, నుత్సవములు నాయనకు గిట్టవు. నడిరేయి విందుభోజనముల కెన్నఁడో కాని పోఁడు. సరసప్రసంగ నిపుణుఁడయ్యు, సామాన్యజనుల నుల్లూఁత లూగించు సుగుణమో, దుర్గుణమో యాయనకు లేదు. చర్చనీయాంశముల నిగ్గు తేల్చుటలో నాయన మేటి. కార్యోప సంఘ సమావేశము లాయన ప్రజ్ఞకు నికషోపలములు. సూటిగా, సులభముగా హృదయములఁ జొఱఁబాఱు ప్రసంగ నైపుణిచే శ్రోతల నట్టిట్టు సేయనేర్చినను జనసామాన్యమును రంజింపఁజేయుట మౌలానాకు సాజముగాదు.

# 12. మఱియొక దండయాత్ర

స్వస్వరూప ప్రకటనతోఁ, స్వపరిశీలనతోఁ గొన్నేండ్లు గడచెను. ఒక వత్సరములో నదిగో! స్వరాజ్యము- అది వచ్చుట కేమిచేయవలెనో ప్రజ లా మాట నిట్టె మఱచిరి. స్వరాజ్యము రాలేదేమి యనువారే కాని యాక్రతువును దామ యథావిధిగా నెఱవేర్పక పోయితిమనుకొనెడి వారు లేరు. ఒక్క సంవత్సరమువఱకు దీక్ష నెట్లో కొనసాగించిరి. పిమ్మటఁ జాలమంది యెవరి వృత్తులను వారు వెదకికొనుచుఁ బోయిరి. వృథాత్యాగములు చేసితిమని చాలమంది వగచిరి. అందఱికంటె బుద్ధిజీవనుల యసంతుష్టి మితిమీఱిపోయెను. నిర్మాణ కృషిచేయనిదే స్వరాజ్యసమరమునకు సన్నద్ధులము కాఁజాలమని గాంధిజీ యెంతచెప్పినను, వారి కా కృషిపై మనసు లగ్నముకాదయ్యెను. శాసనసభలలోఁ బ్రవేశించి క్రొత్త వ్యూహమును బన్నవలెనని వారు తొందరపడఁ జొచ్చిరి.

1923 జనవరిలో మౌలానా చెఱవీడి వచ్చుసరికి కాంగ్రెసులోఁ గుటుంబ కలహ మేర్పడినది. గాంధిజీ బంధనాగారమున కేగుచు, చౌరిచౌరా దుండగములవంటి హింసా ప్రవృత్తి దలయెత్తకుండఁ జేయుటకు నిర్మాణకృషి యొక్కటియే యుపాయమని చెప్పిపోయెను. ఆ కృషియే తారకమనియుఁ, బ్రజలు దానిని నెఱవేర్తురనియు నమ్మి గాంధిజీ యిట్లు కారాగృహప్రవేశము చేయఁగా, దేశమున రెండు కక్ష లేర్పడెను. అందు గాంధిజీ యుపదేశమును ముమ్మాటికి ననుసరింపఁగోరు 'స్థితరక్షకుల' (No-changers) దొక తెగ. దీనికి శ్రీ సి. రాజగోపాలాచార్యులు నాయకుఁడు.

సర్దారు పటేల్, బాబు రాజేంద్రప్రసాదు, డాక్టర్ అన్సారి వంటి వారీతెగలోఁ జేరిరి. 'పునఃపాకు' లనువారిది (**Pro-changers**) రెండవతెగ. కీర్తిశేషులగు మోతీలాలు పండితుఁడు, దేశబంధు దాసు, విఠల్‌భాయి పటేలు దీనికి నాయకులు. రాజనీతి ఫలింపవలెనన్నచో రాజనీతి తంత్రమే సాధనమని వీరి మతము. ద్వంద్వపరిపాలనమున సహకరింపవలెనను మితవాదులవలెఁ గాక సాహాయ్య నిరాకృతినే వీరును నామోదింతురు. కాని, శాసనసభలకు వెలివేయుట వీరికి సమ్మతముగాదు. కాంగ్రెసు ఈ శాసనసభల నాక్రమించి, ద్వంద్వపరిపాలనమును భగ్నము చేయవలెనందురు. గాంధిజీ మార్గము నీ విధముగా మార్చఁగోరుటచే వీరికిఁ బునఃపాకు లనుపేరు వచ్చెను. ఈ యుభయుల వాద ప్రతివాదములు కేవల శాస్త్రార్థములుగా సాగుచు, నొక్కొకపుడు ముదురు పాకమునఁ బడుచుండెను. మౌలానా యేపక్షమునఁ జేరునో యని యెదురుసూచుచుండఁగాఁ, జెయిలువీడి వచ్చినంతనే యాయన "రాజనీతి తంత్రములు వస్తుతః సమర్థములగునో, కావో పరిశీలింపఁ దగినవేకాని పూజామందిరములందు భద్రపఱుపవలసినవి కా" వనుచు నిజస్థితిని దెల్లమొనర్చెను. ఆయన కేవల వ్యావహారికదృష్టిచే సాధ్యాసాధ్య విచారణ గావించెను. గాంధిజీ యుపదేశించిన సాహాయ్య నిరాకరణము మౌలానాకుఁ బ్రియతమమేకాని, కాంగ్రెసునం దుభయ పక్షములు నిట్లు తగవులాడుకొనుచు నొండొరుల యత్నములు నిరర్థకము లొనర్చుచుండఁగా, నహింసయు, సాహాయ్య నిరాకృతియుఁ బనిసేయఁజాలవని వ్యవహారదక్షుఁడగు మౌలానా యిట్టె గ్రహించెను. తా నేపక్షమునను జేరక, ఉభయులకు,

నైక్యముగాకున్న, సామరస్యమేని ఘటింపఁ బూనుకొనెను. ఉభయుల విశ్వాసమునకుఁ బాత్రుఁడుగావున మౌలానా యీపనికెంతయు నర్హుఁడు. ఈ కార్యసాధనకై దీక్షవహించి, పలువురతో సంప్రతించుటకై మాటిమాటికి దీర్ఘప్రయాణము లొనర్చెను. ముస్లిములలో జమైతుల్ ఉలేమాల పక్ష మొకటి యున్నది. సాహాయ్యనిరాకరణ మారంభించిన దినములందే వీరు ప్రభుత్వముతో సహకరించుట పాపకృత్య మని యాంక్షవిధించిరి కావునఁ బ్రభుత్వ నిర్మితములగు శాసన సభలం దిపుడు కాంగ్రెసు ప్రవేశించుట స్వవచన వ్యాఘాత మగునని సందేహించుచుండిరి. కాంగ్రెసు మహాసభ గయలో సమావిష్టమైనపుడు వీ రా యాంక్షను బునరుద్ఘాటించిరి. ఈ యాంక్ష యట్లు నిలిచియుండఁగా సమాధానము గుదురుటకు వీలులేదు. ఆ పట్టును వారిచే విడిపించుటకై మౌలానా తన వాద కౌశలమును, ఉపాయశాలితను ధారవోసి తుదకుఁ గృతకృత్యుఁడయ్యెను.

15-9-23 న ఢిల్లీలో కాంగ్రెసు విశేష సమావేశము జరగెను. మౌలానాయే తత్సభాధ్యక్షత వహించెను. శాసన సభలలోఁ బ్రవేశింపఁగోరువారు వాని నాక్రమించి, యా సభలందే సాహాయ్య నిరాకరణము సాగించుట కనుమతింప వలెననియుఁ, దత్సభావిముఖులు నిర్మాణ కృషియందుఁ బ్రవర్తిల్లవలెననియు మౌలానా సూచించిన సమాధాన మార్గము నెల్లరు నామోదించిరి. ఈ విధముగా శాసన సభారంగమునఁ గాంగ్రెసు ప్రవేశము రూపందినది. ఇపుడు తలఁచికొన్నచో, మౌలానా ఆ సంకట సమయమున నెఱపిన రాజనీతి చాతుర్యమెంతయు నాశ్చర్యముఁ గూర్చును. "ఈ

శాసనసభాప్రవేశ మంతగా ఫలింపదని యెఱుఁగుదును కాని, భావినిగూర్చి నేను తలపోసితిని. కాంగ్రెసునందుఁ బలుకుబడి యున్న పెద్దలలోఁ జాలమంది మనస్సు లిట్లు శాసనసభలందు లగ్నమై యున్నవాయెను. అవలఁ బ్రత్యక్షచర్య కెట్టి యాస్కారమును లేదాయెను. ఈ స్థితిలో నీ శాసనసభా ప్రవేశము గొంత యుపకరించునుగదా యనుకొంటి'' నని మౌలానా నాతోఁ దన యభిప్రాయమును వివరించెను.

ఈ శాసనసభల మిడిమేలము లేకున్నచో నే మయ్యెడిదో, దేశమున హింసాప్రవృత్తి శమించినవెంటనే గాంధిజీ యారంభింపనున్న ప్రత్యక్షచర్య కిది విఘాతము గల్పించినదేమో- యనుచు నిపుడు తర్కించి ప్రయోజనము లేదు. మౌలానా చేసినపని యొకవిధముగా మంచిదే యయ్యెను. గాంధిజీ చెఱలో నుండఁగాఁ గాంగ్రెసు కుటుంబ కలహాము పాల్పడుటయుఁ, బ్రజలు ధైర్యముఁ గోల్పోవుటయు నను ననర్థములనుండి మౌలానా దేశమును రక్షించెననుట నిక్కము. అంతియేకాదు. గాంధిజీ యా పిమ్మట సాహాయ్య నిరాకరణము నొకవంక రక్షించుకొనుచునే, వ్యావహారిక మైన యీ సమాధానము నచ్చమైన హృదయైక్యముగా సమర్థించుటకుఁ గూడ మౌలానా చేసినపని దోహద మొనర్చినది.

పిమ్మట నాలీ సోదరు లేతెంచిరి. తొలుత నించుక సందేహించియుఁ దుదకు మౌలానాతో నేకీభవించిరి. 1924 లో గాంధిజీ చెఱవీడి వచ్చినంతనే కర్తవ్య నిశ్చయ మొనర్చుటయు సుకరమయ్యెను. ఇతరుల యభీష్టములను మాన్పించి, బల వంతముగా మనసుమార్పించుట నిరర్థకమని తేలిపోయెను.

శాసనసభాప్రవేశము సాహాయ్య నిరాకరణమునకు విరుద్ధమని గాంధిజీ నమ్మినవాడయ్యుఁ, 'బునఃపాకుల' కడ్డము పోవలదని 'స్థితరక్షకుల' కుపదేశించెను. ఏనాఁటికైన వారికే తెలిసి రాఁగలదని నమ్మి, పునఃపాకుల కోరికల కెల్ల గాంధిజీ తల యూఁపఁజొచ్చెను. "నేను వారిత్రోవ కడ్డమునిలువక, కాంగ్రెసు పేరిట నిర్మాణకర్మ దీక్షితుఁడ నగుటయే వారికి మేలుసేయుట. విద్యావంతులు నా యీపని నెంతవఱకుఁ గొనసాగనిత్తురో" యని గాంధిజీ వచించెను.

శాసనసభలలోఁ గాంగ్రెసు సభ్యులు మహోపన్యాసములతోఁ జిచ్చుబుడ్లను, మతాబులను వెలిఁగించి, బోలెఁడు సందడిచేసిరి. ప్రభుత్వమున కడుగడుగున నపజయములు వాటిల్లెను. ఇంత చేసినను మనము బలపడినజాడ గన్పించ లేదు. ఆ యేఁటి కా యేఁడు సభ్యు లవినీతి పాల్పడుటయు, మోతీలాల్ పండితుఁ డా సభ్యుల నియమోల్లంఘనమును గఠినముగా దండించుటయుఁ, దుద కాయనకే యా పని యంతయు నిస్సారమని విసువుజనించుటయుఁ, బ్రాణస్నేహితుఁడు, సయోద్ధయునగు దేశబంధు దాసు దివంగతుఁ డగుటయుఁ, బండితుఁడు నిస్సహాయుఁడు, హతాశుఁడు నగుటయుఁ దటస్థించెను.

ఇంతలో హిందూ ముస్లిముల పోరపులు నానాఁట వికమించి 1927 లో ముల్తాను బారెల్లీ నాగపూరు మున్నగు ప్రదేశముల దొమ్మిపోరులు చెలరేఁగెను. సఖ్యసంపాదన మునకై సభలు జరగెను; మంచి మంచి కార్యనిశ్చయములు చేసినను వానిపై లక్ష్యములేనివా రా నిశ్చయములను భంగించుటయు నేర్పడెను. గాంధిజీ సబర్మతిలో నేకాంతవాసము

సల్పుచుఁ, గార్యనిర్వాహక సంఘ సమావేశముల కెప్పుడో కాని వెళ్లుటలేదు. కాంగ్రెసు మహాసభల కేగినను ప్రతినిధుల నెచ్చరించుట యరుదైపోయెను. మదరాసు కాంగ్రెసు మహాసభయందు స్వాతంత్ర్యమే కాంగ్రెసు లక్ష్యమని మార్పు చేసినపుడుగూడ గాంధిజీ యచట లేరు. 1928 లో బర్డోలీ యందు సాగిన యనుపమాన సత్యాగ్రహమువంటి యుద్యమములను గాంధిజీ తాము వెనుకనుండి నడపుచుండిరి. గాంధిజీ పట్ల దృఢభక్తిగల వల్లభాయి పటేలు బర్డోలీ సత్యాగ్రహ సమర సేనాపతియై, గాంధిజీ యుపదేశానుసార మా సమరమును సాగించి, ప్రముక్కడిమూఁక చే వీరకృత్యముల నొనరింపఁ జేసెను. ప్రజల చిత్తవృత్తు లిట్టి యుద్యమములవలన మార్పు నెందుచుండునే కాని శాసన సభాకార్యముల జోలి యెవ్వరికిఁ బట్టదయ్యెను.

ఇంతలో సైమను కమీషన్ మన దేశమునకు వచ్చుననిరి. ఆ కమీషన్ రాకచే దేశమెల్ల మరలఁ గన్నుదెఱచెను. 1921 లో యువరాజాగమన బహిష్కారమువలెనే యీ కమీషన్ బహిష్కారముగూడ పరిపూర్ణ విజయమును జేపట్టెను. ఈ సందర్భముననే యొక పోలీసధికారి శ్రీ లాలా లజపత్ రాయలను గ్రూరముగా ఱొమ్ముపైఁ బ్రహరించుటచే నాయన మృతిజెందెను. ఈ క్రూరకృత్యముచే మన యువజనుల చిత్తవృత్తు లొక్కపెట్టునఁ దలక్రిందులుగా మాఱిపోయెను. పోలీసుల క్రూర దండప్రహరణములకు లక్నోలో జవహర్లాలు పండితగోవిందవల్లభపంతులు గుఱియైరి. నెహ్రూ పండితుఁడు 'ఆత్మకథ' యందు 'దండ ప్రహారానుభవము' లనుపేర నొక యధ్యాయము రచించెను.

"రక్తపిపాసచే శివమెత్తి, ద్వేషభీకరములై జేవురించిన యీ పోలీసుభటుల మొగములందు సానుభూతియు, జాలియు నేకోశమందును గానరావు. ఇటు మా ముఖములందును ఆ తరుణమున ద్వేషమే తాండవించుచుండె నేమో? మేము చాలవఱ కుదాసీనులమైయున్నను, మా చిత్తములందు శత్రువులపట్లఁ బ్రీతి నెలకొనకుండుటచే మా మొగముల సొంపు వేఱుగాఁ జెప్పనక్కఱలేదు." ఇట్లు సాగిన యీ రచన మఱువరానిది. బ్రిటిషు సామ్రాజ్య తత్త్వమన్నచో నెహ్రూ పండితుఁ డెంతగాఁ గంటగించుకొనునో యెఱుఁగని వారీ యధ్యాయమునేనియుఁ బఠింతురుగాక! ఇట్టి కటుతరాధ్యాయములీ గ్రంథమున నింక నెన్నియో యున్నవి. జవహర్లాలు పండితుని హృదయమున ద్వేషశల్యమిట్లు నాటుకొనుటకుఁ దోడుగా మోతీలాలు పండితునకుఁ గూడ శాసన సభా వ్యవహారముపై నసహ్యము జనించెను. మోతీలాల్ పండితుని యాధ్యక్షమునఁ గలకత్తాలో నడచిన కాంగ్రెసు మహాసభ బ్రిటిషు ప్రభుత్వమున కొకసంవత్సరము గడువొసఁగి, యీలోపల భారతదేశమునకు డొమినియన్ ప్రతిపత్తి నిచ్చినచో సరియే, లేకున్నచో సంపూర్ణ స్వాతంత్ర్యము నాడిచికొనుట తప్పదని హెచ్చరించెను. ఆ గడువుగూడ ముగియవచ్చెను. శాసనసభలందుఁ బ్రవేశించిన కాంగ్రెసు సభ్యు లందఱు నా సభలను విసర్జించి, వెలుపలికిరావలసినదని 1929 ఆగస్టునెలలోఁ గాంగ్రెసు కమిటీ యాదేశించెను. రాజప్రతినిధియగు ఇర్విను ప్రభువు అక్టోబరు నెలలో నొక ప్రకటన గావించెను. దానికి బదులుగాఁ గాంగ్రెసు కార్యనిర్వాహకులును, దేశమందలి యితర నాయకులును దమ యభి

మతము నిట్లు ప్రకటించిరి: "ఇర్విన్ ప్రభువు సూచించిన సభ ఇండియాకు డొమినియన్ ప్రతిపత్తి నొసఁగు రాజ్యాంగమును నిర్మించుటకు జరపవలెనేకాని, ఆ ప్రతిపత్తి నెప్పుడీయవలెనా యను విచారణకొఱకు జరపఁగూడదు. ఈ లోపల బ్రిటిషు ప్రభుత్వ హృదయము మాఱినట్లును, ఇండియాకు గౌరవ ప్రదమైన స్వాతంత్ర్య మొసఁగు నభిలాష ప్రభుత్వమున కున్న దని మాకు విశ్వాసము జనించునట్లును ప్రత్యక్షమగు సూచనలు గానరావలెను." ఈ ప్రకటనను విశదీకరించుచు గాంధిజీ మఱియొక ప్రకటన గావించెను. పిమ్మట బ్రిటిషు పార్లమెంటులో నీ విషయమున జరిగిన చర్చలోఁ బ్రభుత్వ హృదయము మాఱిన సూచన గన్పింపదయ్యెను. పదపడి ఇర్విన్ ప్రభువు భారతనాయకులతో సంప్రతించెను. ఆ సంప్రతింపులు సమరసభావముతోనే సాగినవి కాని, ప్రయోజనము శూన్యమయ్యెను. ఆ యీ కారణములచే లాహోరు కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్యమే భారతదేశ లక్ష్యమనియు, అహింసాయుత శాసన ధిక్కారమే యీ లక్ష్య సిద్ధికి సాధనమనియుఁ గార్యనిశ్చయ మొనర్చెను. ఆ కాంగ్రెసు మహాసభ కధ్యక్షుఁడగు జవహర్లాలు పండితుఁడు ధర్మవీర పూరితమగు మహోపన్యాసమున- స్వాతంత్ర్యము సిద్ధించు దనుక భారతీయులు నడికట్టు సడల్పరాదని యుత్సాహమును బూరించెను.

దేశ మిట్టి విషమ ఘట్టమును మెట్టిన తఱి ముస్లిముల స్థితి యెటులున్నదందురా? ఆలీ సోదరులు 1924 నుండి క్రమ క్రమముగాఁ గాంగ్రెసుకు విముఖులై పోయిరి. లాహోరు సభకు వారేతెంచిన మాట నిజమే కాని, ముస్లిముల సహకారము

సంపాదింపకుండఁ గాంగ్రెసు శాసనోల్లంఘమునకుఁ గడంగినచో నది విపత్కారణమగునని గాంధిజీని హెచ్చరించుటకే వా రచటికి కరుగుదెంచిరి. డాక్టరు అన్సారీ కాంగ్రెసుతో నేకీభవించినను, ఈ పూనిక యెట్లు పరిణమించునో యను సంశయముచే ననుత్సాహియై కూరుచుండెను. కాంగ్రెసు పక్షీయులగు మఱికొందఱు ముస్లిము నాయకులను నిరుత్సాహ మావహించెను. మౌలానా మాత్ర మట్టి సంశయముల కెడ మీయక, కాంగ్రెసు పూనికకు బుజమునొగ్గెను. ముస్లిము ప్రజానీకము కాంగ్రెసు సభాదేశమును పాలింపకపోదనియే యాయన నమ్మెను. ఆయన నమ్మినట్లుగనే ముస్లిము ప్రాంత మగు వాయవ్య రాష్ట్రము వేలకొలఁది మందిని చెఱసాల కర్పించుటయేకాక, చెప్పరాని కష్టములకు గుఱియైనది. తక్కిన రాష్ట్రముల ముస్లిములు నెఱపిన సహకారమేనియుఁ దక్కువది కాదు. పిమ్మట 1930 లో మౌలానాకు బంధనా గారము ప్రాప్తించినపు డాయన తాత్కాలిక కాంగ్రెసు సభాధ్యక్షుఁడుగా నుండెను గావున ఆ పదవిని డాక్టరు అన్సారీకి దత్తము చేయఁగా నాయన నిస్సందేహముగా నా భారమును మూపునఁ దాల్చెను.

1930–వ సంవత్సరపు దండయాత్ర 1921 నాఁటి దండయాత్రకు వీరరసమున నించుకయుఁ దీసిపోదు సరికదా, ప్రభుత్వ మెంతటి క్రూరదండనీతిని బ్రయోగించినను బ్రజ బహురూపమగు నోర్మితో ననేక కష్టనష్టములకుఁ దలయొగ్గిరి కావున నిదియే ప్రశస్తతరమని చెప్పనగును. అందనుక దూర దూరముగా నున్నవారుగూడ నీ దండయాత్రలోఁ బాల్గొనిరి. కర్షకలోకము తన సర్వస్వము నిందు ధారవోసెను. లోక

ప్రసిద్ధినందిన 'లవణ ప్రస్థానమును' గాంధిజీ కావించిన వెంబడినే వేలకు వేలు ప్రజలు నడుములుగట్టి ముందున కుఱికి, ధీరులై దండప్రహరణములకు తలలొగ్గిరి. వైరుల పాశవ దురాక్రమణ మునకు నారీమణులు పాల్పడిరి. కొందఱు ప్రాణములనే యర్పించిరి. నిరపరాధమగు ప్రజాకోటి నిట్లు సిగ్గుమాలి హింసించిన ప్రభుత్వమునకే తుదకు విసువు జనింపఁగా, ఇర్విన్ ప్రభు వా దారుణ హింసాకాండను విరమింపఁజేసెను. పిమ్మట గాంధి–యిర్విన్ సమాలోచనములు సాగుటయు, నిరువాగును దమతమ పూనికల నప్పటికిఁ గట్టి పెట్టుటయు, వైప్రాయి శాంతి ప్రియత్వమును లోకవిదితములయ్యెను.

ఉద్యమ విరమణానంతర వృత్తాంత మిచటఁ బ్రస్తుతము గాదు. జవహర్లాలు పండితుని 'ఆత్మకథ' యందును, డాక్టరు పట్టాభి సీతారామయ్య రచించిన 'కాంగ్రెసు చరిత్ర' యందును ఆ వివరములఁ గాంచవచ్చును. ఒండు రెండు విషయములను మాత్ర మిచటఁ బ్రస్తావింతును. ఇర్విన్, గాంధి యొడంబడికకుఁ బిమ్మట నడచిన కథవలనఁ, బ్రభుత్వమున కధికారమును వదలుకొను నిచ్ఛగాని, తదుద్యోగులకుఁ దమ దొరతనమును తగ్గించుకొని ప్రజలను సేవింపవలెనను నిచ్ఛగాని లేదని స్పష్ట మయ్యెను. అయ్యుఁ, గాంగ్రెసు నిర్వాహకులు 'రక్కొ సతాల్మి' (Patience of job) వహించి, యొడంబడికను బాటించుటయే కాక, లండన్ సభా (Round Table Conference) ప్రయోజనమును శంకించుచున్న గాంధిజీ నా సభ కేగుట కొడంబఱిచిరి. గాంధిజీ పయనమై యేగుటకు మున్నే కాంగ్రెసు కార్య నిర్వహాకులు మత వివాద పరిష్కార విషయమై తమ యభిప్రాయము నిట్లు తెలియఁజెప్పిరి: "భారత

ప్రజాక్షేమ దృష్టితోడనే యీ వివాదమును బరిష్కరింప వలెను. సిక్కులకు, ముస్లిములకుఁ, దదితరాల్ప సంఖ్యాక మతస్థులకు సమ్మతముగాని పరిష్కారమును భావిరాజ్యాంగమున నిబంధించుటకుఁ గాంగ్రెసు సమ్మతింపఁజాలదని యభయ మిచ్చుచున్నాము.'' ఇట్లు వచించి, నేఁటి స్థితిగతులనుబట్టి కేవల భారత ప్రజాక్షేమ దృష్టికిఁ, గేవల మతదృష్టికి మధ్యే మార్గముగాఁ గాంగ్రెసు తానొక పద్ధతిని రూపొందించెనని వారు ప్రకటించిరి.

పిమ్మట గాంధిజీ లండన్ సభ కేగుటయు, భారత క్షేమమును గాంక్షించు ముస్లిముల ప్రతినిధిగా డాక్టరు అన్సారీ నా సభకుఁ గొంపోవ యత్నించి విఫలుఁ డగుటయు, మత వివాద పరిష్కారమునకై గాంధిజీ చేసిన యత్నము ప్రభుత్వము సింగారించిన కూటమిచే భగ్నమగుటయు–ఆ కథ యంతయు నీ చరిత్రమునఁ బ్రస్తుతముగాదు. ఇచటి యాంగ్ల వణిక్ప్రతినిధియై లండన్ సభ కేగిన శ్రీ బెంథాల్ వ్రాసిన రహస్య పత్రమున నాంగ్ల ప్రభుత్వ కౌటిల్యమును, నీచాతి నీచమగు భేదతంత్రమును బట్టబయలయ్యెను. ''గాంధిజీ వట్టి చేతులతో నిండియా చేరి'' నందులకు శ్రీ బెంథాలు సంతోషమును పట్టలేఁడయ్యెను. ''ప్రభుత్వాభిమానులు రానున్న యెన్నికలందుఁ గాంగ్రెసును, లండన్ సభను భగ్నమొనర్పఁ గృతనిశ్చయులై''రఁట! ''ముస్లిములు ఐరోపీయులకు నమ్మిన స్నేహితులై, తమ ప్రకృత స్థితిచే సంతుష్టులై, మనతోఁ గలసిమెలసి యుందు''రఁట! ''ఇఁక ముస్లిములవలని భయము లేదు. అల్పసంఖ్యాకుల సమాఖ్యయుఁ, బ్రభుత్వ సాదర దృష్టియు సర్వమును సుసంపన్న మొనర్చెను. సంస్థానాధీశులుఁ,

దక్కిన యల్పసంఖ్యాకులుఁగూడ సంతుష్టులై''రఁట! ఇట్లు వ్రాసిన బెంథాలు సంతోషమునకు మేర లేదుకదా!

మత వివాద పరిష్కార విషయమున మౌలానా యభిప్రాయ మెట్టిదో తెలియుటకై యీ కథా సంగ్రహ మవసరమయ్యెను. భారత శ్రేయోభిలాషులలో నగ్రగణ్యుఁ డగు డాక్టరు అన్సారీని మృత్యువు దన పొట్ట నిడుకొనెను. మౌలానా వంటి కతిపయ ముస్లిము నాయకు లింకను గాంగ్రెసు నంటిపెట్టుకొనియుండిరి. బ్రిటిషు ప్రభుత్వము తాను వైదొలఁగి, ఉభయ మతస్థులను రాజీ పడనిచ్చినఁ గాని యీ మత వివాదము చక్కఁబడదని, గత వృత్తాంత మంతయుఁ బరిశీలించిన మౌలానాకు మనస్సున దృఢనిశ్చయ మేర్పడెను.

గాంధిజీ లండను సభనుండి తిరిగి వచ్చినంతనే కారాగార బద్ధుఁడగుటయు, వెల్లింగ్డను ప్రభుత్వము క్రూరదండ నీతి నవలంబించి వికట తాండవ మొనర్చుటయుఁ, బిమ్మట గాంధిజీ చెఱనుండి బయటఁ బడుటయు—ఈ కథ యంతయు నడచు చున్నంత కాలమును మౌలానా కాంగ్రెసు నంటిపెట్టుకొనియే యుండెను. పిమ్మట శాసన ధిక్కారమును విరమించుటకును, స్వరాజ్యపక్షమును బునరుద్ధరించుటకును గాంగ్రెసు నిశ్చయిం యించెను. అపుడు గాంధిజీ డాక్టరు అన్సారీపేర వ్రాసిన లేఖలో నిట్లు ప్రకటించెను: "శాసన సభల యుపయోగ మును గూర్చిన నా యభిప్రాయ మెల్లరు నెఱిఁగినదే కదా! శాసన ధిక్కారముపట్లఁ గారణాంతరములచే నాసక్తియు,

సమర్థతయు లేని కాంగ్రెసు పక్షీయులకు శాసన సభా ప్రవేశమున నమ్మకమున్నచో, నవశ్య మా పనిచేయుటకు వారికి స్వాతంత్ర్యమున్నది. అది వారి ధర్మముగూడ నగును. వా రట్లు ప్రవేశించి, యితరులతోఁ జేతులు గలిపి, కృతకృత్యులు గావచ్చును.”

---

# 13. నిర్మాణక్రియా కుశలత

ప్రభుత్వముచేసిన రాజ్యాంగ సంస్కరణముచే రాష్ట్రములకేమో స్వాతంత్ర్యము లభించుటతప్ప అధికముగా ఒరఁగినది లేదని కాంగ్రెసులో నందఱును భావించి, ఆ క్రొత్త రాజ్యాంగమును దిరస్కరింపవలెననుకొనిరి. అట్లయ్యుఁ దుదకుఁ గాంగ్రెసు కార్యనిర్వాహకులు శాసన సభలలోఁ దమ కధిక సంఖ్యాబలము లభించిన రాష్ట్రములందుఁ బ్రభుత్వమును జేపట్ట వచ్చునని నిశ్చయించిరి. అట్టి నిశ్చయ మొనర్చుటకుఁ గారణము లెవ్వియో వివరించుట యిటఁ బ్రస్తుతము కాదు.

ప్రభుత్వమును జేపట్టుటకు నిశ్చయించుచునే కాంగ్రెసు కార్యనిర్వాహకులు శాసన సభావ్యవహారపరిశీలనకై యుప సంఘము నొండు నియమించిరి. అందు నియుక్తులైనవారు మౌలానా అబుల్కలామాజాదు, బాబు రాజేంద్ర ప్రసాదు, సర్దారు వల్లభ్భాయ్ పటేలు – ఈ మువ్వురుఁగాఁకలు దీఱిన జగజెట్టులు, సచ్ఛీలురును. ఈ మువ్వురును గాంగ్రెసు సభాధిపతి పీఠము నెక్కినవారే. "ఈ మువ్వురిలో మొదటివారు కాంగ్రెసునకు ధర్మబల మంత్రశక్తి స్థానీయులు; రెండవవారు హృదయస్థానీయులు; మూడవవారు క్రూరముష్టి స్థానీయు"లనుచు గంథర్ అను నమెరికను పత్రికా లేఖకుఁడు వర్ణించెను. అమెరికనుల దృష్టికనుగుణమైన వర్ణనమిది. అమెరికా యూరపుల రాజతంత్రముల కలవాటుపడిన దృష్టి యిది. అహింసామూలకమని చెప్పికొనెడి రాజతంత్రము మనది; వారి తంత్ర మహింసామూలము. కావునఁ దదనురూపమైన యీవర్ణనము పటమున వ్రాసి చూపినట్లు చక్కఁగనే యున్నది; కాని యథార్థవర్ణన మనిపించుకొనదు. శాసన సభలందుఁ బ్రవేశించిన కాంగ్రెసు

సభ్యులు ప్రజల కిచ్చిన బాసలు వమ్ముగాకుండ రక్షించుటకును, గాంగ్రెసు మంత్రి మండలమునకుఁ దోడ్పడుటకును ఏర్పడిన యుపసంఘ మిది. కార్యదక్షతయు, సుగ్రీవాజ్ఞయు లేకున్నచో నీ వ్యవహారము చక్కఁగా సాగదు. ఈ ముప్వురు నీశ్వరుని మొగముఁజూచి, జననింద కేనియు నోర్చి, తమ ధర్మబలమును, పక్షపాత రాహిత్యమును, మెలఁకువను నెఱపి సాగింపఁదగిన వ్యవహారమిది. ఈ సుగుణసంపద యించుమించుగా నీ ముప్వురకు నున్నది. అపురూపమగు త్రికరణశుద్ధితో, సహకారబుద్ధితో నీ ముప్వురుఁ దమ కర్తవ్యమునకుఁ గడంగిరి. దేశవిస్తృతముగా నిర్వహింపఁదగిన యీ కార్యభారము నీ ముప్వురుఁ బంచికొనిరి. కొన్ని పనుల బాధ్యత ముప్వురిమీఁదను గలదు. అందు మౌలానా ఆజాదు సంస్తవనీయముగ నిర్వహించిన కార్యభారమును మాత్రము నేనిటఁ బ్రస్తావింతును.

మౌలానా ప్రధానముగా చింతనాశీలుఁడు, పండితుఁడు, మంత్రజ్ఞుఁడే కాని కర్మకౌశల మెఱుఁగఁడని కొందఱెంతురేమో? అట్లు కాదుసుఁడీ! 1926లోనో, 1927లోనో కలకత్తా నగరమున హిందూ ముస్లిముల మధ్య దొమ్మి పోరు సాగెను. ఆ దినములలో శాంతి రక్షణ సేయఁగోరువారు తమ కెప్పుడేమి మూఁడునో యని బెదరుచుఁ దిరుగుచుండ, మన మౌలానా యా మహానగరము నా చివరనుండి యీ చివరవఱకుఁ గలయఁ దిరుగుచు-నిచట హిందువుల సమాధానపఱచుచు, నచటఁ దనవారికి నచ్చఁ జెప్పుచుఁ గలహాగ్ని నెచటి దచ్చటనే చల్లార్చుచు నిర్భయముగ సంచరించుట నెట్లు మఱవఁగలము? "హిందూజన బాహుళ్యముగల వీథులకు దూరపువీథుల

నుండి ముస్లిము కుట్టుపనివాండ్రు జీవనోపాధికై వచ్చుచుం డుట కద్దు. అట్టి దర్జీల నఱువదిమంది నొక హిందూగృహస్థు తన యింటిలో దాఁచి కాపాడుచుండెను. దొమ్మిలాటలు రేఁగుచున్న వీధులగుండఁ దమ యిండ్ల కేగుటకు వారు భయ పడుచుండిరి. నే నా గృహస్థుచేసిన మేలును గొనియాడి, ఆ దర్జీల నందఱను లారీలలో నెక్కించి, యిండ్లకుఁ జేర్చితిని. ముస్లిము పేఁటలలో హిందువుల యవస్థయు నిట్లే యున్నది. ఒక ముస్లిము గేస్తు పదుమూవురు హిందువులకు (వీరిలో నిరు వురు స్త్రీలు) ఆశ్రయ మొసఁగెను. ఆ నడిరేయి వారి నిండ్లకుఁ జేర్చుటకు గుఱ్ఱపుబండ్లుగాని, మోటార్లుగాని దొరకవయ్యెను. నే నపుడు పురపాలక భవనమునకు టెలిఫోను వార్త నంపి, మోటారుకారును దెప్పించికొని, యా హిందువుల నా కారులో నిండ్లకుఁ జేర్చితిని. మూఁడు పవళ్లు, మూఁడు రేలు నాకిటు లొకటే త్రిప్పటయైపోయినది. ఒక నాఁటి యర్ధరాత్రమున అసన్సాల్ నుండి నా కొక చీటి వచ్చినది. అటనుండి కొందఱు కలకత్తాలో నొక ప్రదేశమునకు బయలుదేఱి వచ్చి రెండు నాళ్లయినదఁట. వారు చేరిన వర్తమానము లేఁదట. నేను వారిని గావించి పట్టుకొని, తద్బంధువులకు వారి క్షేమవార్తనంపి, పిమ్మట వారి యిండ్ల కంపించితిని'' అనుచు మౌలానా నాకప్పటి వృత్తాంత మంతయు వినిపించెను.

వెనుకటి యధ్యాయములందే చెప్పవలసిన యీ వృత్తాంతమును, మౌలానా కార్యకౌశలమును వర్ణించుటకై యిచట నుటంకించితిని. ఇతర ప్రదేశములం దపుడప్పుడు పొడముచువచ్చిన చిక్కుల నెన్నిటినో యిట్లే మౌలానా పరి ష్కరించుచు వచ్చెను. లక్నోలోఁ బొడమిన షియా సున్నీ

వివాదమును దీర్చుటకై ఆయన యెంతయేని శ్రమపడెను. ఆ వివాద మిప్పటికిని రగులుచునే యున్నది. ఏనాటికైన మౌలానా నాయే ఆ వివాదమునకుఁ దన పలుకుబడిచేఁ బరిష్కార మార్గము జూపెట్టఁగలవాఁడు.

మౌలానా సాధించిన ఘనకార్యములందెల్లఁ బ్రధానమైనదియు, లక్షలాది కర్షకులకు శాశ్వతమైన మేలు చేకూర్చినదియు నొకటి మిగిలియున్నది. బీహారుకర్షకుల కాయన చేసిన మహోపకార మింతయనరానిది. ప్రజలకుఁ గాంగ్రెసు చేసిన యెన్నిక బాసలలోఁ (Election Manifesto) గర్షకుల కష్టములఁ దీర్తుననుటయే ప్రధానమైనది. బీహారులోఁ గర్షకుల కష్టనివారణము దుష్కరముగాఁ గన్పించెను. ఒక వంకఁ గర్షకులకు జమీందారులకు, రెండవవంక నా యిరువురకుఁ బ్రభుత్వమునకు సమాధానము కుదిరినఁగాని యది సాధ్యముగాదు. 1937 అక్టోబరులో బీహారు జమీందారులు కాంగ్రెసు నేతలతో సంప్రతించుటకు రాయబారమంపిరి. ఆ రాయబారులు రాజేంద్రప్రసాదబాబును దర్శించిరి. కర్షకులకు, జమీందారులకు రాజీ కుదుర్చుటకు మౌలానా ఆజాదు తగినవాఁడని రాజేంద్రబాబు చెప్పఁగా నా రాయబారులు మౌలానాను కూడ దర్శించిరి. మౌలానా వారి విన్నపమాలించి స్వయముగా నీ కార్యము సాధించుటకై పాట్నా నగరమున కేగెను. అచట మౌలానాయు, రాజేంద్రబాబును కొన్నాళ్లుండి సమాధానమునకై యత్నించిరి. ముఖ్యమైన నిశ్చయములు చేయవలసి వచ్చినపు డీ యిరువురు నచటి ముఖ్యమంత్రి తోడను, దదితరనాయకులతోడను మంతనము నడిపిరి. అచటఁ గర్షకశ్రేయమునకై పాటుబడు కాంగ్రెసు

నాయకులతో ముందుగా నీ యిరువురును సంప్రతించి, వారి కోరికల స్వరూపమును గ్రహించి, పిమ్మట జమీందారులతో సంప్రతించిరి. కర్షకులకోరిక లన్నిటికి జమీందారులు సమ్మతించుట పొసఁగదు కావున మౌలానా రాజేంద్రబాబులు తమ శక్తియంతయు ధారవోసి జమీందారుల పట్టును జాలవఱకు సడలింపఁగల్గిరి.

ఈ వ్యవహారమునఁ జాల సున్నితముగా బేరమాడి పరిష్కరింపఁ దగిన చిక్కులు కొన్నియున్నవి. మౌలానాయే నాతో నిట్లు చెప్పెను :

"కర్షకుని భారము తగ్గింపనిచో వానికి జీవనము గడవదను విషయమును ముందుగా జమీందార్లచే నంగీకరింపఁ జేసితిని. ఆ భార మెంతవఱకుఁ దగ్గింపవలెననునది తరువాతి ప్రశ్న. దానికిఁ గూడఁ బరిష్కారము గుదిరినపిమ్మట మిగిలినది - అవిధేయులగు కర్షకుల విషయమున నేమిచేయవలయుననునది. అట్టి కర్షకుల సర్వస్వమును హరించుట కప్పటి శాసనములం దవకాశమున్నను, జమీందారులు ముందుగనే న్యాయ్యదృష్టికిఁ గట్టువడిరి కావునఁ, గర్షకుని యింటిని, పొలమును దెగనమ్మి శిస్తు రాఁబట్టుకొందుమని యెట్లు చెప్పఁగలరు ? ఈ యొక్కయంశముపై యావద్వ్యవహారమును బెడిసిపోవునట్లు కన్పించెను. ముఖ్యమంత్రిచే శాసననిర్మాణమునకు వాయిదా వేయించి, 'మీరు దాక్షిణ్యము జూపుఁ' డని జమీందారుల నర్థించితిని. 'ఒక చేతితో నిచ్చినట్లే యిచ్చి, రెండవచేతితో మరలఁ గైకొనుట తగవును, ధర్మమును గా'దంటిని. తుదకు జమీందారు లుదారముగా వర్తించిరి. నయమార్గము జయించినది. శాసనము నిర్మిత

మగువలకు వేచియుండక కొందఱు జమీందారులు ముందు
గనే తమ మాటను దక్కించుకొనఁ జొచ్చిరి.''

కర్షకులకు సమకూడిన యార్థిక సదుపాయముగూడఁ
దక్కువైనదికాదు. వారీయవలసిన భూమి శిస్తు మొత్తము
మీఁద నాలుగవవంతు తగ్గినది. కొన్నిపట్ల నూటికి నలుబది
యేఁబదివంతుల చొప్పునఁగూడఁ దగ్గినది. కర్షకుఁడు శిస్తు
చెల్లించినచోఁ జాలును; వానికి భూమియందు సర్వాధికార
ములు సంక్రమించినవి. శిస్తు బాకీకొఱకు కర్షకుని యింటిని,
చరాస్తులను జప్తుచేసి, విక్రయింపఁగూడదు. బాకీకి సరిపడు
నంత పొలమును మాత్రమే విక్రయింపఁదగును. ఆ యమ్మట
కూడఁ బ్రభుత్వము సముచితమని నిర్ణయించిన ధరకే యమ్మ
వలెను. శిస్తుకొఱకు పొలమంతయు జప్తుచేయవలసి వచ్చు
నేని దాని కర్హమగు మూల్యము కర్షకునకు లభించు మార్గ
మేర్పడెను. కర్షకుఁడు తన భూమిని విక్రయింపవచ్చును;
మఱియొకరికి బదిలీచేయను వచ్చును. అటుల విక్రయించిన
భూమిపైఁ జెల్లింపవలసిన శిస్తునకుగాను కర్షకుఁడు కొంత
సొమ్ము జమీందారునకిచ్చి సరిపెట్టుకొనవచ్చును. భూమి
బదిలీలన్నిటికి జమీందారు సమ్మతింపవలెను. తాను సాగు
చేయు భూమిలో నిల్లు గట్టికొనుటకును, బావి ద్రవ్వికొనుట
కును, తోఁట నాటుటకును కర్షకున కధికారమేర్పడినది. శిస్తు
బాకీకొఱకు భూమినుండి కర్షకుని దొలఁగింపఁగూడదు. ఈ
విధముగాఁ గర్షకునకు భూస్వామినుండి విముక్తిలభించినది.
శిస్తు చెల్లించుట యొకటియే యాతఁడు చేయవలసినది—
ఆ శిస్తుకూడఁ దొల్లిటికంటెఁ దగ్గిపోయినది.

భూమిపై వచ్చు నాదాయముమీఁద రాఁబడి పన్ను

విధించుట యొకటి మిగిలియున్నది. ప్రభుత్వమునకు, జమీందారులకు నీ విషయమునం దొడంబడిక సాధింపవలెను. తొలుత నీ వ్యవహారము బీహారులోనే ప్రసక్తమైనది. మౌలానా రాజేంద్రబాబుల పుణ్యమాయని యీ వ్యవహారము గూడ సుపరిష్కృతమై, బీహారునందే కాదు, భారతదేశ మంతట శాసనపూర్వకముగా భూమ్యాదాయము మీఁద రాఁబడి పన్ను విధించుట సాధ్యమయ్యెను. జమీందారుల సమ్మతితో నిర్మితమైన యీ శాసనముచే సాలున కైదులక్షల చొప్పున మొత్తము నలుబది యేఁబదిలక్షల రూప్యముల భారము వారిపైఁ బడెను. కర్షకునకు లాభించిన శిస్తు తగ్గింపుచేఁ గూడ జమీందారులు సాలునకు రెండు మొదలు రెండున్నరకోట్ల రూప్యములు నష్టమును భరింపవలసిన వారైరి.

ఈ వివరములన్నిటిని రాజేంద్రప్రసాదు బాబు వలన వింటిని. ఈ వ్యవహారమున మౌలానా నిర్వహించిన పాత్రమును రాజేంద్రబా బిట్లు ప్రస్తుతించెను :

"కర్షకులతోడను, జమీందార్లతోడను నడపిన మంతనములందు మౌలానా తన బుద్ధిసూక్ష్మతను, ఎదిరి హృదయములఁ గరఁగించు నేర్పునెల్ల వినియోగించెను. బీహారునందలి భూమికవులు చట్టములు మౌలానా కపరిచితములగుటచేఁ దొలుతఁ గొంత చిక్కుగాఁ గన్పించినను మంతనములు సాగినకొలఁది ఆయన యా వ్యవహారమునెల్ల నాకళించుకొనుటయే కాక, చిక్కులన్నిటికి శీఘ్రముగఁ బరిష్కారములు సూచించుచు, నెదుటివారిని తన మార్గమున కిట్టె త్రిప్పికొననేర్చెను. తొలిసారి వెళ్లినపుడే కొలఁది దినములలోఁ జిక్కులన్నియుఁ జాలవఱకు వీడిపోయెను. మౌలానా సాహెబు

మరల నొకతూరి యేగి చాలదినము లచట నిలిచెను. ఇట్లు దీర్ఘముగా సంప్రతింపులు నడచిన పిమ్మట జమీందార్లకుఁ, గాంగ్రెసునకు సమాధానము గుదిరెను. ఈ మంతనములందుఁ గిసాను సభకు మేము ప్రమేయము గల్పింపలేదు. మేము సాధించినదానితో సంతుష్టిలేనిచో, మరల నాందోళన చేయుటకుఁ గిసానుసభకు స్వేచ్ఛయుండుటకై యీ సభ్యుల నిందుఁ జేర్పమైతిమి. జమీందారుల సమ్మతితో శాసన నిర్మాణము సుఖకరమగుననియు, వారిని శఠించి శాసనము చేసినదానికంటె నీ విధముగా కర్షకులకు సద్యఃఫల ముండు ననియు మే మూహించినట్లే జరగెను. మంత్రు లధికారమును దాల్చిన కొన్ని నెలలలోనే శాసనము నిర్మితమయ్యెను. వారు మంత్రిత్వమును జాలించుకొని పోవునప్పటికే రాష్ట్రమునం దధికభాగమున శిస్తు తగ్గించుపని పూర్తియై, తక్కినచోట్లఁ జాలవఱకు సాగిపోయెను. కర్షకజన కష్టనివారణార్థమై కాంగ్రెసు చేసిన సంకల్ప మొక్క బీహారురాష్ట్రమందే ఫలించిన దనుకొందును. కౌలుభూమి శాసనవిషయమునను, రాఁబడి పన్ను విషయమునను మంతనములు భగ్నముగా నున్న తఱియందెల్ల మౌలానా తన వాదపద్ధతిచేఁ, జాతుర్య ముచేఁ, బరహృదయారాధన నైపుణ్యముచే నా ముప్పుఁ దప్పించుచుండెడి వాఁడు."

———

# 14. సంకటస్థితి

కాంగ్రెసు ప్రజాక్షేమ కార్యములో నడ్చు భాగ్య మంతలోనే యంతరించినది. అప్పటికి సంవత్సరముపై కాలము నుండి వివిధదేశముల మధ్య రగులుచున్న రవరవలు క్రిందటి సెప్టెంబరులో నొక్కుమ్మడిగా గుప్పుమనియెను. రాష్ట్ర ప్రభుత్వముల కించుక స్వేచ్ఛలభించినదికదా, దీని వెంబడినే సంపూర్ణ స్వాతంత్ర్యము సాధింపఁగలమని నమ్మియుండ నా యాసలెల్ల నిట్టె తెల్లవాఱిపోయినవి. మన మింకను బర తంత్రులమే యనియు, మనమొక లెక్కలోనివారము గామనియు నీ యుద్ధమువలనఁ దేటతెల్లమైనది. ఒకవంక యుద్ధభేరి మ్రోఁగింపకమున్నే, మన శాసనసభ సమ్మతింప కుండనే భారతసైన్యములను ప్రభుత్వ మీజిప్టుకు, సింగపూరు నకుఁ దరలించెను. యుద్ధభేరి మ్రోఁగినంతనే మనదేశముగూడ యుద్ధ మగ్నమైనట్లు ప్రకటితమయ్యెను. ఇందులకు మన సమ్మతితో, సంప్రతింపులతోఁ బనిలేకపోయెను. మనము నోరు లేని వారమైతిమి. మన యిష్టానిష్టము లెవ్వరికిఁ గావలయును? ఇండియా రాజ్యాంగమును సవరించి, అప్పటికే కొన యూపిరి తోనున్న రాష్ట్ర స్వాతంత్ర్యమును ప్రభుత్వము హరించెను. రాష్ట్రముల నిత్యకృత్యములయందు ప్రేలిడుచు భారతప్రభుత్వ మాతుర శాసనాధికారమును **(Rule of ordinances)** సాగింపఁజొచ్చెను. ఈ యుత్పాతముల వైఖరిని గాంగ్రెసు కార్యనిర్వాహకులు గ్రహించి, రాష్ట్రాధికారులగు తమ మంత్రులందఱను ప్రభుత్వమును వీడి రావలసినదని యాదేశిం చిరి. ఈ యుద్ధచర్యలందుఁ ప్రభుత్వమునకుఁ దోడ్పడఁ జాల మని ప్రకటించిరి. పిమ్మటఁ గాంగ్రెసు కార్యనిర్వాహకులు

దమలోఁ దాము దీర్ఘ మంతనములు సలిపిరి. ప్రజాప్రభుత్వము పట్లను, సామ్రాజ్యభావము పట్లను బ్రిటిషు ప్రభుత్వ యుద్ధ లక్ష్యము లెట్టివో యాలక్ష్యము లిండియా కెటు లన్వయింప నున్నవో ప్రభుత్వము ప్రకటింపవలెను. అట్లు ప్రకటించిన పిమ్మటఁ గాంగ్రెసు కర్తవ్యనిశ్చయ మొనర్చునని కాంగ్రెసు కార్యనిర్వాహకులు ప్రభుత్వము నడిగిరి. ఆ పిమ్మట నేమి జరిగినదో లోకవ్యవహారమును గమనించుచున్న బ్రిటిషు వారికి, భారతీయులకుఁ గూడ విదితమే.

ఈ ప్రశ్న మడిగినందులకు బ్రిటిషు ప్రభుత్వము తొలుత నాక్షేపములకు దిగెను; పిమ్మటఁ దూలనాడెను; తుదకు భేదో పాయమును బూర్ణముగాఁ బ్రయోగించెను. గాంధిజీ మాత్రము మిత్రమండలికి వచ్చిన కడగండ్లకు జాలిపడెను. మిత్రమండలికి మాధర్మబల మండగానుండునని కాంగ్రెసు కార్యనిర్వాహ కులు నిర్నిబంధముగాఁ బ్రకటింపవలసినదని గాంధిజీ యుపదే శించెను. కాని, లోకజ్ఞులగు నా నిర్వాహకులు, గాంధిజీ మాటను మన్నించినచోఁ బ్రజలు హర్షింతురో, లేదో యని సంశయించిరి. ఇంతకుఁ బ్రభుత్వమును బాస యిమ్మని యడు గుట దోసముకాదు కదా? వెనుకటి యుద్ధకాలమున బ్రిటిషు (డొమినియన్లు) సామంతరాజ్యములు తమ స్వతంత్ర ప్రతి పత్తిని ముందుగాఁ బ్రకటింపవలెనని బ్రిటను నడిగినవి కావా? అధ్యక్షప్రసంగమున మౌలానా చెప్పినట్లు– "ఈ యుద్ధజ్వాల లందుఁ బ్రజ లాహుతి కానున్నారు కదా! ఆ యగ్నికుండమున నుఱికి బూదియగుటకు మున్ను 'ఈ యాహుతికిఁ గారణమేమి? దీనిచే మాకేమి ఫలము రానున్నది ?' అని యడుగుట దోషమా ? కనులు మూసికొని దుముకుటకు మనము లోక

జ్ఞాన శూన్యులమగు వెఱ్ఱి వాండ్రమా?''

కాంగ్రెసు కార్యనిర్వాహకులు సంశయించినట్లే జరగినది. బ్రిటిషు రాజనీతిజ్ఞులు చేసిన ప్రకటనలు చూడఁగా - లోకజ్ఞులగు మన నాయకులు ప్రభుత్వ యుద్ధ లక్ష్యములను బ్రకటింపవలసినదని ముందుగా నడుగుట మంచిపనియేయయ్యెనని తేలెను. గాంధిజీ భగ్నాశుఁడై వ్యథాభారమునఁ గ్రుంగిపోవు ప్రమాదము గూడ దానిచేఁ దప్పిపోయినది. బ్రిటను సదుద్దేశముతోడనే యుద్ధమున దిగినదని, పాపము, గాంధిజీ మొదట నమ్మెను గాని బ్రిటిషు ప్రభుత్వ మట్టి విశ్వాసమునకుఁ బాత్రముగాదని వెంటనే గ్రహించెను. యుద్ధారంభము నుండియుఁ గాంగ్రెసుచేసిన కార్యనిశ్చయములందు మహాలానా ముఖ్యపాత్ర ధరించెనని వేఱుగాఁ జెప్పఁ బనిలేదు.

యుద్ధ లక్ష్యములను బ్రకటింపవలసినదని ప్రభుత్వమును కాంగ్రెసు అడుగుటలోను, అట్లడిగినమీఁదటఁ బ్రభుత్వము చేసిన ప్రకటనల వైఖరిలోను ఏది గౌరవావహముగానున్నదో భావికాలమే నిర్ణయింపఁగలదు. లండను సభలో మత సామరస్యము గుదురకుండఁ బ్రభుత్వ మపుడు తన భేదోపాయముచేఁ జెడఁగొట్టినదిచాలక, మరల 1933 లో నైక్య సభయందుఁ జేతికందిన నైక్యమునుగూడ భగ్నమొనర్చెను. ఆ పిమ్మట మతవైరస్యము పెచ్చుపెరిగిపోయి యుద్ధ సంకటావస్థయందు వెఱ్ఱితలలు వేసెను. దేశమున సాధ్యమైనంతవట్టు ప్రజలను భిన్నవర్గములుగా, ముఠాలుగాఁ జీలఁదీసి, ఉన్నవియు లేనివియుఁ గష్టములను వారిచే నేకరువు పెట్టించి ప్రభుత్వము వారి నందఱఁ గూడఁగట్టెను. ఇట్లు వారిని సింగారించి "చూచితిరా? భారత ప్రజాబాహుళ్యము కాంగ్రెసు

పక్షమున లేదు'' అని లోకమునకుఁ జాటెను. ఈ కుతంత్ర ములకుఁ గాంగ్రెసు భీతిల్లక, "కానిండు. కాంగ్రెసు పక్షమందును, తదన్యపక్షమందు నున్న భారత ప్రజాబాహుళ్యము నానతిని కాంగ్రెసు శిరసావహించును. ఈ ప్రజల సమ్మతిని గ్రహించుటకు వయస్సునుగాని, మఱియొకటిని గాని ప్రమాణముగా నిర్ణయించి, రాజ్యాంగనిర్మాణ సభను నిర్మింపుఁడు. ఆ సభానిర్ణయములకుఁ గాంగ్రెసు దలయొగ్గు'' నని ప్రకటించెను. ముస్లిము లీగు కిది నచ్చలేదు. ఈ యల్ప సంఖ్యాకులను దన యిచ్చకు వచ్చినట్లు కలగాపులగ మొనర్చవలయునని లీగు అభిలషించెను.

ఇటీవలఁ గొన్ని నెలలుగా ముస్లిము లీగవలంబించుచున్న వైఖరి యందఱు నెఱిఁగినదే. రాజీకిఁ గాంగ్రెసు సిద్ధపడినపుడెల్ల భారత ముస్లిములందఱకుఁ దానే ప్రతినిధిననుచు లీగు విపరీతవాదమునకు దిగుచున్నది. కాంగ్రెసు మంత్రులు పరిపాలించినన్నాళ్లు వారిని దొలఁగఁద్రోయుటకు లీగు యత్నించినదికాదు; మంత్రులపై నేరములుమోపి, గవర్నర్ల రక్షణము గోరుటకేనియు దానికి సందు దొరకినదికాదు. మంత్రులు ప్రభుత్వమును వీడివచ్చుచున్నపుడు ముస్లిము లీగు సభ్యులు కొందఱు, అట్లు చేయవలదని మంత్రులను బ్రార్థించుటయు జరగినది. మంత్రు లధికారమును వీడివచ్చినంతనే, అదియేమి విడ్డూరమోకాని, అధిక సంఖ్యాకుల దౌరతనమునుండి ముస్లిములు బ్రదికి బైటఁబడినందులకు దైవమును బ్రార్థింపుఁడని లీగు ముస్లిములకు బోధింప నొడిగట్టినది. పిమ్మట గొంతెమ్మకోరికలు కోరసాగినది. వీని కన్నిటికిఁ దలమానికముగా నిపుడు భారతభూమిలో

ముస్లిముల భాగము ముస్లిములకుఁ బంచియిుండవని కోరఁ దొడఁగినది. కాంగ్రెసు మంత్రులయెడ నెన్నుచున్న నేరములు కాంగ్రెసు కేకాదు, మౌలానాకుఁగూడ వర్తించును. ఆ నేరము లన్నియు నిజమైనచో, కాంగ్రెసు శాసన సభావ్యవహారోప సంఘమందును, కార్యనిర్వాహకులందును మౌలానా తాను ముఖ్యుఁడై యుండియుఁ, గాంగ్రెసు మంత్రుల దుండగములు సాగనిచ్చి, తన మతస్థులకు ద్రోహ మొనర్చినవాఁడగును. ఇంతకంటె విడ్డూరపు నింద యుండఁబోదు. అట్టి విపరీత దోషారోపణమును మౌలానా శాంతముగాఁ బర్యాలోకన మొనర్చి, చెప్పికొన్న సమాధానమున ముఖ్యభాగము లిట నుదాహరింతును :

"కాంగ్రెసు మంత్రు లెనిమిది రాష్ట్రములందును దమంతఁ దా మధికారమును వదలికొని వచ్చినపిమ్మట లీగు సభాపతి ముస్లిముల కేమి యుపదేశించెనో చూడుఁడు! కాంగ్రెసు ప్రభుత్వపుఁ బీడ వదలిపోయినందులకు ముస్లిము లెల్లరు మసీదులకేగి దైవమును మ్రొక్కుకొనవలెనఁట! ఆ మంత్రు లేమి నేరములు చేసిరందు రేమో? అధికారముకంటె ధర్మమే యధికమని నమ్మి భారత స్వాతంత్ర్యముకొఱకుఁ, బరాధీనతచే నవసియున్న పూర్వ ఖండవాసు లందఱి స్వాతంత్ర్యముకొఱకు నధికారమును త్యజించుటయే వా రొనర్చిన మహాపరాధము. ఔరౌరా! ముస్లిములకిది యెంతటి నగుబాటు! కాంగ్రెసుతోఁ దమకు విరోధముండుఁగాక! ముస్లిములలో నే వర్గమేనియు నిట్టి నగుబాటుపని కెట్లు హర్షించునా యని నా కక్కజము గల్గుచున్నది.

"తమ హక్కులకొఱకుఁ, బ్రయోజనములకొఱకు

ముస్లిము లెట్లు పోరాడినను బోరాడుదురుగాక. అది వారి కుటుంబ కలహము. నేను దానిని గాదనను. కాని, ఇండియా స్వాతంత్ర్యమునకే భంగకరముకాఁదగిన యిట్టి పనికి ముస్లిములు గడంగఁదగునా? జిన్నాసాహెబు నాయకత్వముచే ముస్లిములు భారతస్వాతంత్ర్యమునకు విఘ్నకారు లయ్యెడి దురవస్థకుఁ బాల్పడుచున్నారు. ఇది యకార్యమని 1912 లోనే ముస్లిములను హెచ్చరించితిని. తిరుగ నిరువదియేడేండ్లకు ఆ హెచ్చరికయే చేయవలసివచ్చెఁగదా యని నాకు ఖేద మొదవుచున్నది.

"ఇంతకును జిన్నాసాహెబు ఈ 'కాంగ్రెసు పీడా విమోచనపుఁ బండుగ' చేసికొనుఁడని ముస్లిముల కుపదేశించిన దెందులకు? 'కాంగ్రెసు మంత్రుల క్రూర చేష్టితములకుఁ' దప్పి బైటఁబడినందులకు. ఆ క్రూరకార్యముల స్వభావముఁ, బరిమాణము నెట్టివన్నచో జిన్నాసాహెబే చెప్పుచున్నారు: 'ముస్లిములయెడ ద్రోహబుద్ధితోఁ గాంగ్రెసు మంత్రులు పరిపాలించుచు, శాసనసభలలో ముస్లిములను చులకనగావించి, వారి సంస్కృతిని నాశనముచేయ సమకట్టిరి. వారి సాంఘిక ధార్మిక వ్యవహారములందు జోక్యము గల్పించుకొని, వారి యర్థప్రాప్తిని హక్కులను మట్టిపాలొనర్చిరి.' జిన్నాసాహెబు చెప్పినదంతయు నిజమే యని మాటవరుస కంగీకరించితి మనుకొనుఁడు. ముస్లిముల సంస్కృతిని కాంగ్రెసు మంత్రులు పాడుచేసిరి. వారి మతమందు, సాంఘికవ్యవహారములందు జోక్యము చేసికొనుచుండిరి. వారి హక్కులను, ఆర్థికప్రయోజనములను మంటఁ గలుపుచుండిరి. ఈ ఘోరకర్మమంతయు నొకనాఁడు గాదు,

నాల్గునాళ్లుగాదు ; రెండేండ్ల యాఱునెలల పర్యంతము నిర్నిరామముగా సాగుచుండెనన్నచో దీని తాత్పర్య మేమి యని యోజింపుఁడు. ఎనిమిదికోట్ల యేఁబదిలక్షల ముస్లిము ప్రజ యీ ఘోరకర్మమునకుఁ బ్రతిక్రియ యేమేని గావించి నదా ? కావింప కేమి ! కాంగ్రెసు మంత్రులు బుద్ధిపూర్వక ముగా నధికారమును విసర్జింతురన్న యాసతో ముప్పది నెలలు వేచియుండెను. ఆ యాస ఫలించినంతనే ఈశ్వరుని పరమానుగ్రహమును స్మరించి చేతులెత్తి నమస్కరించినది. తొల్లిటి ఇజ్రాలీయులవలెఁ, దమకు విముక్తి గల్గినదని లీగు ముస్లిములు చాటఁ దొడఁగిరి. సెబాసు ! జిన్నాసాహెబు భారతముస్లిములకు లోకమున నెంతటి ఘనగౌరవముఁ గల్పించుచున్నాఁడో, కంటిరా ?

"భారత ముస్లిము లింతటి యధోగతిపాలైరని నే నంగీకరింపలేను. తమ దేశమునం దెనిమిది రాష్ట్రములలో మంత్రు లిట్లు తమ సంస్కృతిని, మతమును, బ్రయోజన ములను బూదిపా లొనర్చుచుండ నెనిమిదికోట్ల మంది ముస్లి ములు చేతులు ముడిచికొని కూరుచుండి, 'విమోచనదిన' మెపుడువచ్చునాయని మిన్నులు చూచుచు మిన్నకుందురని నేను నమ్మఁజాలను. భారతముస్లిముల కింతటి యభిమాన శూన్యత నాపాదించుటకంటె నవమానముండునా? అమృ తము పేరుగా వారిచే నిది విషముద్రాగించుట కాదా? ఇట్టి ప్రభుత్వ దౌష్ట్యమును బ్రజలు సహించుకాల మెన్నఁడో వెనుకఁబట్టినది. జిన్నాసాహెబు చెప్పిన యీ ఘోరముల నాచరించిన రాష్ట్రప్రభుత్వము, లా పిమ్మట నొక్క దినమైన బ్రదుకఁజాలునా? కాంగ్రెసు ప్రభుత్వము లన్నియు నిట్టి

ఘోరము లాచరించెనని జిన్నాసాహెబు చెప్పుచున్నాఁడు కదా! అన్నియునేల? ఒక్క రాష్ట్రప్రభుత్వమేనియు నిట్టి దౌష్ట్యము నవలంబించునేని జిన్నాసాహెబు 'విమోచనపుఁ బండుగ' చేసికొనుఁడని చెప్పెడివఱకు నూరకయుండుటకు భారతముస్లిములు దమ బాగోగులు దా మెఱుఁగని వారు కారు. అట్టి దౌరతనమును వా రొక్కత్రుటిలోఁ దుదముట్టించి యుందురు. భారతముస్లిముల రక్తమందు భీరుత్వ జడత్వములు మందునకైనఁ గానరావు. తమ 'ధార్మిక సాంఘిక వ్యవహారములందు జోక్యమును', 'తమ హక్కులకుఁ బ్రయోజనములకు నష్టము' వాటిల్లుచుండుటను జూచుచు ముప్పదిమాసముల పర్యంతము వారు చేతులు ముడిచికొని మిన్నకుండఁ జాలరు.

"ఈ సందర్భమున నింకొక విషయము గమనింపఁదగి యున్నది. కాంగ్రెసు మంత్రులు మత సామరస్యమును సాధించుటకై తమ యావచ్ఛక్తిని వినియోగింపరైరనియో, ఇదిగో, ఈ రాష్ట్రమున నీ సందర్భమున ముస్లిముల కన్యాయము జరగెననియో, ఈ రాష్ట్రప్రభుత్వ పరిపాలనమున నిట్టి దోసఁగు వాటిల్లెననియో జిన్నాసాహెబు ఆరోపించినచో నందుఁ గొంత 'సబ'బుండెడిది. అవి సత్యమగునో, కావో విచారించుటకు యోగ్యముగా నుండెడివి. అట్లు నిచ్చెనమెట్లు సగమెక్కి యూరకుండుట జిన్నాసాహెబు స్వభావముకాదు. 'కాంగ్రెసు మంత్రులు ముస్లిములకు ద్రోహము దలపెట్టి' రని ఆయన స్పష్టముగాఁ జెప్పుచున్నాఁడు. వారు ముస్లిము సంస్కృతిని 'నాశ' మొనర్చుచుండిరి; 'ధార్మిక సాంఘిక వ్యవహారములందు జోక్యము' చేసికొనుచునే యుండిరి; 'ముస్లి

ముల హక్కులను, ఆర్థిక ప్రయోజనములను మట్టి పాలొన ర్చుచునే యుండిరి. ఇది యాయన నిందారోపణ వైఖరి.

“నే నింతకుమున్నే చెప్పితిని; మరల చెప్పుచున్నాను; నా బాధ్యతను పూర్ణముగా నెఱిఁగియే చెప్పుచున్నాను. కాంగ్రెసు మంత్రులయెడ నారోపించిన యీ దోషము లన్నియు నిరాధారములని. కాంగ్రెసు మంత్రులు ‘ముస్లిము లకు ద్రోహముదలపెట్టి’ రనియు, ‘ముస్లిముల హక్కులను, ఆర్థిక ప్రయోజనములను, ధర్మమును నాశనమొనర్చి’రనియుఁ జెప్పుట యసత్యముల గుట్ట.

“ఈ నిందారోపణలందలి సత్యాసత్యములను దేల్చు మార్గములు లోకమున నెన్నియోయున్నవి. ఇట్లారోపించిన జిన్నాసాహెబు గాని, మఱియొకరుగాని అట్లు తేల్చుకొన వచ్చుఁ గదా! ఇది వారి ధర్మము కాదా? వా రందులకుఁ జాలరేని, తమ హక్కులపట్ల, వ్రాఁతలపట్ల సంయమ మవలం బించుట యుక్తమని విజ్ఞు లన్నచోఁ దప్పేమి?

“కాంగ్రెసు మంత్రుల యీ రెండేండ్ల పాలనమందు ముస్లిములు నాతోఁ జెప్పికొన్న తమ కష్టములపట్ల నావైఖరి యెట్టిదో వివరించుట కిది యదను గాదు. ముందుముం దెపు డేని వానిని గూర్చి సవిస్తరముగఁ దెలుపుదును. ఇపు డొక్క మాట మాత్రము చెప్పుదును. ఈ రెండేండ్లలో నాకు విన వచ్చిన కష్టములలో దేనినిగాని పూర్తిగా విచారించకుండ విడువలేదు. శాసనసభావ్యవహారోప సంఘుసభ్యులుఁ, గాంగ్రెసు కార్యనిర్వాహకులు, కాంగ్రెసు మంత్రులు, రాష్ట్రకాంగ్రెసు సంఘాధికారులు—వీరందఱు నే నట్టి పట్టుల నెంత నిక్కచ్చిగా, మోమోటము లేకుండ మెలఁగితినో యెఱుంగుదురు. ప్రతి

యారోపణమును గూర్చియు, మంత్రుల సమాధానములతో నేను దృష్టినందక, తత్సంబంధములగు వ్యవహారపత్రము లన్నియు స్వయముగాఁ బరిశీలించి చూచుచుంటిని.

"జిన్నాసాహెబు చేసిన నిందారోపణములందే లేశము సత్యమున్నను గాంగ్రెసు మంత్రుల పరిపాలనము నొక్కదిన మేని సాగనిచ్చెడివాఁడఁ గాను.

"జిన్నాసాహెబు ప్రభృతు లొకవేళ ముస్లిముల క్షేమమును గాంక్షించియే యీ పనులు చేయుచున్నచోఁ దద్విరుద్ధఫలమే ప్రాప్తించునని చెప్పుచున్నాను, నా మాట నమ్ముఁడు. ఇప్పటికేని వారీ మార్గమును వీడినచో భారత ముస్లిములకు శ్రేయముగూర్చినవా రగుదురు. అట్టి శ్రేయము వారికిఁ గోఁజవడియున్న మాట నిజము."

———

# 15. చుక్కాని పట్టు

కాంగ్రెసు మహాసభాధ్యక్షతను మౌలానా యభ్యర్థించెను. కాంగ్రెసు ప్రతినిధుల భారతీయతాభిమాన మేపాటిదో, హిందూముస్లిము లేకముగావలెనను వాంఛ యెంతటిదో–ఈ యభ్యర్థనముచేఁ దేలిపోవును. ఈ యపూర్వసంకటస్థితిలో నొకానొక ముస్లిము నాయకునకు భారత భాగ్యరక్షణ భారమును వా రప్పగింతురో లేదో చూచెద మనుకొనుచుండఁగనే మౌలానాకుఁ దలమునుకలుగా విజయాక్షతలు లభించెను. 1939 లో ఆయన వలదనెనుగాని లేనిచో నట్టి విజయమే లభించెడిది. మఱి యీ విషమతరుణమున లభించినవిజయమే విజయము. " 'శాసన సభావ్యవహారములు కట్టువడినవిగావున నే నిపుడు కాంగ్రెసు సభాధ్యక్షత నంగీకరించుట సుకరమైనది' అని మీరు లాహోరులో అంటిరఁట కదా, దాని భావ మేమి?"యని నేను మౌలానా నడిగితిని. ఆయన యిట్లు చెప్పెను: "మన మంత్రులను రాష్ట్రపరిపాలన భారము వదలి రండని కాంగ్రెసు కార్యనిర్వాహకుల మాదేశించితిమి. అది యెట్లు ఫలించునో చూడవలసిన యీ తరుణమున ఆ యాదేశ మిడిన వారిలో నొకఁడ నగు నన్ను కాంగ్రెసు సభాధ్యక్షుఁడవు గమ్మని కోరిరి. ఆ కోరిక నిపుడు త్రోసి పుచ్చినచోఁ, జేసిన పనికి ఫలమనుభవింప వెఱచి తప్పించుకొంటి నని లోకము నిందించును. అది యటులుండఁ, బ్రభుత్వము తన వైఖరిని మార్చుకొనకున్నచో, నేఁడు గాకున్న రేపేని మనము శాసనధిక్కార మొనర్పక తప్పదు గావున దానికి భయపడి పాఱిపోయితి నను నిందగూడ నాపైఁబడును. అదియును గాక, యెపుడేనియుఁ బ్రజల విశ్వాసమునకుఁ

బాత్రుఁడనగుట భాగ్యమే యగునుగాని యిట్టి సంకటస్థితిలో నన్నింతగా నమ్మిన ప్రజల కోరిక నెట్లు నిరాకరింప నేర్తును?''

రామఘుర్ కాంగ్రెసు సభావ్యవహారముల నాయన నడపిన తీరును, ఆయన చేసిన యధ్యక్ష ప్రసంగమును జూచిన మీఁదటఁ - బ్రజలు మౌలానాను వరించుట మంచిపనియే యయ్యెనని స్పష్టపడినది. అప్రస్తుతమును దడవక, ప్రస్తుతమును విడనాడక, హేతుబద్ధముగా నడచిన యీ ప్రసంగము విన ముచ్చట యయ్యెను. పాట్నాలోఁ కాంగ్రెసు కార్యనిర్వాహకు లొక్కటే కార్యనిశ్చయమును సంకల్పించినట్లే మౌలానాయుఁ దన ప్రసంగమున నొక్కటే ప్రస్తావమును క్షుణ్ణముగాఁ బరిశీలించి వదలెను. అందు అధిక ప్రసంగము గాని, పొల్లు మాటగాని వెదకినను గానరాదు.

మౌలానా వాద సమర్పణవైఖరిని, శైలీసౌభాగ్యమును జూడఁగోరు వా రా ప్రసంగపాఠమును బూర్ణముగాఁ బఠింపఁ గలరు కావున నందలి ముఖ్యాంశముల మాత్ర మిటఁ బరామర్శింతును. భారత కాంగ్రెసు మహాసభాధ్యక్షుని ప్రసంగ మేనియు నాంగ్లేయుల కంతగా ముఖ్యమనిపించదు గావున వారు దానిని బఠింపరు. ఆ ప్రసంగమును సంగ్రహాతిసంగ్రహముగా రాయిటరు విదేశముల కంపును. డెయిలీటెలిగ్రాపు, టయిమ్సువంటి వార్తా పత్రిక లా ప్రసంగములను నాల్గు ముక్కలతోఁ దేల్చివేయును. మౌలానా ప్రసంగమునకుఁ గూడ నాగతియే పట్టినది. అది యటులుండుఁగాక. ప్రసంగ సంగ్రహము నెత్తికొందును. 1936 మొదలుకొని కాంగ్రెసు కార్యనిశ్చయములం దొక క్రొత్త వైఖరి యేర్పడినదనియు, ఆ వైఖరిని దా నామోదించితి ననియు మౌలానా తన ప్రసం

గము నారంభించెను. 1912లో 'అల్ హిలాల్' పత్రిక నారంభించినప్పుడే మౌలానా విదేశ వ్యవహారముల ప్రాముఖ్యమును గూర్చి ప్రస్తావించెను. కావున 1936 లో కాంగ్రెసు సభాధ్యక్షుఁడగు జవాహర్లాలు పండితుఁడు అన్యదేశముల ప్రవృత్తిని గమనించి మనము మెలఁగవలెనని చేసిన హెచ్చరిక మౌలానా మనస్సునకు వచ్చెను. "1936 లో లక్నో కాంగ్రెసు సభ నూతన భావపథమును ద్రొక్కి, యావల్లోక వ్యవహారములను బరామర్శించి, నిజాభిమతమును స్పష్టముగాఁ జెప్ప నారంభించెను. అది మొదలుగా నట్టి యభిమత ప్రకటనము, దానిపైఁ గార్యనిశ్చయము నొనర్చుటయుఁ గాంగ్రెసు మహాసభల కానుమాయితిగా నేర్పడినది. ఆ రీతిగానే నేఁడు చేసిన కార్యనిశ్చయము లోకమునకు రెండు విషయములను దెలియఁజెప్పుచున్నది. మన మిపుడు నిస్సహాయులమై యున్నను ఇతరదేశములలో నేమి జరగుచున్నదో గమనించి నడచుకొనక తప్పదు. మన లక్ష్యము దెసకుఁ బురోగమించుచున్న యీ తరుణమున నొంటరిపాటు తగదు. నిత్యపరివర్తనశీలమగు నీ మానవలోకమున భిన్న దేశములుఁ, బ్రజలుఁ బరస్పరము సన్నిహితులైరి. ఒకరి తలఁపులతోఁ, జేఁతలతో నొకరికిఁ బనియుండదను కాలము గతించినది. దాని ఫలమును మానవలోకమంతయు ననుభవింపక తప్పదు. కావున భారతదేశము బాహ్యలోకమునుండి విడివడి, యొంటరిౖమె తన చిక్కులను బరిష్కరించుకొనఁజాలదు. బాహ్యలోకమందలి ఘటనల ఫలము మన మనుభవించుచున్నట్లే మనము సలుపు కార్యనిశ్చయములకు, మన స్థితిగతులకు ఫలము నితర దేశములవారు ననుభవింపవలసియున్నది. ఈ

యొఱుకయు, నీనమ్మకమే నేఁటి మన కార్యనిశ్చయములకుఁ బ్రేరకములైనవి. నాజిజము, ఫాసిజమువంటి యుద్యమములు ప్రజాప్రభుత్వములకు, వ్యష్టి సమష్టి స్వాతంత్ర్యమునకు గొడ్డలి పెట్టువంటివని యీ కార్యనిశ్చయములందు మనము స్పష్టముగాఁ జెప్పితిమి. నానాఁటికి బలపడుచున్న యీ యుద్యమములు లోకోపద్రవకరములని భారతప్రజల విశ్వాసము. ముంచుకొని వచ్చుచున్న యీ ప్రళయమునుండి ప్రజాప్రభుత్వములను, స్వాతంత్ర్యమును రక్షించుకొనఁ జూచు ప్రజలతో భారతీయులకు బుద్ధి పూర్వకము, హృదయపూర్వకము నగు నైక్యముగలదు.'' బ్రిటిషు సామ్రాజ్యభావమే మాకు విరోధి. బ్రిటిషు ప్రజలతో మాకు వైరములేదు. అట్లే నాజీజముగూడ మాకు విరోధియని మౌలానా స్పష్టపఱచెను.

''ఈ నాజిజము ఫాసిజములు లోకోపద్రవకరము లంటిని. వీనికంటెఁ బ్రాఁతది యగు నుపద్రవమొకటి యుండనే యున్నది. అది ప్రజల స్వాతంత్ర్యమునకు, శాంతజీవనమునకు వీనికంటె హానికరమని యేనాఁడో స్పష్టపడిపోయినది. దాని మూలముననే యీ క్రొత్త యుపద్రవములు పుట్టుకొని వచ్చినవి. అదియే బ్రిటిషు సామ్రాజ్యవాదము. ఈ క్రొత్త యుపద్రవములవలెఁగాక యది మాకు దగ్గఱి శత్రువు. అది మా యింటఁ జొచ్చి, మాతలపై నెక్కి కూరుచున్నది. కావుననే యూరపులోఁ బొడమిన క్రొత్త చిక్కులచే దాపురించిన యీ యుద్ధమున భారతభూమి పాల్గొనదని స్పష్టముగాఁ జెప్పితిమి. ఈ విషయమున మా యిచ్చవచ్చినట్లు కర్తవ్య నిశ్చయమొనర్చు స్వాతంత్ర్యము మాకు లేదు. మా కట్టి స్వేచ్ఛ లభించినపుడు కర్తవ్యనిశ్చయ మొనర్చికొనఁ జాలుదుము.

"నాజిజము, ఫాసిజము వర్ధిల్లుట ఇండియాకు గిట్టదు. బ్రిటిషు సామ్రాజ్యభావము వర్ధిల్లుట యంతకంటె గిట్టదు. ఇండియా యిప్పటికిని స్వాతంత్ర్యహీనమై యున్నదనఁగా, బ్రిటిషు సామ్రాజ్యభావ మెప్పటివలె వర్ధిల్లుచున్నదనియే యర్థము. ఈ స్థితిలో నిండియా యీ సామ్రాజ్య విజయము నకై చేఁజేత సాయముజేయదు. ఇది మన కార్యనిశ్చయము లందు ఉద్ఘాటించిన రెండవవిషయము. లక్నో మహాసభ నాఁటి నుండి యేఁటేఁట మన మీ కార్యనిశ్చయము లొనర్చుచునే యున్నాము. వీనికి 'యుద్ధ ప్రస్తావము'లని పేరు వచ్చినది. అంతియే కాదు.

"ఇచటఁ జర్చనీయాంశము బ్రిటిషు ప్రభుత్వమున కిష్టమున్నదా, లేదా? ఉన్నచో నా యిష్టమెంత పరిమాణ మున నున్నది యని కాదు. ఇండియా కీ హక్కు—తన భాగ్య మును దాను నిర్ణయించుకొను స్వాతంత్ర్య మున్నదా, లేదా? ఇదియే తేలవలసినది. ఇది తేలినచోఁ దక్కిన విషయము లన్నియు నిట్టె పరిష్కృతములగును. ఇండియా బ్రదుకంతయుఁ దీని మీఁదనే నిలిచియున్నది. మూలభిత్తివంటి యీ హక్కును తొలఁగించినచో భారత జాత్యభిమానమే కుప్పగూలిపోవును.

"యుద్ధమును గూర్చి మన మనస్సును విప్పి చెప్పితిమి. క్రిందటి యుద్ధము నాఁటివలెనే నేఁడును బ్రిటిషు సామ్రాజ్య భావము మా కనుల యెదుటఁ జెక్కుచెదరక నిలిచియున్నది. ఈ యుద్ధమున నుఱికి, దానికి విజయమును జేకూర్చుట మా వలనఁ గాదు. ఇందు చాటుమాటులు లేవు. అంతయుఁ దేట తెల్లముగానే యున్నది. బ్రిటిషు సామ్రాజ్యవృద్ధిని, బుష్టిని మనము సహింపము. ఈ పారతంత్ర్యయాతనను చేతులారఁ

బొడిగించుకొనలేము. ముమ్మాటికి మన మందుల కంగీకరింపము. వారితో మనము కలియుట కల్ల. మనదారి వేఱు.''
మఱియొక్క మాట:

''ఈ యుద్ధారంభమునుండియు బ్రిటిషు మంత్రులు తమ తొల్లిటి సామ్రాజ్యభావము లంతమందినవనియు, ధర్మమును, శాంతినే తా మిపుడు కోరుచుంటి మనియు ధర్మపన్నము లేకరువుపెట్టి లోకమును నమ్మింపఁజూచుచున్నారు. ఈ మాటలే నిక్కమగునేని భారతీయులకంటె నధికసంతోషమింకెవరికిఁ గలుగును ? ఈ కల్లమాట లెవ రెఱుఁగనివి ? యుద్ధమునకుఁ బూర్వమందువలెనే నేఁడును శాంతి ధర్మముల కడ్డముగా బ్రిటిషు సామ్రాజ్యము నిలిచియేయున్నది. ఆ మాటల కల్లనిజములు దేల్చునది భారతస్వాతంత్ర్య ప్రదానమొక్కటే. ఆ యొరపిడి జాతిపై నొరయుటయు, నివి కల్ల మాటలని తేల్చుటయు జరగిపోయినది.''

హిందూ ముస్లిముల నైక్యమును గూర్చి యీ ప్రసంగమున మౌలానా చెప్పినమాటలు శిలాక్షరములే. 1912లో 'అల్ హిలాల్' ప్రచురణ మారంభించిన నాఁటి నుండియు, హిందూ ముస్లిములను విడఁదీయు భేదనీతి నాయన ప్రతిఘటించుచునే యుండెను. దాని నీ ప్రసంగమునఁ బునరుద్ఘాటించెను :

''1912 నుండియు నీ విషయమున నా భావములు మాఱలేదు. ఈ మధ్య కాలమున నడచిన సకలవృత్తమును బర్యాలోచించి చూచితిని. నా కనులారఁగాంచిన దెల్ల మన సారఁ దలపోసికొంటిని. నేను కేవల సాక్షిభూతుఁడను గాక ఆ యీ ఘటనలందు భాగస్వామినై ప్రత్యంశమును సావధానముగఁ బరికించితిని. నా మనోనిశ్చయములను నేను గాదనఁ

జాలను. నాయంతస్స్వాశక్తి నోరదను నొక్కలేను. కావున 1912 నాఁటినుండి చెప్పిన మాటలనే నా వారికిఁ దిరిగి చెప్పు చున్నాను. ఇచటి తొమ్మిదికోట్ల ముస్లిములకు నేను చూపిన దాని కంటె నితరమార్గము లేదు.''

ముస్లిము లీ దేశమున నల్పసంఖ్యాలు గావున ప్రజా తంత్రాక రాజ్యాంగము వారికిఁ జెఱుపు గూర్చు నను వాదము నాయన యిట్లు పరామృశించెను:

''సంఖ్యచేఁ దక్కువయగు జనసంఘమును (మైనారిటీగా) దుర్బలముగా నెంచి, దానికిఁ బ్రత్యేకరక్షణముఁ గోరుట యుక్తముగాదు. ఇతర సంఘములకంటె జిన్న సంఘములన్నియు మైనారిటీలు గావు. సంఖ్యాబలముచే మిగుల నల్పమగుటయే కాక, ఆత్మబలమును విశ్వాసమును గూర్చు నితరగుణములు గూడ లోపించి,ఇతర సంఘములనుండి యాత్మరక్షణ మొనర్చు కొను ధైర్య మేసంఘమున కుండదో అదియే దుర్బలసంఘ మనఁ జెల్లును. ఆ సంఘ మితర సంఘములకంటెఁ జిన్న దనుట చాలదు. స్వప్రయోజన రక్షణమునకు దాని సంఖ్యాబల మించు కేనియుఁ జాలనినాఁడు దానిని దుర్బలసంఘ మనవలెను. కావున కేవల సంఖ్యాబలమే కాక యితర లక్షణములఁ గూడఁ బరి గణింపవలెను. ఒక దేశమునందుఁ బదిలక్షల జను లొక సంఘ మునను, నిరువదిలక్ష లింకొక సంఘమున నున్నా రనుకొనుఁడు. రెండవదాని సంఖ్యయందు సగమే యున్నదను కారణమున మొదటిదానిని దుర్బల సంఘ మనఁ జెల్లదు.''

మఱియు :

''ఇప్పటికిఁ బదునొకండు శతాబ్దు లిచటఁ గడచినవి. కావున నీ భూమి హైందవమతస్థుల కెట్టిదో మహమ్మదీయు

లకు నట్టిదే. హైందవధర్మ మిచటఁ బెక్కువేల వర్షములుగా నుండుఁగాక. ఇస్లాము ధర్మముగూడ నిచట వేయేండ్లుగా నెల కొని యున్నది. హిందువులవలె మనకును భారతభూమియెడ నభిజనాభిమాన మున్నది. వారు హైందవ ధర్మమును, మన మిస్లాము ధర్మము నాచరించుచున్నను అందఱము భారతీయు లమే. ఇంతియే కాదు. ఇచటి క్రైస్తవులు గూడ భారతీయులే. వా రాచరించు క్రైస్తవధర్మము గూడ భారతీయమే.''

తుదిమాట :

''స్వతంత్రభావి భారతముపట్ల భారత ముస్లిముల కవి శ్వాసము, ననుమానము నుండఁదగునా? విశ్వాసము, ధైర్యము నుండఁదగునా ? దానియెడ మనకు భీతియు, ననుమానము నుండుట యుక్తమగునేని మనము త్రొక్కఁదగిన మార్గము వేఱు. నేఁడు చేయు ప్రకటనలుగాని, రేపటి మాటకై చేయు బాసలుగాని, రాజ్యాంగరక్షణ సహస్రముగాని మన భీతికి, సంశయములకు నివారకములు గాఁజాలవు. ఆ పక్షమున నిచట మూఁడవ వాని యునికిని సహింపక తప్పదు. ఆ మూఁడవ యతఁ డిచటఁ బీటవెట్టుకొని కూరుచున్నాఁడు. ఆతఁ డట్లు పదికాలములపా టిచటనే యుండవలెనని కోరుటయే మనకు శరణ్యము. అట్లు కాక మనము భయసంశయముల విడనాడి, ధైర్యవిశ్వాసముల నవలంబింతుమేని యప్పటి దారి వేఱు. అపుడు నేఁటి నీలి నీడలు, డోలాందోళనలు, నిష్క్రియత్వ జడత్వములు నంతరించి, విశ్వాసము, నిశ్చయజ్ఞానము, కార్య పరత్వము, నుత్సాహము నను వెలుఁగు వెల్లువలు నిండిన నూత్నలోకము సాక్షాత్కరించును. అపుడు మనమార్గ మెగుడుదిగుడులతోఁ గంటకమయమై తోఁచి, చీకాకుగూర్చి

నను వెనుదిరుగక ముందునకే సాగిపోదుము. భారతప్రజా గమ్యము దెసకు ధీరముగా నడుగులిడుచుఁ బురోగమించుట మనకు విహితధర్మము కాఁగలదు.

"నా కిందు సంశయలవమేని లేదు. ఈ నిశ్చయమునకుఁ దిరుగు లేదు. మొదటి మార్గమును దలఁచి కొన్నంతనే నా యొడ లాపాదమస్తముగాఁ గంపించిపోవును. ఇస్లాము ధర్మము తమలోఁ జప్పగాఁ జచ్చిపోయిన వారు గాక ఆ మార్గమును ముస్లి ము లెట్లు సహింపఁగలరు?"

ముస్లి ముల విషయ మింతటఁ జాలింతము. భారత స్వాతంత్ర్య ప్రదానమున కీ మతవిరోధములే ప్రతిబంధక ములుగా నున్నవని పదేపదే చెప్పెడి బ్రిటిషువారి విషయము నెత్తికొందము :

"ఈ చిక్కును మొదట సడలింపవలయు ననుటకంటె దీని కధిక ప్రాధాన్యము లేదు. కాంగ్రెసున కీ విశ్వాస మెప్పుడు నుండనే యున్నది. దీని నెవ్వరును గాదనలేరు. ఈ విషయమునఁ గాంగ్రెసు రెండు సూత్రముల నవలంబించి,ప్రతి పదము వాని ననుసరించి నడుచుకొను చున్నది.

"(1) భారతదేశ మవలంబించు రాజ్యాంగమున నల్ప సంఖ్యాక సంఘముల ప్రయోజనములు, హక్కులు సురక్షిత ములు గావలెను.

"(2) తమ కెట్టి రక్షణములు గావలెనో అల్పసంఖ్యాక సంఘములే నిర్ణయించుకొనవలెను. అధిక సంఖ్యాకు లట్టి నిర్ణ యము నొనర్పరాదు. కావున నీ నిర్ణయము సంఖ్యాబలముచేఁ గాక అల్పసంఘీయుల సమ్మతితో జరగును...

"నేఁటి రాజ్యాంగరచనా సభాప్రస్తావమునఁ గాంగ్రెసు

ఈ సూత్రద్వయము నెట్లు పాటించినదో చూడుఁడు. అల్ప సంఖ్యాకములుగా నంగీకృతములైన సంఘములు, వలసినచోఁ, దమ ప్రతినిధులను దామే వరించి యీ సభ కంపవచ్చును. ఇతర సంఘముల సమ్మతిప్రదానముతో నా ప్రతినిధులకు నక్కఱయుండదు. ఆ రాజ్యాంగరచనా సభయందున్న యధిక సంఖ్యాకు లల్పసంఖ్యాసంఘీయుల హక్కులను నిర్ణయించుట యుండదు. అల్పసంఘీయుల సమ్మతిమీఁదనే యీ హక్కుల నిర్ణయము జరగును. ఏ యంశమేని వివాదాస్పదమైన పట్టు లందు అల్పసంఘీయులకు నచ్చిన మధ్యవర్తులే పరిష్కర్త లగుదురు. మధ్యవర్తి పరిష్కార మవసరమగునని కాదుగాని, ఎందులకేని మంచిదని యెంచి అట్టి యేర్పాటు చేసితిమి. ఇంత కంటెఁ బ్రయోజనకరమగు నేర్పాటున్నచోఁ గాంగ్రె సందుల కంగీకరించును.''

ఇండియా బ్రిటన్ల కీ తుది గడియలందేని సమాధానము కుదురఁగూడదా యని మౌలానా యడుగుచున్నాఁడు :

''ఇంతకాలముగా నీయుభయదేశస్థులకుఁ బాల్యపాలక సంబంధ మున్నది కదా, గుణాధికులగు నీ యిరువురు న్యాయ్యము, ధర్మసమ్మతము, శాంతిప్రదము నగు క్రొత్తచుట్ట టికమును గలిపికొనఁజాలరా? అట్టి భాగ్య మొదవినచో నేఁటి యుద్ధ పీడనుండి నూతనాశా కిరణము లుదయింపవా? మానవలోకమున నపుడు న్యాయధర్మములకుఁ బట్టాభిషేకము జరుగును గదా! లోకేతిహాసమున నూతన శకోదయమునకుఁ గారణమగు ఘనకార్యము నిదిగో! చేసితిమని బ్రిటిషు ప్రజలు సగర్వముగఁ జెప్పిననాఁడు గదా మానవకల్యాణ మవత రించును? ఇంతటి పని యొరులకు దుష్కరమే యగునుగాని

బ్రిటిషు ప్రజల కిది యసాధ్యము గాదు.

చాలఁ బ్రతికూలపరిస్థితులందుఁ గాంగ్రెసు సభాసమావేశము జరిగినది. కుంభవర్ష మందులకుఁ దోడ్పై, తొలి నాఁటి కార్యక్రమమునకు విఘాతము గల్పించెను. ఆ జడి వానను, బెనుగాడ్పును మౌలానా లక్ష్య మొనర్పక, కతిపయవాక్యములతో సభోపక్రమణ మొనర్చి, కార్యనిశ్చయములు రేపు జరగునని ప్రకటించెను. మఱునాఁడు గూడ మిన్నులు విఱిగి పడునట్లున్నను, ప్రతికూలప్రభంజనమును లక్షింపక యేఁబది వేలమంది సభాస్థలమున నాసీనులైరి. ఆ నాఁటి ప్రస్తావములకు సభ్యు లుపపాదించిన సవరణ లనేకము నిస్సారములే కావున మౌలానా వాని నెల్లఁ బరిగణింపక ముఖ్యకార్యమును దొందరగా ముగించినను దోషముండదు. అట్లయ్యు, మౌలానా మిగుల నోర్మివహించి, సవరణల నుపపాదించిన వారికెల్లఁ గోరిన వ్యవధి నొసఁగి, నాల్గు గంటలలో సభాకార్యమును ముగించెను. నాఁటి సభాకార్యగమనమును గాంచినవారికిఁ బ్రజల కార్యతత్పరతయుఁ, బ్రకరణశుద్ధియుఁ గనులఁ గట్టినట్లుండెను. ప్రభుత్వముతో సమాధాన పడు యత్నములెల్ల విరమింపవలెననియు, వెంటనే శాసనోల్లంఘనమునకుఁ గడంగవలెననియుఁ గొందఱు చేసిన ప్రస్తావములు నిరాకృతములైనవి. ప్రతిఘటనోద్యమము నారంభించుటకై గాంధిజీ పెట్టిన షరతులు విషమములు, నిష్ఠురములు నని యెఱిఁగియు సభ్యులు ముఖ్య ప్రస్తావము నపారసంఖ్యాబలముచే నామోదించి, కార్యనిశ్చయ మొనర్చిరి. "నేను మీ యిచ్చ చొప్పున మెలఁగెడి సేనాపతినిగాను. నాషరతులను మీ రంగీకరింపక తప్పదు. ఆ షరతులు నిష్ఠురములు. వానిని మీరు పాటింపనిచో

నే నస్త్రసన్న్యాసమొనర్చి పోదును. ఆ షరతులు మీకు సమ్మతముగా లేని, నాయందున్న నమ్మకము మీకు వానియం దుండ దేని మీరు చెఱసాల కేగవలదు. మిమ్ము నెప్పు డేగోతిలో దింపుదునో! నేను విపత్కారుఁడ నని యెఱిఁగి యిందు దిగుఁడు. సామమార్గమున సమాధానపడుట నాకు సాజము. పనివడి నచో నేఁబది మాఱులేని నేను వైస్రాయిని దర్శింపఁబోవుదును.'' గాంధిజీ యిట్లు మనసువిప్పి చెప్పినను, యెఱిఁగి యెఱిఁగి సభ్యులు కార్యనిశ్చయ మొనర్చిరి. సభ్యజన సంతోషకోలాహలధ్వనుల కాపరిసర పర్వతగుహలు ప్రతిధ్వనించినవి. నాఁటి కార్యనిశ్చయ పాఠము గ్రంథాంతమునఁ జూడఁగలరు.

---

# 16. భావి

"గుణాధికులగు నీ యుభయదేశస్థులు న్యాయ్యము, ధర్మసమ్మతము, శాంతిప్రదమునగు క్రొత్త చుట్టఱికమును గలిపి కొనఁజాలరా?" కాంగ్రెసు సభాపతి యడిగిన యీ ప్రశ్నమే మరల నడుగ మనసు వాడమువచున్నది. "క్రొత్త చుట్టఱికము గలిపి కొనఁజాలరా?"

తొల్లి యొనర్చిన దోషములను సవరించుకొన్నచోఁ క్రొత్త చుట్టఱికము గుదురకపోదు.

వైస్రాయి చేసిన మొదటి దోస మే మనఁగా- దుర్బల సంఘము లగునా, కాదా యని విచారింపక దేశమునందున్న యల్పసంఖ్యాకసంఘముల ప్రతినిధులందఱను జేరఁబిలుచుట. అల్పసంఖ్యాకసంఘము లనెడి చిక్కును బ్రిటిషు ప్రభుత్వమే సృష్టించినది. నలుబదియేండ్లుగా నా ప్రభుత్వ మవలంబించిన భేదనీతియే యిట్లు ఫలించినది. ముస్లిములీగు సభాపతితోఁ బలుమార్లు మంతన ముండిన వైస్రాయికి - ముస్లిములలో - జమయతుల్-ఉలేమాలు, అహరార్లు, షియాలు, సున్నీలు, భారతీయతాభిమానులు - మున్నగు నితర సంఘీయులతో సంప్రతింపవలెనను బుద్ధియే పొడమదాయెను.

వైస్రాయి చేసిన దోసమునే జెట్లండు ప్రభువున్నగు బ్రిటిషు రాజనీతిజ్ఞులు నాచరించిరి. రాయబారములకుఁ దరుణము మించి పోలేదనియు, సామమార్గ మవలంబించుచుంటి మనియు జెట్లండు ప్రభువు లోకమునకుఁ జాటి చెప్పుచునే, మఱికొన్ని క్రొత్త మురాలను సింగారించి, ఉరిసిన పుంటిపై నుప్పును జల్లెను.

ప్రభుత్వ మి ట్లున్నవియు, లేనివియు నడ్డంకులు గల్పించు

చున్నను కాంగ్రెసు వాని కన్నిటికి విఱుగుడుగా రాజ్యాంగ రచనా సభానిర్మాణమును జేర్కొనెను. సకల ప్రజాసంఘము లును సంఖ్యాబలమునుబట్టి ఆ సభకుఁ బ్రతినిధుల నంపవచ్చు నని సూచించెను. అంతటితో నల్పసంఖ్యాక సంఘములనెడి చిక్కును విప్పిన ట్లయినది. కాంగ్రెసే కాదు. ముస్లిము లీగే కాదు, సంస్థానాధిపతులే కాదు, కాంగ్రెసేతరులగు వారెల్లరకు సంఖ్యాబలమునుబట్టి యా సభలోఁ బ్రాతినిధ్యము లభించును. ఆ సభలోఁ గాంగ్రెసు తనపట్టును, లక్ష్యమును విడువకుండుఁ గాక; దాని మాట యే యచటఁ జెల్లనక్కఱలేదు. కాంగ్రె సేతర సంఘములన్నియు సంపూర్ణ స్వాతంత్ర్యము మాకక్కఱ లేదని చెప్పి యా సభలోఁ దమ మాట చెల్లించుకొన వచ్చును.

ఈ రాజ్యాంగరచనా నిర్మాణ సూచన యిపుడు క్రొత్తగాఁ దిగివచ్చినది కాదు. బ్రిటిషు ప్రభుత్వము మన రాష్ట్రప్రభుత్వముల సమ్మతిగైకొనకుండ, ఇండియాను యుద్ధ మున దింపిన కారణమున నిపుడు చేసిన సూచనయుఁగాదిది. 'మత వివాద పరిష్కారమును' (Communal award)గూర్చి 1934 లో వాదోపవాదములు రేఁగినపుడు డాక్టరు అన్సారీ కాంగ్రెసు పక్షమున నొక ప్రకటన మొనర్చెను. అందీ సూచన నాయన చేసెను: "నెహ్రూ కమిటీ సూచన లంత రించినది మొదలు కాంగ్రెసు మతవివాదమును గూర్చి నిజా భీష్టమును బెక్కుమాఱులు స్పష్ట మొనర్చినది. 'మతవివాద పరిష్కారమును' (Communal award) హిందువులలో, సిక్కులలో బహుళ సంఖ్యాకులు ప్రతిఘటించినను—ముస్లిములు, హరిజనులు, క్రిస్టియనులు—సకలాంగీకృతమగు మార్గాంతరము

గోచరించునటకు – నాపరిష్కారము నంగీకరించిరని కాంగ్రెసుకుఁ దెలియును. సర్వసమ్మతమగు పరిష్కృతికై కాంగ్రెసు యత్నించుచునే యుండును. కాని, భారత రాజ్యాంగరచనకై సభను సమకూర్చుకున్నచో నీ వివాదమునకుఁ బరిష్కారము లభింపదని నా యభిప్రాయము. అంతదనుక 'మతవివాద పరిష్కార' మందలి సూచనలామోదించుటయా, నిరాకరించుటయా యను ప్రశ్న ముదయింపదు. తమ కుటుంబ కలహమునఁ దగవు దీర్పుఁడని యభిమానవంతులగు ప్రజ లితరుల నర్థింపరు. అట్టి తీర్పు లందఱకుఁ దృప్తి నే నాఁడు నొసఁగఁజాలవు." (క్రీగీట్లు నేను గీచినవి.)

కాంగ్రెసు కార్యనిర్వాహకులు 1934లోఁ జేసిన కార్య నిశ్చయమున రాజ్యాంగరచనా సభను నిర్మించుట యావశ్యకమని యిట్లు నొక్కి చెప్పినది:

"ప్రభుత్వము చేసిన తీర్పునకు (White paper) రాజ్యాంగరచనా నిర్మాణ సభను సమకూర్చు టొక్కటే ప్రత్యామ్నాయము. వయసువచ్చిన వారందఱు నా సభకుఁ బ్రతినిధుల నెన్నుకొన వచ్చును. లేదా, ఆ యెన్నికకు మఱియొక మార్గమును – దీనికిఁ జేరువ యగు దానిని – సూచింప వచ్చును. ప్రధానములగు నల్పసంఖ్యాకసంఘములు, వలసినచోఁ దమ సంఘీయులనుండియే ప్రతినిధుల నెన్నుకొన వచ్చును."

పిమ్మట నైదేండ్లకు హిందూముస్లిము మతాభిమానులకు, జవహార్లాలు పండితునకు వాదోపవాదములు పొడమెను. వాని నెల్లరు నెఱుంగుదురు. అందు సర్ మహమ్మద్

ఇక్బాలు శంకలకు పండితుఁడు సమాధానముఁ జెప్పఁచు, రాజ్యాంగరచనా నిర్మాణ సభయే యీ మతవివాదలను, ఇతర వివాదలను బరిష్కరించుట కర్హ్వమైనదని నుడివెను.

కాంగ్రెసు కార్యనిర్వాహకుల కార్యనిశ్చయమును గాని, రాజ్యాంగరచనా సభానిర్మాణ సూచనను గాని ఆ తరుణమున ముస్లిము లీగు మున్నగు అల్పసంఖ్యాక సంఘము లాక్షేపించిన పాపమునఁ బోలేదు. కావునఁ గ్రొత్త సంకటములనుండి తప్పించుకొనుట కిపుడు కాంగ్రెసు కోరిన క్రొత్త కోరిక కాదిది. భారతీయులు తమ రాజ్యాంగమును నిర్మించు కొనుట కనువుగాఁ దాను వైదొలఁగునేని బ్రిటనుకు గౌరవము దక్కును. ఏ మతస్థుల కామతస్థులే తమ ప్రతినిధుల నెన్ను కొనవలెనను నియమముచే బ్రిటను తొలుత నీ కలహబీజములను నాటెను. వానిని బెంచి పెద్ద గావించెను. ఆ బ్రిటనే యిపుడు "మీ రీ విషవృక్షమును ముందుగాఁ బెఱికివైచినఁ గాని మీ వ్యవహారములు మీరు చక్కబెట్టుకొనఁగలరను నమ్మకము మాకు జనింప"దని యే మొగముబెట్టుకొని చెప్పఁ చున్నదో వింతగానున్నది. ఈ విషయమున లయొనల్ కర్టిస్ చెప్పిన మాటల నిట నుదాహరింతును:

"కొన్ని యేండ్ల క్రితము బ్రిటను భారత దేశమునఁ బ్రతినిధి సంస్థలను నిర్మించుచు మతములకుఁ బ్రత్యేక ప్రాతినిధ్యమను సూత్రము నంగీకరించుట ఘోరాపరాధము. ఈ సూత్రమిట్లే కొనసాగునేని ఇండియాలోఁ గ్రొత్త వర్ణవిభాగము జనించి దుర్భరమై పోఁగలదు. దీనిచే భారతప్రజాజీవనపు టాయువు పట్టకే ఆ యేఁటికా యేఁడు మోసము వాటిల్లును. ఈ పీడ విడుపడున్నచో భారతప్రజ కేకీ భావము గలుగుట కల్ల.

మొక్కగా నుండగనే త్రుంచివేయవలెనుగాని పిమ్మట దీనిని
బెల్లగించుట దుష్కరమగును.తుదకు దీని సమూలనాశనమునకై
భారతప్రజ లొండొరులపైఁ గత్తి గట్టవలసివచ్చును. భారత
ప్రజను గడిదేర్చి యేకీభవింపఁజేయు ధర్మభారము మనపై
నున్నది. ఈ ప్రత్యేక ప్రాతినిధ్యము ననుమతించి మన మా
ధర్మమునకు ద్రోహమొనర్చితిమి." బ్రిటను వచించెడి ధర్మ
పన్నముల కింతకంటె సమూలఖండన మింకొకటి యుండఁబోదు.

కాంగ్రెసు గోరిన యీ రాజ్యాంగరచనా నిర్మాణమును
ముస్లిములీగు ప్రతిఘటించి, ఇండియాలోఁ దనవంతుఁ దనకుఁ
బంచియిండను చున్నదని చెప్పవత్తురు. శుభ, మల్లే కానిండు.
కాంగ్రెసు దానికిని సమ్మతించును. కాని, కాంగ్రెసు చెప్పా
నది యేమనఁగా-రాజ్యాంగరచనా నిర్మాణసభలోముస్లిముల
ప్రతినిధులే అట్టి కోరిక కోరుట కర్హులని. ముస్లిములీగు కోరి
నది విపరీతపుఁ గోర్కెయని మౌలానా వాకొనుచున్నాఁడు:
"ఈ కోరిక దేశేతిహాసమునకు, మానవజాతి లక్షణ శాస్త్ర
మునకు, నేఁటి కాలగతికిఁ గూడ విరుద్ధము. హిందువులు
ముస్లిములు భిన్నప్రజ లనుట పొసఁగని మాట. మన యుభ
యులలోఁ జాలమందికిఁ బూర్వీకు లొకజాతివారే. జాతులలో
భిన్నత్వము, నెక్కువ తక్కువలను నా మట్టుకు నేనంగీకరిం
పను. మానవజాతి యంతయు నొక్కటియే. మనము గలసి
మెలసి యుండవలసినవారము. వేయేండ్లనాఁడు దైవము మన
యుభయుల నొక్కచోఁ జేర్చెను. మన మొండొరులతోఁ
బోరితిమి.నిజమే,దాయాదుల కీ పోరితములున్నవియే.ఆంగ్లేయు
లాంగ్లేయులతో మున్ను పోరాడలేదా? మఱి వారు భిన్న
ప్రజలమని వేఱుపడిరా? ఈ వేయేండ్లుగా మన మొండొరుల

ధర్మమునందు, సంస్కృతియందు, నీతినియమములందు, నర్థ సంపదయందుఁ జాలుపంచికొంటిమి. ఇపుడు కాలగతిని వెనుకకుఁ ద్రిప్పి, వేర్పడుదు మందు రేల ? భేదములను నొక్కి వక్కాణింతురు గదా, భేదము లెవ్వరికి లేవు ? మానిసినిబోలిన మానిసి యుండునా? శాంతికాములు భేదములు లెక్కగొనక సామ్యములనే గణింతురు. మూలమందున్న ఏకత్వమున కీ నానాత్వము రంజకమగును. కావున భారత ప్రజావ్యవహార పరిష్కారమున మతభేదములను దెచ్చిపెట్టుట యన్నచో నాకు రోఁతగా నుండును. లోకమున నెందును, మతములను బట్టి యిట్టి వ్యవహారములను బరిష్కరించుట కానరాదు. భారత ప్రజాప్రతినిధులు నిర్మించుకొన్న రాజ్యాంగమున ముస్లిములు దాము ముస్లిములమనియు, హిందువులు దాము హిందువులమనియుఁ దమ ప్రయోజనముల నర్థింపరు; జమీందారుల మనియుఁ గర్షకులమనియు, పెట్టుబడి వ్యాపారుల మనియు శ్రామికులమనియు నెంచి కొందురు. స్వతంత్రమగు నే రాజ్యాంగ మేనియు సకల మతములకు స్వాతంత్ర్యమును మూల స్వత్వముగా నంగీకరించును. ప్రజలందఱకు సమానావకాశములను, ఆర్థిక బంధమోచనము నొసఁగని రాజ్యాంగము గవ్వకుఁ గొఱగాదు. నాకీ కంఠశోషయేల ? ముస్లిముల ప్రతినిధిగా జిన్నాసాహెబు రాజ్యాంగరచనా సభకువచ్చి,యచట భారతముస్లిముల కోర్కెలనడిగి క్రైకొనవచ్చుఁ గదా !

ఇండియాను పంచియిమ్మని ముస్లిములీగు లాహోరు సభలో నడిగి రెండు నెలలైనది. లీగు సభ్యులం గాని భారత ముస్లిముల కీ కోర్కె విడ్డూరముగాఁ దోఁచుటయు, వారం దఱు ఢిల్లీ నగరమున నేప్రిలు నెలలో సభ గావించిరి. ఆ సభ

యందు ముఖ్యములగు నేడు ముస్లిము సంస్థల ప్రతినిధులును, భారతదేశము నాల్గు చెఱఁగులనుండి యేతెంచిన వేలకొలఁది ముస్లిములును సమావిష్టులైరి.

తత్సభాధ్యక్షుఁడగు అల్లాబక్షు తన ప్రసంగమున లీగు కోరిన విపరీతపుఁ గోర్కె యనర్థకారి యనియు, భారత ప్రజలకు ద్రోహకరమనియుఁ దెలియఁబలికెను. ముస్లిములు భారత పురోగతి కడ్డుదగులు చుండిరను నీ యప్రతిష్ఠను వెంటనే పోకార్చికొనుటకై లీగు కోర్కెను గంఠోక్తిగా నిరాకరింప వలెనని సభ్యులను హెచ్చరించెను. పాకిస్థాను వాంఛ పనికి మాలినదనియు, ముస్లిములు భారత స్వాతంత్ర్యలబ్ధికి వ్యతిరేకులు గారనియు, రాజ్యాంగరచనా సభను సమకూర్పవలెననియు సభాసదులు ప్రకటించిరి.

బ్రిటిషు ప్రభుత్వ మీ మతవివాదమే భారతస్వాతంత్ర్య ప్రదానమునకు ముఖ్యప్రతిబంధకమని వాకొనుచున్నది. తాను వైదొలఁగ కున్నచో నీ వివాదము చక్కఁబడదని ప్రభుత్వము గ్రహింపవలెను. డెయిలీమెయిలు పత్రికాప్రతినిధితో జిన్నా సాహె బేమనిరో వింటిరా? "గాంధిజీ కోరెడి కోర్కె సమంజస మగునేని 'మనకిచటఁ దలవంపులుగానున్న బ్రిటిషు ఖడ్గబలమును' గూడ వెంటనే తొలఁగి పొమ్మని చెప్పవలెను." పాపము, జిన్నాసాహె బెఱుఁగఁడో, యెఱుఁగఁగోరఁడో కాని గాంధిజీ ఒక్కసారికాదు, వేయిమాఱు లీ మాటయే చెప్పెను. అంతియేకాదు; "ఈ బ్రిటిషు దొరతనముకంటె ముస్లిము దొరతనమే మేలనియెంతు" ననియు, "ఇచటిప్రజలు దమలోఁ దాము పోరాడుకొన్నను ఆ పోరాట మచిరకాలము ననే ముగిసి, శాంతి యేర్పడఁ గల"దనియు, "ఈ బ్రిటిషు

పాలనము నిక్కముగా ముగిసిన పిమ్మట – భారతమున కపూర్వాభ్యుదయము చేకూఱును. నేఁటి యమంగళ వాక్యములన్నియుఁ బ్రతిహతము లగు'' ననియు గాంధిజీ ఘంటాపథముగా వచించెను.

సంస్థానాధిపుల దోక ప్రతిబంధకము కానేకాదు. ''సంపూర్ణ స్వాతంత్ర్యము''ను, ''స్వయం నిర్ణయము''ను వారికి భీతి గొల్పుచున్నచో బ్రిటిషిండియానుండి వారు వేఱు పడవచ్చును. ఈ దేశమున ముస్లిముల ఇండియాయనుచు వేఱుగా లేదుగావున 'అల్‌స్టరు' సామ్యమిచటఁ జెల్లదు. సంస్థానముల యిండియాకుఁ అల్‌స్టరుకుఁ గొంతపోలిక యున్న దందురా, వారు వేఱుపడనువచ్చును, బ్రిటిషు ఇండియా స్వయంనిర్ణయ మొనర్చికొననువచ్చును.

ఈ విధముగాఁ గాంగ్రెసు చెప్పిన వికల్పము లన్నిటిని బ్రిటను త్రోసిపుచ్చినది. బ్రిట నిపుడు యుద్ధవిపత్తునందుఁ జిక్కువడియున్న దందురు. నిజమే కాని, యుద్ధముకంటె నిండియా వ్యవహారమే బ్రిటనుకు ఘోరవిపత్తు. ఏలయందురా, బ్రిట నిచటి ధర్మపరీక్షలో వీఁగిపోయి, లోకనింద కగ్గ మగుచున్నది. 1917 నుండి చేసిన బాసలు చెల్లింపక కల్లబొల్లిసాకులు సెప్పి తప్పించుకొనుచున్నది.

మౌలానా యీ విషయమై కలకత్తాలో నాతో మాటలాడుచు నిట్టి యాపత్సమయమునఁ గూడ బ్రిటను తన పెద్ద ఱికపు మాటలను, పోషకత్వ వైఖరిని వీడకున్నది కదాయని హృదయ వ్యథపాలయ్యెను. గాంధిజీ రెండు మూఁడు మార్లు వైస్రాయిని దర్శించెను. మనకు సమాధానము కుదురువఱకుఁ గదలకుందమని యర్థించెను. తుద కేమైనది? ఆ మంతనము

లొక్క సారితోనే ముగిసి, గాంధిజీ ఢిల్లీని వీడిపోయెను. ఇది నేఁటి ప్రభుత్వ వైఖరి. మఱి 1921 నాఁటి వైఖరియో? అపుడు గాంధిజీ యొకవంక సాహాయ్య నిరాకరణోద్యమమును సాగించుచునే యున్నను రీడింగు ప్రభువు ఆఱుపర్యాయములు దీర్ఘములగు మంతనము లాయనతోఁ గావించెను. ఆవల 1931 లోనో? గాంధిజీ యిర్విను ప్రభువుల మంతనముల కంతమే యుండదనుకొంటిమి. ప్రొద్దుపోడుచుటయుఁ గ్రుంకు టయు నెఱుఁగక, వా రుభయులు నహోరాత్రములు మంత నములుండి 'సాధుజన సమాధానమును' సాధించిరి. బ్రిటిషు ప్రభుత్వ మానాఁడు రాజీకి సుముఖముగా నుంటకు, నేఁడు విముఖముగా నుంటకు-నిదియే కారణ మీా భిన్న వైఖ రులకు. వెనుక నయిర్లండు విషయమున బ్రిటిషు ప్రభుత్వ మేమి చేసినదో యెఱుఁగమా? అచట ఘోర హింసా కాండ చెలరేఁగి, యిరువాగును రక్తమున నీఁదులాడు చుండఁగనే లాయిడు జార్జి ప్రధాని యా రాజద్రోహులను రావించి, రేబవళ్లు వారితో మంతనముండి సమాధానపడెను. మఱి, యీజిప్టులోనో? సయ్యాదు జగ్లుల్ పాషాను బ్రిటిషు మంత్రులు లండనుకు రావించి బేరమాడుటయు, ఆ బేరము కుదురకుంటచే నీజిప్టు ప్రజలు గోపోద్రిక్తులై విజృంభించు టయు, మరల పాషాను బిలిచి మంతనమాడుటయు, మరల రాజీ కుదురకపోవుటయుఁ, బ్రజలు మరలఁ గ్రోధవివశులగు టయుఁ, బాషాను మరల రావించుటయు – నిట్లెన్నిమాఱులు జరగలేదు? అట్టి బ్రిట నిప్పుడిండియాపట్ల సామవైఖరినేల విడ నాడెనో! పశుబలమును దక్క నితరబలమును బ్రిట నెఱుఁగ దను లోకనిందకు బ్రిటను పాల్పడకుండుఁ గాక!

ఎవరి వైఖరియెటులున్నను కాంగ్రెసు మాత్ర మహింసకే కట్టువడి యుండుటకై చేయఁగల యత్నములన్నియుఁ జేయుచున్నది. తనకుఁ దా సత్యాగ్రహసేనా నాయకత్వముఁ దాల్చిన గాంధిజీయు శాసనధిక్కారమును బరిహరించుటకే కృషి యొనర్చుచుండెను. అది యపరిహార్యమయ్యెడు పక్షమున బ్రిటిషు ప్రభుత్వమునకు సంకటము గలుగకుండఁ దప్పించుట యెట్లా యని మథనపడుచుండెను. తుదకది యెట్లు పరిణమించునో, గాంధిజీ దాని నదుపులో నుంచఁ జాలునో, చాలఁడో? గాంధిజీ చెప్పినట్లు బ్రిటనుకు, ఇండియాకుఁ గూడ నపుడు సర్వేశ్వరుఁడే దిక్కు.

---

# తాజా కలమం

మే నెల 18 వ తేదీ నాఁటి కింతవఱకు గ్రంథమును ముగించి 20 వ తేదీ గాలి టపాద్వారమునఁ బ్రచురణకర్తల చెంతకు లండను నగరమున కంపితిని. రెండు నెలలు వేచి యుంటిని - వారి కందిన వైనముఁ దెలుపుదురని. పిమ్మటఁ దంత్రీవార్త నంపితిని-వ్రాఁతప్రతి యందెనో, లేదో తెలుపుఁ డని. 'ఆనాఁటి గాలిటపా చేరలే'దని వారు మఱువార్త నంపిరి. అంతట "నావలో మరల నంపుదును. ప్రచురింతురా?" యని యడుగఁగా వారు "ప్రచురింతు" మనిరి. ఈ తూఱి యోడటపాలోఁ బంపుచుంటి, నివి యేమి కానున్నవో దైవమునకే యెఱుక. గ్రంథము నిట్లు మరలఁ బంపులోపల మూఁడు నెలలు గడచినవి కావునఁ గొన్ని క్రొత్త విశేషముల నీ తాజాకలమునఁ జేర్చుచున్నాను.

ప్రభుత్వము గష్టములలోనున్నపుడు దానిని తొందర పెట్టి యిరుకటము పాలుసేయ మనసొప్పక కాంగ్రెసు కొన్ని నెలలపాటు తాల్మి వహించెను. ప్రభుత్వమునకీ తాల్మి యన్యథా గోచరించెను. దొరకిన వ్యవధి నూరకపోసీయక ప్రభుత్వము దనపనిఁ జక్కఁబెట్టుకొనుచుండెను. "దేశముపై నితరు లెత్తి వచ్చినపుడు, నరాజకము చెలరేఁగినపుడుఁ గాంగ్రెసు హింసాహింసలలో దేని నాశ్రయించి ప్రతిక్రియ సేయవలెను?" అని గాంధిజీ మొన్నటి జూను నెలలో కాంగ్రెసు కార్యనిర్వాహకులను బ్రశ్నించుటచే వారు సంకటావస్థలోఁబడిరి.

"దేశముపై శత్రువులెత్తివత్తురో, దేశమున నరాజకము తాండవించునో యనుకొనుచున్న యీ తరుణమునఁ,

బరిపాలన భారము మనపైఁబడినచో నేమి చేయుదుమో తెలియఁజెప్పవలసియున్నది. స్వాతంత్ర్య సంపాదనకై యహింసయే సాధనమని మనము చెప్పితిమి. అహింసచే లభించిన స్వాతంత్ర్యము నహింసచేతనే రక్షించుకొందుమని చెప్పక తప్పదుకదా'' యని గాంధిజీ యడిగెను. కాంగ్రెసు ధర్మసంకటమునఁ బడినది. ''అహింసచేఁ దీఱని చిక్కు లోకవేళఁ బొడమునేమో, యపుడు మన మిదమిత్థమని నిర్ణయింపఁజాల'' మని కార్యనిర్వాహకులు చెప్పిరి. ఈ విషయమునఁ దక్కిన సభ్యులతో మౌలానాయు నేకీభవించెను. అహింసను విడనాడవలసి వచ్చుననియే కదా యందలి తాత్పర్యము! దీనిచే గాంధిజీ మనసు చివుక్కుమని, యాశ్చర్యమగ్నమయ్యెను. అయ్యు, దాపఱికము సేయక మనసు విప్పి చెప్పినందులకై కాంగ్రెసు కార్యనిర్వాహకులను గాంధిజీ మెచ్చుకొనెను. ప్రభుత్వము భారతస్వాతంత్ర్యమును బ్రకటించి, కేంద్ర ప్రభుత్వమును బ్రజాయత్త మొనర్చినచోఁ, గాంగ్రెసు హింసామార్గమునఁగూడఁ బ్రభుత్వమునకుఁ దోడ్పడునని యిఁకఁ జెప్పవచ్చునుకదా, ఆ ప్రయత్నము సలుపుఁడని శ్రీరాజగోపాలాచార్యులను, తదనుగుణమైన కార్యనిశ్చయ మొనర్చి ప్రకటింపుఁడని కాంగ్రెసు కార్యనిర్వాహకులను బ్రోత్సహించెనే కాని గాంధిజీ వ్యథాకులితుఁడయ్యెను. ఇండియా యీ యుద్ధమున నిట్లు హింస కొడంబడినచో నిఁక మానవలోక వ్యవహారములందు హింస దిక్కుమాలిన దగునని యెఱిఁగినవాఁడు గావున, బ్రభుత్వము కాంగ్రెసు కోరికను నిరాకరించినను మేలే యని గాంధిజీ తలపోసెను.

పిమ్మట 8 వ ఆగస్టున బ్రిటిషు ప్రభుత్వ సంకల్పమును

వైస్రాయి వెల్లడించెను. యుద్ధము ముగిసిన వెంటనే ఇండి యాకు డొమినియన్ ప్రతిపత్తి నొసఁగుదుమని చెప్పుచునే, యా ప్రతిపత్తిని నిస్సారమొనర్చు షరతులు గొన్ని విధించి, ప్రస్తుతము కేంద్రప్రభుత్వమును విస్తరింపఁజేతుమని ప్రభుత్వ మొనర్చిన యా ప్రకటనముఁ గాంచినంతనే గాంధిజీ దాని ననర్థకరముగా నెంచియు, నహింస కాదరువు లభించినది కదా, అంతియేచాలునని సంతుష్టిచెందెను. పిమ్మట నెమెరీ మంత్రి చేసిన ప్రసంగముతోఁ గాంగ్రెసు దుఃఖపాత్ర పొరలిపోయినది. భారతప్రజను గండతుండెములుగా వర్గీకరించి ఎమెరీ మంత్రి బ్రిటిషు భేదనీతి ప్రాకారమునకు మదురు బిగించెను. ఈ వివాదమున సార్వభౌముని ప్రభుత్వముగూడ నొకపక్షమాత్ర మని ఎమెరీమంత్రి వాకొనుచునే, యావద్భారతప్రజల యభీష్ట మును దృణీకరించు నధికారము దమ కున్నదనెను. తక్కన భారతీయు లేమనుచున్నారో అది పట్టించుకొనక ఎమెరీ మంత్రి సంస్థానాధిపుల పక్షమునఁ గొంతసేపు వాదించెను. ముస్లిములీగుకున్న బలమెంతటిదో విచారింపక ముస్లిములను బురస్కరించుకొని కొంత దవ్వువాదించెను. అస్పృశ్యుల స్థితి యెట్టిదో, వారి మేలునకై ఏమి జరుగుచున్నదియో యించు కయు నెఱుఁగని యా మంత్రి అస్పృశ్యులను వెనుక వైచు కొని మాటాడెను. బ్రిటిషు ప్రజారాజ్యమునకుఁ దోడ్పడుఁడని భారతీయుల నర్థించుచునే భారతప్రజారాజ్య వాంఛను ఎమెరీ మంత్రి కాలితో మట్టగించెను. అహింసను విడనాడుటకు, బ్రిటిషు ప్రభుత్వమును సంకటముల పాలుసేయుటకుఁగాంగ్రెసు డా నొడిగట్టఁబోదని యెఱిఁగినవాఁడు గావున నా మంత్రి "ఇఁక మీరేమి సేతురో చూతు"నన్నట్లు కాంగ్రెసును

ద్భుఃకీకరించెను. "మీలోఁ గలసి వచ్చిన వారిని గలిపికొని వైస్రాయి తన పని సాగించు"నని యాయన స్పష్టమొనర్చెను.

మౌలానా ఆజాదును వైస్రాయి సంప్రదింపులకై యాహ్వానించెను. ఆ సంప్రదింపులు ప్రభుత్వము చేసిన 'నిరర్థక ప్రకటనములో' నిముడవలెను గావున ధారాళముగా సాగవు. వైస్రాయి మౌలానా లేకార్థసమవేతులు గారు. ఆ యీ విషయముల నడిగి తెలిసికొన్న పిమ్మటనే మౌలానా యీ పిలుపును నిరాకరించెను. అప్పటికిని ప్రభుత్వాధికారులు మౌలానా నిరాకృతి యయుక్తమని యేల యాక్షేపించిరో తెలియకున్నది.

"1935 నాఁటి శాసన మండలి యేర్పాటులనేకాదు; 'ఆశాసనమునకు మూలమగు రాజనీతి సంకల్పములనుగూడఁ' ప్రభుత్వము పునర్విచారణచేయుట కంగీకరించునఁట! అంతియే కాదు; 'భారతప్రజలలోఁ బలుకుబడిగల పెద్దపెద్ద ప్రజావర్గములు సమ్మతింపని ప్రభుత్వ విధానము'ను గూర్చి విచారించుటయుఁ బోసఁగదఁట! రాజీకి లొంగిరాని వైతండికుల కింత కంటెఁ గావలసినదేమి? వారి యాట లిట్లు కొనసాగవలసిన దేనా?" వైస్రాయి ప్రకటనమును గూర్చి వెలువడిన యీ యభిప్రాయ మెవ్వరిదో యెఱుఁగుదురా? రైటానరబుల్ వి. యస్. శ్రీనివాసశాస్త్రి మాటలు సుఁడీ యివి. అంతటి మితవాది గూడ నింతగా నిరసించిన వైస్రాయి ప్రకటనమెంత నిరర్థకమో వేఱ చెప్ప నక్కఱలేదు. ఇఁక ఎమెరీ మంత్రి ప్రసంగమును గూర్చి కలకత్తాలోని స్టేట్సుమన్ పత్రిక యేమి వ్రాసినదో చూడుఁడు: "మాంటేగు ఛెమ్సుఫర్డు రాజ్యాంగము నే నాఁడో కాంగ్రెసు నిరాకరించినది. ఎడపదడప

నించుక సమ్మతిజూపినను ఇటీవలనే మరల శాసనసభలనుండి లేచిపోయినది. అట్టి కాంగ్రెసు నేఁటి యుద్ధ సంకటమున సహకరించెద ననుచున్నది. ఆ సహకారమునకై ప్రభుత్వబాధ్యత లండనునుండి ఇండియాకుఁ దరలింపవలెనని యడిగినది. 1919 నాఁటి కేంద్రశాసన సభ తనకు సమ్మతమే యనినది. రాజ్యాంగ నిబంధన లెటులున్నను వ్యవహారతః ప్రభుత్వ మా శాసన సభకు బాధ్యతవహింపవలెనని కోరుచున్నది. ఆశాసన సభలో నుద్యోగివర్గమునకుఁ జోటుండరాదని చెప్పుచున్నది. కాంగ్రె సవలంబించిన యీ సామమార్గ మెంతయు సమంజసముగా నున్నది. ఎమెరీ మంత్రి దీనిని గ్రహించినట్లు కన్పించదు. క్రొత్త యెన్నికలతోఁ బనిలేకుండ నిప్పటి శాసన సభలతోనే సరిపెట్టుకొనవలెనని కాంగ్రెసు కోరుచున్నట్లు మాకుఁదోఁచు చున్నది. ఈ యేర్పాటుచేఁ గాంగ్రెసుకు ముందుముందేదియో యొరగనున్నదని కాని, భావి రాజ్యాంగము తీరును, శాసన సభల నిర్మాణమును దీనిచే నిప్పుడే నిశ్చితమైన ట్లగునని కాని చెప్పఁ జాలము. ఈ యుద్ధ కాలపు టేర్పాటునకు సమ్మతించుట ప్రమాదభూయిష్ఠము కాదు; వేగిరపడినట్లగుననియుఁ బ్రభుత్వము సంశయింపఁ బనిలేదు. దీనిని నిరాకరించుటచే బ్రిటిషు రాజనీతికిఁ జేటు గూర్చుటయు, భీరుత్వమనిపించు కొనుటయుఁ దప్పదు.

"నేఁటి శాసన సభకు బాధ్యత వహించు నఖిలపక్ష ప్రభుత్వముకంటె సరసమైన యేర్పాటు మఱియుండఁబోదు. శాసన సభయం దిపుడున్న ప్రభుత్వ సభ్యులు 26 మందియు వైదొలఁగినచో, నిఁకఁ బ్రభుత్వము దాను వరించిన (Nominated) అనధికార సభ్యులు 14 మంది మిగిలి

యుందురు. వారిలో నందఱినుగాని, కొందఱినుగాని నిష్కృమింపఁజేసి, సంస్థానముల ప్రతినిధుల కాస్థానములను బంచి యిడవచ్చును. ప్రభుత్వము వరించిన సభ్యులకు స్వాతంత్ర్య మెప్పుడు నుండనే యున్నది. వా రనేక పర్యాయములు నేఁటి యధికారుల దొరతనమును (Bureaucratic Government) శాసన సభలలో వ్యతిరేకించిరి. ఈ యుద్ధకాలమున నీ రీతిగాఁ బ్రభుత్వ లఘు సంయోగమును (Miniature Federation) సాధించినట్లగును. ఇచ్ఛయున్నచో రాజ్యాంగ ప్రతిబంధకము లన్నియు క్షణములోఁ దొలఁగి పోవును. ఈ యేర్పాటును గూర్చి బ్రిటిషు ప్రభుత్వ మింకను సావధానముగ నాలోచించు నని మా కాసయున్నది. వెంటనే యభ్యుదయము సాధించుట కిదియే యనువైన మార్గము.''

ఎవరెంత చెప్పినను బ్రభుత్వ 'మనర్థకర రాజనీతి' ననుసరింప నిశ్చయించుకొన్నది. రాజ్యాంగరచనా సభచే నిర్మితమగు రాజ్యాంగము నామోదింతునని కాంగ్రెసు చెప్పఁగాఁ, బ్రభుత్వము దానిని తృణీకరించినది. రాజ్యాంగసంబంధములగు నడ్డంకులు లేని తుది పరిష్కారమును కాంగ్రెసు మరల సూచింపఁగాఁ, బ్రభుత్వము దానిని గూడఁ గాలఁ దన్నినది. ఇట్లు తన్నుటచేఁ బ్రభుత్వము చేటును గొని తెచ్చుకొనుటయే కాదు, లయొనెల్ కర్టిసు చెప్పినట్లు తనపై నున్న "ధర్మకర్తృత్వమునకు ద్రోహ" మొనర్చినది. ప్రభుత్వ మిట్లు శఠించిన పిమ్మటఁ దానును గాలు ద్రవ్వుటకంటెఁ గాంగ్రెసుకు గత్యంతరము లేదు. వారు వీరనక మూఁకయుమ్మడిగాఁ బ్రభుత్వము కాంగ్రెసు సభ్యులను బందెనిడుచున్నను, యుద్ధనిధికై, యుద్ధఋణమునకై ప్రజలను బీడించి ధనము గైకొనుచున్నను,

భారత దేశము బ్రిటీషు ప్రభుత్వముతో నీ యుద్ధ విషయమునఁ బూర్ణముగా సహకరించుచున్నదని లోకమును వంచించుచున్నను గాంగ్రెసు సంవత్సరకాల మోపిక పట్టినది. ఇఁక నూరక చూచుచుండలేక మొన్నటి 18వ అగస్టునఁ గాంగ్రెసు కార్యనిర్వాహకులు వర్ధాలో సమావిష్టులై, "ప్రభుత్వమును సంకటమునఁ ద్రోయుటకు మనసొగ్గక తాల్మివహించినకొలఁదిఁ బ్రభుత్వపు టాగడములు శ్రుతి మించిపోయినవి కావునఁ" గర్తవ్య నిశ్చయ మొనర్చుటకై యఖిలభారత కాంగ్రెసు సంఘమును 15 వ సెప్టెంబరున బొంబాయి నగరమున సమావేశ పఱచుటకు నిశ్చయించెను. అహింసా విషయమున వ్యతిరేకించిన కాంగ్రెసు కార్యనిర్వాహకులీలోపల గాంధిజీతో దీర్ఘమంతనములు సాగించి మరలఁ గాంగ్రెసు నాయకత్వమును దాల్చుటకై గాంధిజీ నెట్టకేల కంగీకరింపఁజేసిరి. ముందు మార్గ మంధకార బంధురముగా నున్నను, కష్టపరంపరను గణింపక, ధర్మపరులు దైవముపై భారమిడి, కర్తవ్యమునకుఁ గడంగుదురు కదా!

ఆపదలపాలగుదు మని యెఱుఁగుదుము. కాంగ్రెసు కోరికలు 'సమంజసముగా', 'సరసముగా' నున్నవని స్టేట్సుమన్ పత్రిక వ్రాయఁగా, అస్సాముగవర్నరిటీవల నా కోరికల నెట్లు వర్ణించెనో చూడుఁడు: "1928 లో ముసోలినీ ఇటలీ ప్రజలమీఁదను, 1933 లో హిట్లరు జర్మనీ ప్రజలమీఁదను వహించిన సర్వాధిపత్యమును గాంగ్రెసు యావద్భారతీయులపై వహింపఁగోరుచున్నది." అసత్య ప్రచార మెంతదవ్వేగునో ఈ మాటలే సూచించుచున్నవి. ప్రభుత్వ హింసాకాండ తీవ్రముగా నుండఁగలదని కూడ నీ మాటలే సూచించు

చున్నవి. ఆపదలకు వెనుదీయక కాంగ్రెసు నిజధర్మము నాచరించును. అహింసాసాధనముచే సంపూర్ణ స్వాతంత్ర్యమును సంపాదించి, తన్మూలమున లోకమును హింసాకాండ నుండి రక్షించుటయే కాంగ్రెసు ధర్మము. తానున్న పోరాట మతి భయంకరము, సుదీర్ఘము నగుఁగాక, అపూర్వమగు కష్టనష్టములను భారతభూమి యెదుర్కొనవలసి వచ్చుఁగాక – కాంగ్రెసు నిజధర్మము నుజ్జగింపదు. అధ్యక్షుఁడు మసారికి చెప్పినట్లు "సర్వమునకు నీశ్వరుఁడే గలఁడను విశ్వాసముచేఁ బురుషుఁడు కర్మహీనుఁడు గాఁదగదు. సత్కర్మ ఫలించితీరునని నమ్మి, యేకాగ్రతతో దృఢసంకల్పముతో ఆశయసిద్ధికై జతనమొనర్చువాఁడే యీశ్వర భక్తుఁడు." హింసను నమ్ముకొన్నవారు ధర్మద్రోహమునకుఁ జాలుదురు గాక, అహింస నాశ్రయించినవా రందులకుఁ జాలరు.

సేవాగ్రాం, వర్ధా
6-9-1940

మ. దే.

---

# అనుబంధము

## రామఘర్ కాంగ్రెసు కార్యనిశ్చయము

1940 మార్చి నెలలో రామఘర్ కాంగ్రెసు మహాసభ ఈ క్రింది ఏకకార్య నిశ్చయమును గావించెను :

"యూరపులోఁ బొడమిన యుద్ధమువలన నేర్పడిన సంకటస్థితిని, ఆ సందర్భమున బ్రిటిషుప్రభుత్వ మవలంబించిన రాజనీతిని ఈ మహాసభ పర్యాలోచనచేసి, ఇంతకుము న్నీ విషయమునఁ గాంగ్రెసు కార్యనిర్వాహకులును, అఖిలభారత కాంగ్రెసు సంఘమును జేసిన కార్యనిశ్చయములను, జరపిన చర్యలను ఆమోదించుచున్నది. భారతప్రజలను సంప్రతించకయే బ్రిటిషుప్రభుత్వ మీ దేశమును యుద్ధమున దించి, భారతసంపదను యుద్ధమున వినియోగించుట యవమానకరమనియు, నట్టి యవమానమును స్వాతంత్ర్యప్రియులగు ప్రజలు సహింపఁజాలరనియు నీ మహాసభ తలపోయుచున్నది. భారత ప్రజను, ఆసియా ఆఫ్రికాలయందున్న ఇతర దేశవాసులను బీడించి బ్రతుకుచున్న నిజసామ్రాజ్య వృద్ధికొఱకు, పుష్టికొఱకే బ్రిటను ఈ యుద్ధమును సాగించుచున్న విషయము బ్రిటిషుప్రభుత్వ మిటీవల ఇండియాను గూర్చి చేసిన ప్రకటనలచేఁ దేటతెల్లమైనది. ఈ స్థితిలోఁ గాంగ్రెసు ప్రత్యక్షముగాఁ గాని, పరోక్షముగాఁ గాని యీ యుద్ధమునఁ బ్రమేయము గల్పించుకొనుట బ్రిటను గావించెడి యీ ప్రజాపీడనము శాశ్వతముగా వర్ధిల్లుటకే యుపకరింపఁగలదు. కావున బ్రిటను తనకొఱకు భారతసేనలచే యుద్ధముచేయించుటను, భారత ప్రజల ద్రవ్యమును గొల్లగొట్టుటను గాంగ్రెసు తీవ్రముగా నధిక్షేపించుచున్నది. యుద్ధముకొఱకిచటి సైనికసంపాదన

మును, ద్రవ్యసంపాదనమును భారతదేశము మనసార సమకూర్చి పెట్టిన ట్లెంచరాదు. కాంగ్రెసు సభ్యులును, తదభిమానులును ఈ యుద్ధముసాగించుటకై సైనికులను, ధనమును, బదార్థములను సమకూర్చి యిచ్చుట కొడంబడరు.

సంపూర్ణ స్వాతంత్ర్యముకంటె నితరమును భారత ప్రజ లంగీకరింపరని కాంగ్రెసు మరల నీ సభాముఖమునఁ బ్రకటించుచున్నది. సామ్రాజ్య చ్ఛత్రచ్ఛాయలో భారత స్వాతంత్ర్యము బ్రదుకనేరదు. ఆ సామ్రాజ్యమున డొమినియన్ మున్నగు నితరప్రతిపత్తు లిండియాకు లగింపవు. అట్టి సామంత ప్రతిపత్తి భారతీయుల యాభిజాత్యమున కర్హముగామి యటులుండ తన్మూలమున బ్రిటిషు రాజనీత్యర్థనీతులతో భారతభూమి కనేకబంధనము లేర్పడఁగలవు. భారత రాజ్యాంగమును రచించుకొనుటకు భారతీయులే అర్హులు. మా ప్రజలలో వయసువచ్చినవా రెన్నుకొన్న ప్రతినిధులు రాజ్యాంగమును రచించి, ఇతర దేశములతో మా కుండఁగల సంబంధములను నిర్ణయింతురు.

"ఇచటి భిన్నమతస్థులకు సామరస్యము గూర్చుటకై కాంగ్రెసు సర్వథా, సర్వథా యత్నించుచునే యుండునుగాని రాజ్యాంగరచనా సభవలననే శాశ్వత పరిష్కారము లభించునని యెంచుచున్నది. అల్ప సంఖ్యాకులయు, నధిక సంఖ్యాకులయు ప్రతినిధు లా సభలోఁ దమలోఁదాము, పీఠైనంత వట్టు, సమాధానము కుదుర్చుకొన్నచో, అల్ప సంఖ్యాకములుగాఁ బరిగణితములగు సంఘముల ప్రయోజనములు సురక్షితములగును. సభ్యులమధ్య సమాధానము గుదురనిచో మధ్యవర్తుల తీర్పునకుఁ గట్టుపడవచ్చును. ఇంతకంటె నితర పరిష్కా-

రములు శాశ్వతములు గాఁజాలవు. స్వాతంత్ర్యము, ప్రజాభీష్టము, ప్రజైక్యము- నివియే భారత రాజ్యాంగమునకు మూల స్తంభములు. భారతభూమిని విభజించుటనుగాని, భారత ప్రజను జీలదీయుటనుగాని కాంగ్రెసు హర్షించదు. వ్యష్టి సమష్టులు దమ యిచ్ఛనై వర్ధిల్లుటకై సమానావకాశముల నిచ్చు రాజ్యాంగమునే కాంగ్రెసు సర్వదా కోరుచున్నది. సంఘాపచారము రూపుమాసి సంఘ వ్యవస్థయందు ధర్మము నెలకొనునని కాంగ్రెసు నమ్ముచున్నది.

"సంస్థానాధిపులకు, నిచటఁ బ్రయోజనములున్న వైదేశికులకు భారత స్వాతంత్ర్యము నడ్డుదగులు నధికారము లేదని కాంగ్రెసు చెప్పుచున్నది. రాష్ట్రములందును, సంస్థానములందును సార్వభౌమత్వము ప్రజలదే. ఇతరుల ప్రయోజనములన్నియు నా ప్రజల శ్రేయమునకుఁ బిమ్మటివే. సంస్థానముల యాటంకము బ్రిటిషు కల్పితమే కావున విదేశపాలన బంధము నుండి భారతము సంపూర్ణముగా విడివడిన ట్లసందిగ్ధముగాఁ బ్రకటింపకున్నచో సంస్థానముల చిక్కు తొలఁగిపోదు. భారతప్రజల శ్రేయమున కడ్డురాని వైదేశిక ప్రయోజనములకు రక్షణము లభించునని కాంగ్రెసు మాట యిచ్చుచున్నది.

"యుద్ధ సంబంధము నిండియాకుఁ దప్పించుటకును, పరపాలనమునుండి యిండియాను విడిపించు సంకల్పమును సాధించుటకును గాంగ్రెసు తన చేతిలోని రాష్ట్ర ప్రభుత్వములను వదలికొన్నది. తదనంతరకర్తవ్యమగు శాసనోల్లంఘనమును- కాంగ్రెసు తానందులకు సుసజ్జితమైనపుడు గాని, అవశ్యమైన పరిస్థితులు త్రోసికొని వచ్చినపుడుగాని నిస్సందేహముగా

సాగించును. కావునఁ బ్రజలకు నియమనిగ్రహము లలవడిన వనియు, స్వాతంత్ర్యశపథమునందు చెప్పిన నిర్మాణ కర్మను ప్రజలు కొనసాగించుచుండి రనియుఁ దనకు నమ్మకము జనించిన పిమ్మటఁగాని శాసనోల్లంఘనము నారంభింపనని గాంధిజీ చెప్పిన మాటలను గాంగ్రెసు తన వారికి జ్ఞాపక మొనర్చు చున్నది.

"యావద్భారత ప్రజా స్వాతంత్ర్యము కొఱకే యీ పోరాటము జరుగుచున్నది. జాతి మత వర్గ విభేదములు సేయక కాంగ్రెసు సమస్త ప్రజకుఁ బ్రాతినిధ్యము వహింపనెంచు చున్నది. కావున సకల ప్రజాసంఘములు, వర్గములు నీ పోరాటమునఁ బాల్గొను నని కాంగ్రెసు ఆశించుచున్నది. భారత ప్రజా హృదయమునఁ ద్యాగబలము నావిర్భవింపఁ జేయుటయే శాసనోల్లంఘనమునకుఁ బరమార్థము.

"ఈ కార్యనిశ్చయమును గొనసాగించు నధికారమును కాంగ్రెసు మహాసభ అఖిలభారత కాంగ్రెసు సంఘమున కిచ్చు చున్నది. పనివడినచోఁ, గాంగ్రెసు కార్యనిర్వాహకులు నీ యధికారము వహింతురు గాక. ఈ యుభయులుఁ దత్తదవసరముల వలయు చర్యలకుఁ బూనుదురు గాక!"

# అకారాదిసూచిక